# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

నవంబర్ 2007 | 76 | రూ. 10


- ఫోకస్ : ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ
  బలాలూ - బలహీనతలూ
- అణు ఒప్పందం పూర్వాపరాలు
- మధ్యంతర ఎన్నికలు తప్పవా?
- ఆదివాసుల కడగండ్లపై రెండు వ్యాసాలు
- సమాల్ చర్య నేరమా?
- రెండు కాళ్ల మీద మానవ ప్రస్థానం

వీక్షణం 76 రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక

నవంబర్ 2007
సంపుటి : 5
సంచిక : 11

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ



**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : reachcdrc@yahoo.com

**డిస్ట్రిబ్యూటర్స్**
**ఆనంద్ ఏజెన్సీస్**, హైదరాబాద్.
ఫోన్ : 98482 49695
98484 28516

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

**సంపాదకీయం**

# వరి మద్దతు ధర

**త**న పాలనాకాలంలో వ్యవసాయమే పనికిరాదని ప్రవచించిన తెలుగుదేశంతో సహా రాష్ట్రంలో రాజకీయ పక్షాలన్నింటికీ రానున్న ఎన్నికల పుణ్యమా అని హఠాత్తుగా రైతులు గుర్తుకొస్తున్నారు. రాష్ట్రంలో వ్యవసాయ రంగంలో, రైతాంగానికి ఉన్న సమస్యలకు కొదవేమీలేదు. ఆ సమస్యలు ఎంతోకాలంగా ఉన్నవే, జటిలంగా మారినవి కూడ. వాటిని ఎప్పుడంటే అప్పుడు తమ ప్రయోజనాల కొరకు వాడుకో జూడడం, తమ ప్రయోజనాలు తీరగానే విస్మరించడం రాజకీయపక్షాల దగుల్బాజీతనానికి నిదర్శనం. ఈ రాజకీయ క్రీడలో భాగంగా కొత్తగా వరి మద్దతు ధర అనే సమస్య రంగస్థలం మీదికి వచ్చింది. రాష్ట్రంలో వరి రైతులకు గిట్టుబాటు ధరలు రావడం లేదనీ, ఆరుగాలం కష్టపడి పంట తీస్తే చివరికి కుటుంబానికి కూలీ కూడ గిట్టడం లేదనీ, లాభాలన్నీ మధ్య దళారీలు దండుకుపోతున్నారనీ అందరికీ తెలిసిన విషయాలే. ఇటు చివర వినియోగదారులకు కూడ బియ్యం అతి ప్రియంగా దొరుకుతుండగా రాష్ట్రంలో అడితీ వ్యాపారులు, రైస్ మిల్లర్లు, టోకు వర్తకులు మాత్రం లాభాలు చేసుకుంటున్నారు. సాధారణంగా అన్ని సరుకులకూ అమ్మేవాడి అంగడిగా ఉన్నదల్లా వ్యవసాయ ఉత్పత్తుల దగ్గరికి వచ్చేసరికి కొనేవాడి అంగడిగా ఉండడం కూడ రైతాంగాన్ని దెబ్బతీస్తున్నది. ఈ సమస్య తప్పనిసరిగా ఆందోళన కలిగించే విషయమే. విధానాలను మార్చేలా, రైతులకు గిట్టుబాటు ధర అందించేలా ప్రభుత్వాన్ని నిలదీయడం చాల అవసరమే. అయితే రాజకీయ పక్షాల అవకాశవాద ఎత్తుగడలను పక్కన పెట్టి ఈ సమస్యలోని సంక్లిష్టమైన విషయాలను ఆలోచించవలసి ఉంది. అన్ని పంటల ఉత్పాదకాల ధరలు పెరిగినట్టుగానే వరిసాగుకు కూడ ఉత్పాదకాల వ్యయం పెరిగింది. కాని ఆ వ్యయం కూడ రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలో ఒకేరకంగా లేదు. అన్ని ప్రాంతాలలో సగటు ఎకరా దిగుబడి కూడ ఒకేరకంగా లేదు. అందువల్ల అన్ని ప్రాంతాలకు ఒకే రకమైన కనీస మద్దతుధర ప్రకటించడం కొన్ని ప్రాంతాల రైతులకు నష్టమే కలగజేస్తుంది. అయినా ప్రస్తుతం ప్రభుత్వం ఇవ్వజూపిన క్వింటాలుకు రు. 725 బదులు రైతాంగం అడుగుతున్నట్టు వెయ్యి రూపాయలు ఇవ్వడం రైతులకు కొంత మేలు కావచ్చు. అయితే ఇక్కడ వరి రైతు అనే ఒక్క ప్రమేయంతో మాత్రమే ఆలోచిస్తే కొన్ని సమస్యలు ఉన్నాయి. ఈ వరి ఉత్పత్తి – వినియోగం గొలుసులో రైతులు మధ్యలో ఉన్నారు. అటుచివర కూలీలు, ఇటు చివర వినియోగదారులు కూడ ఉన్నారు. విత్తనాలు, ఎరువులు, క్రిమి సంహారకాలు, విద్యుచ్ఛక్తి, నీరు వంటి ఉత్పాదకాలు, మార్కెటింగ్‌లో మధ్య దళారీ వ్యవస్థ అన్నీ రైతు సమస్యలను పెంచుతున్న అంశాలే. ఈ మద్దతుధర పెంచడం వల్ల అటు కూలీలకు ఎక్కువ కూలీరేట్లు దక్కుతాయనే నమ్మకం లేదు, ఇటు మధ్య దళారీలు, వ్యాపారులు ఆ పెరిగిన భారాన్ని పూర్తిగా వినియోగదారులమీదికే నెట్టే ప్రమాదం ఉంది. అంటే వినియోగదారుల మీద భారం పెరిగి మార్కెట్లో బియ్యం ధరలో పెద్ద ఎత్తున పెరుగుదల ఉంటుంది. కనుక వరి మద్దతుధర నిర్ణయంలో రైతాంగ సమస్యలను మాత్రమేగాక, కూలీల, వినియోగదారుల సమస్యలను కూడ పరిగణనలోకి తీసుకోవాలి. మధ్య దళారీల దోపిడీపై, లాభాపేక్షపై కేంద్రీకరించాలి. గిట్టుబాటు ధరల కోసం పోరాడుతున్న వరి పండించే రైతాంగం గాని, వారికి మద్దతుగా నిలుస్తున్న రాజకీయ పక్షాలు గాని, ప్రజా సంఘాలు గాని, తమ న్యాయమైన ఆకాంక్షల కోసం పోరాడుతూనే అన్ని సంబంధిత వర్గాల సమన్వయాన్ని సాధించడానికి కృషి చేయాలి. అన్ని సంబంధిత వర్గాల ప్రయోజనాలకు వ్యతిరేకంగా ఉన్న మధ్య దళారీలను, పాలకులను ఎండగట్టడానికి ప్రయత్నించాలి. ◆

## తెహల్కా కొత్త నిజాలు

గుజరాత్‌లో ముస్లిం ప్రజానీకం మీద 2002లో జరిగిన దుర్మార్గమైన మారణకాండ గురించిన అసలు వాస్తవాలను తెహల్కా వారపత్రిక బయట పెట్టింది. స్వయంగా ఆ మారణకాండలో పాల్గొన్నవారు ప్రకటించిన నిజాలను బహిర్గతం చేసింది. అవన్నీ అందరికీ అయిదు సంవత్సరాలుగా తెలిసిన నిజాలే అయినప్పటికీ, మారణకాండ జరిగిన వెంటనే అక్కడ పరిశోధనలు జరిపిన అనేకమంది పత్రికా విలేకరులు, స్వతంత్ర విచారణ సంఘాలు బైటపెట్టినవే అయినప్పటికీ, తెహల్కా పరిశోధనలో ఒక ముఖ్యమైన తేడా ఉంది. గతంలో ఇవే విషయాలు ప్రకటించిన వారందరూ బాధితుల వాంగ్మూలాల నుంచి, ప్రజాస్వామిక వాదుల మాటల నుంచి, పరిస్థితుల ఆధారాలను బట్టి తమ నిర్ధారణలు ప్రకటించారు. నరేంద్రమోడీ ప్రభుత్వం ఆ మారణకాండను పూర్తిగా పథకం ప్రకారం నడిపిందని వెల్లడించారు. ప్రస్తుతం తెహల్కా ఆ వాస్తవాలనే అవతలి వైపు నుంచి, దారుణాలు స్వయంగా చేసినవారి నుంచి, దాడులూ గృహదహనాలూ హత్యలూ అత్యాచారాలూ చేసిన వారి నుంచి, సంఘపరివార్ కార్యకర్తల నుంచి సేకరించి ప్రకటించింది. ఆశిష్ ఖేతాన్ అనే విలేకరి పీయుష్ అగర్వాల్‌గా పేరు మార్చుకుని, తనను తాను హిందుత్వ శక్తుల విజృంభణపై పరిశోధన చేస్తున్న ఢిల్లీ విశ్వవిద్యాలయ పరిశోధక విద్యార్థిగా చెప్పుకుని గుజరాత్‌లో ప్రవేశించి సంఘపరివార్ – మాఫియా కలగలసిన నేరస్తుల స్థావరాలలోకి వెళ్లి, ఆరు నెలలపాటు ఆ దుండగులతో మాట్లాడుతూ రహస్య కెమెరాలలో వారి చేష్టలను, మాటలను బంధించాడు. ఆ దారుణ మారణకాండను ముఖ్యమంత్రి నరేంద్రమోడీ, హోంమంత్రి, పోలీసు అధికారులు పథకం ప్రకారం ప్రోత్సహించారని, నేరస్తులకు మద్దతు ఇచ్చారని వేలాదిమంది ముస్లింలను ఊచకోత కోసి, వందలాది మంది ముస్లిం స్త్రీలపై అత్యాచారం చేసిన ఆ నేరస్తులు స్వయంగా చెప్పిన సాక్ష్యాల వల్ల స్పష్టంగా బయటపడుతున్నది. ఇప్పటికైనా నేరస్తులకు తగిన శిక్ష విధించి, బాధితులకు పరిహారం అందించకపోతే గుజరాత్ జాతిహననకాండ వల్ల తలెత్తే దుష్పరిణామాలకు ప్రభుత్వాలే బాధ్యత వహించవలసి ఉంటుంది.

## న్యాయవ్యవస్థ బొమ్మా బొరుసూ

మిగిలిన రాజ్యాంగ వ్యవస్థలన్నీ ఒకటొకటిగా విఫలమవుతూ ప్రజలను వంచిస్తుంటే, ఇప్పటికీ న్యాయవ్యవస్థ మీద ప్రజలకు ఎంతో కొంత నమ్మకం ఉంటున్నది. దేశంలో అత్యున్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టుకు ప్రధాన న్యాయమూర్తిగా పనిచేసిన వ్యక్తి పైననే కుటుంబ సభ్యుల ఆర్థిక ప్రయోజనాల కొరకు తప్పుడు తీర్పు ఇచ్చారనే అవినీతి ఆరోపణ రావడంతో న్యాయ వ్యవస్థపై కూడ నమ్మకం తరిగిపోయే పరిస్థితి వచ్చింది. మామూలుగానే తమ కుటుంబ సభ్యులు, తమకు తెలిసినవారు ఒక వ్యాజ్యంలో ఉన్నప్పుడు ఆ వ్యాజ్యంపై తీర్పు చెప్పే స్థానంలో ఉండగూడదని సాధారణ సహజ న్యాయసూత్రం చెపుతుంది. కాని ఆ న్యాయమూర్తి మాత్రం తన కుమారులు భాగస్వాములైన వ్యాపార సంస్థ కేసును మరొక బెంచి నుంచి తన ముందుకు తెప్పించుకుని తన కుమారులకు కోట్ల రూపాయల లాభం కలిగే తీర్పు ఇచ్చారు. అమలులో ఉన్న చట్ట ప్రకారం పదవిలో ఉన్న న్యాయమూర్తులు చేసిన నిజమైన తప్పుల మీద కూడ మాట్లాడలేని స్థితి ఉంది. అలా మాట్లాడితే అది కోర్టు ధిక్కార నేరం అవుతుంది. అందువల్ల ఆ ప్రధాన న్యాయమూర్తి పదవీ విరమణ చేసిన తర్వాత మిడ్ డే పత్రిక ఆ ఉదంతాన్ని పరిశోధించి పూర్తి సాక్ష్యాధారాలతో ఒక కథనాన్ని ప్రకటించింది. అందుకు గాను ఆ పత్రికా యజమాని, సంపాదకులు, విలేకరి, కార్టూనిస్టు జైలుశిక్షను అనుభవించవలసి వచ్చింది. ఈ తప్పుడు వైఖరిని ప్రజాస్వామిక వాదులందరూ ఖండిస్తుండగానే, మరొక కేసులో ఢిల్లీ సెషన్స్ న్యాయస్థానం ఒక సరైన తీర్పు చెప్పి మళ్లీ న్యాయ వ్యవస్థ మీద ఆశను కలిగించింది. పది సంవత్సరాల కింద ఒక బూటకపు ఎన్‌కౌంటర్‌లో ఇద్దరు అమాయకులను చంపివేసిన ఘటనలో ఒక అసిస్టెంట్ కమిషనర్‌తో సహా 10 మంది నేరస్తులైన పోలీసు అధికారులకు యావజ్జీవ కారాగార శిక్షను ప్రకటించింది. తప్పు ఎవరు చేసినా తప్పేనని, పోలీసు దుస్తుల్లో ఉన్నంత మాత్రాన తప్పుచేసి తప్పించుకోలేరని ప్రకటించింది. అంతకు ముందే నిజామాబాద్ సెషన్స్ న్యాయస్థానం కూడ అటువంటి అరుదైన తీర్పులు ప్రకటిస్తూ పోలీసులను నేరస్తులుగా నిర్ధారించకపోయినా ఎన్‌కౌంటర్‌లు బూటకమైనవని, హతుల కుటుంబాలకు నష్టపరిహారం చెల్లించాలని ఆదేశించింది. ఇటీవలి ఈ న్యాయస్థానాల తీర్పులు మన న్యాయవ్యవస్థలోని రెండు ముఖాలకు అద్దం పడుతున్నాయి.

## మయన్మార్

ఈసారి మయన్మార్‌లో బౌద్ధ భిక్షువులు ప్రజాస్వామ్యం కోసం పోరాటం ప్రారంభించారు. సెప్టెంబర్ 18న ప్రారంభమైన ఆ శాంతి, ప్రజాస్వామిక ప్రదర్శనలు బౌద్ధ ఆచారం ప్రకారం తొమ్మిది రోజులు జరపాలని తలపెట్టారు. సైనికపాలకులు ఆ శాంతియుత ప్రదర్శనలపై విరుచుకుపడి సెప్టెంబర్ 26న ప్రదర్శకుల మీద కాల్పులు జరిపారు. ప్రభుత్వ లెక్కల ప్రకారమే 10 మంది మరణించగా, వందలాది మంది గాయపడ్డారు. ఒకవైపు ఆ దేశంలో ప్రజాస్వామ్యంకోసం పోరాడుతున్న ఆంగ్ సాన్ సూచీ కి నోబెల్ శాంతి బహుమతితోపాటు గౌరవాదరాలు అందజేస్తున్న అనేక దేశాలు మయన్మార్ పాలకుల దుర్మార్గాల మీద మాత్రం నోరుమెదపడం లేదు, అర్థవంతమైన చర్యలు తీసుకోవడం లేదు, ఆంక్షలు విధించడం లేదు. నేపాల్‌లో మావోయిస్టులు బలపడకుండా చేయడానికి అక్కడి రాజకీయాలలో పిలవని పేరంటంగా ప్రవేశించిన భారత ప్రభుత్వం మయన్మార్‌లో సైనికపాలనకు వ్యతిరేకంగా అక్కడి ప్రజలు వీరోచితంగా జరుపుతున్న ప్రజాస్వామిక ఉద్యమానికి ఎంతమాత్రం మద్దతు తెలపడంలేదు. సరిగదా మయన్మార్ సైనిక పాలకులతో ఇంకా ఎక్కువ సంబంధాల కోసం ప్రయత్నిస్తున్నది. మరొకవైపు రెండు దశాబ్దాలుగా ప్రజలమీద దుర్మార్గమైన పాలన సాగిస్తున్న సైనిక నియంతృత్వ ముఠాపాలనను అటు తమను తాము కమ్యూనిస్టులమని చెప్పుకుంటున్న చైనా ప్రభుత్వం, ఇటు అమెరికా అనుకూల ఆగ్నేయాసియా దేశాల సమాఖ్య బలపరుస్తున్నాయి. హంతక ప్రభుత్వానికి అందుతున్న ఈ మద్దతు అన్ని దేశాల ప్రభుత్వాల పట్ల మయన్మార్ ప్రజల ఆగ్రహాన్ని పెంచడానికే దారి తీస్తుంది. ఈ మద్దతు మయన్మార్ ప్రజల విజయాన్ని ఆలస్యం చేయవచ్చు గాని ఆపజాలదు. ◆

## లోపలి పేజీల్లో...



### ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ - బలాలూ, బలహీనతలూ

బలం అని దేన్ని అనాలి, బలహీనత అని దేన్ని అనాలి అనేది కూడ వ్యాఖ్యాత దృక్పథాన్ని బట్టి మారుతూ ఉంటుంది. ఒకరు బలం అనుకున్నది మరొకరు బలహీనత అనుకోవచ్చు. తమ రక్తమాంసాలు, శక్తియుక్తులు అర్పిస్తూ ఈ ఆర్థిక వ్యవస్థ పురోభివృద్ధికి దోహదం చేస్తున్న అసంఖ్యాక శ్రామిక జనాభాను 'మానవ' ప్రధాన దృక్పథం ఈ ఆర్థిక వ్యవస్థను బలంగా చూస్తే, అదే శ్రామిక జనంలో అత్యధిక భాగం 'పెట్టుబడి' ప్రధాన దృక్పథానికి ఊరికే కూచుని తినే భాగంగా, బలహీనతగా కనబడుతుంది.

### ఫోకస్ : ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ - బలాలూ, బలహీనతలూ



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలుపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028







- **తూనీగలు** – నానీలు – వి. త్రివేణి – విశ్వశ్రీ ప్రచురణలు, 34 పేజీలు, 1/8 డెమీ, రు. 30. ప్రతులకు : వి. త్రివేణి, 5–66, ప్రభుత్వ బి.సి. బాలుర హాస్టల్ ఎదురుగా, మల్లికార్జుననగర్, ఆదిలాబాద్ – 504 001. ఫోన్ : 08418-316859
- **ముంపు** – పోలవరం ప్రాజెక్ట్ వ్యతిరేక దీర్ఘ కవిత– పి. విద్యాసాగర్ – కిన్నెర ప్రచురణలు, 54 పేజీలు, 1/8 డెమీ, రు.20. ప్రతులకు: పి. విద్యాసాగర్, క్వార్టర్ నెం. ఎచ్–237, ఇంటర్మీడియెట్ కాలనీ, పాల్వంచ – 507 115. ఖమ్మం జిల్లా. ఫోన్ : 99635 70174
- **స్త్రీలు–కుటుంబ హింస – రక్షణ చట్టం 2005** – హేమా వెంకట్రావ్, ఆమె @ సమానత్వం ప్రచురణలు, 56 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : హేమా వెంకట్రావ్, సమితి ఆఫీస్ రోడ్డు, కొత్తపేట, తూర్పు గోదావరి జిల్లా, అన్ని పుస్తక షాపుల్లో
- **భారత స్వాతంత్ర్యోద్యమం–ముస్లిం ప్రజాపోరాటాలు** – సయ్యద్ నశీర్ అహ్మద్, తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్, 162 పేజీలు, 1/8 డెమీ, రు. 100
- **భారత స్వాతంత్ర్య సంగ్రామం – ముస్లిం యోధులు** – మొదటి భాగం – సయ్యద్ నశీర్ అహ్మద్, తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్, 315 పేజీలు, 1/8 డెమీ, రు. 200,

  పై రెండు పుస్తకాల ప్రతులకు : తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్, సందేశ భవనం, లక్కడ్‌కోట్, చత్తాబజార్, హైదరాబాద్ – 500 002, ఫోన్ : 24564583
- **బి.ఎస్. రాములు కథలు – ఒక పరిశీలన** – కర్రె సదాశివ్, 158 పేజీలు, 1/8 డెమీ, రు. 50. ప్రతులకు: కర్రె సదాశివ్, 3-11-12, కుమర్‌పల్లి, బుద్ధభవన్ రోడ్, హనుమకొండ, వరంగల్ – 506 001. ఫోన్ : 99494 24726
- **ఏంగెల్స్ – ప్రకృతి–గతితర్కం** – సంక్షిప్తానువాదం – ప్రొ. వి.వి. కృష్ణారావు – లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 184 పేజీలు, 1/8 డెమీ, రు. 50
- **జేమ్స్ పెట్రాస్–వ్యాస సంకలనం – 1** – అనువాదకులు – పిళ్లా వెంకటేశ్వరరావు (బక్కసారు), ఎం. సంజీవరెడ్డి, ఆర్వీయార్ మాస్టారు, 'మార్క్సిస్ట్' సైద్ధాంతిక బులెటిన్, ఆంధ్రజ్యోతి సౌజన్యంతో... లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 206 పేజీలు, 1/8 డెమీ, రు. 75

  పై రెండు పుస్తకాల ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 5–85–4/బి, పండరీపురం, 1వలైన్, గుంటూరు–522 002, ఫోన్ : 9848877596, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **తిరంగా ముసల్మాన్** – ఎ. రాజాహుస్సేన్ – రామయ్య విద్యాపీఠం ప్రచురణలు, 48 పేజీలు, 1/8 డెమీ., రు. 30
- **తరగతి** – చుక్కా రామయ్య – రామయ్య విద్యాపీఠం ప్రచురణలు, 128 పేజీలు, 1/8 డెమీ., రు. 50

  పై రెండు పుస్తక ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, జర్నలిస్టు, 1–8–702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044, రాష్ట్రంలోని అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో







# పాఠకుల వీక్షణం

**రా**మసేతుపై కిష్కింధకాండ' జి.ఎస్. రామ్మోహన్ గారి వ్యాసం చదివాను. వ్యాసంలో రచయితగారు సెక్యులరిజం భావజాలాన్ని ముక్కుసూటిగా, కుండబద్దలు కొట్టినట్లుగా, కట్టె విరిచి పొయ్యిలో పెట్టినట్లుగా వ్యక్తీకరించటంలో విఫలమయ్యారనేది నా అభిప్రాయం. వ్యాసం మధ్యలో అక్కడక్కడా కొంత సంతులనదిశగా రచనా సాగినప్పటికీ హిందూయేతర మతమౌఢ్యాన్ని ఉన్నదున్నట్లుగా వ్యక్తీకరించడంలో కొంతవరకు మాత్రమే సఫలీకృతులైయ్యారు.

నేటి భారత లౌకికదేశంలో బూటకపు సెక్యులరిజం పోకడలు మితిమీరుతున్నాయన్న సంగతి విస్మరించినట్లుగా అనిపించింది. తమను తాము సెక్యులర్ పార్టీలుగా అభివర్ణించుకొనే పార్టీలు హిందువులకు వ్యతిరేకంగా జరిగే అన్యాయాలను, అక్రమాలను, అవమానాలను శీఘ్రగతిన ఖండించేందుకు జంకుతున్నాయి. ఈ విషయంలో రచయిత స్పందన అంతంతమాత్రంగానే ఉందనేది నా అభిప్రాయం.

ఈ దేశంలో ఇప్పటికీ సెక్యులరిజం బతికి బట్టకట్టుతుందంటే అది కేవలం హిందువుల సహనశీలత అనేది జగమెరిగిన సత్యం. అదే సందర్భంలో బి.జె.పి. ఈ దేశంలో ఉనికిని కాపాడుకోగలుగుతుందంటే అందుకు కారణం బూటకపు సెక్యులర్ పార్టీలు అవలంబిస్తున్న పక్షపాత ధోరణులే కారణం. ఈ కఠోర సత్యాన్ని రచయిత విస్మరించారు. అసలు కిష్కింధకాండను అమలుచేస్తున్నది 'రామసేతు' అనే బదులు 'ఆడమ్స్ బ్రిడ్జి' అని బలవంతంగా మస్తిష్కంలో ఎక్కించుకొన్న వారిదేనని నా ప్రగాఢ విశ్వాసం.

**– జూల ముత్తెన్న**
మెదక్

**కా**ర్పొరేట్ విధానాల వలన సమాజంలోని అన్ని రంగాల్లో దాని తీవ్రత ఉంటుంది. అందుకు గ్రామీణ విద్యారంగానికి మినహాయింపు ఏమీలేదు అని చెప్పటానికి రాష్ట్రంలో జరుగుతున్న పరిణామాలే నిదర్శనం. మండల స్థాయిలో, జిల్లా స్థాయిలో సాంఘిక సంక్షేమ హాస్టళ్లలో పరిస్థితి చాలా దుర్భరంగా ఉంది. ఈ హాస్టళ్లో కనీస మౌలిక సదుపాయాలు లేక పేద మధ్య తరగతి విద్యార్థులు అనారోగ్యంపాలై చదువుకు దూరం అవుతున్నారు. వాటిని గురించి పట్టించుకోని ప్రభుత్వం 'గ్రామీణ పబ్లిక్ స్కూళ్ల' ఏర్పాటు చేయడానికి తహతహలాడడం వెనుక ఎంతో కుట్ర దాగి ఉంది. ఇప్పటికే కార్పొరేట్ విద్యా విధానం వల్ల పేద ప్రజలకు విద్య అందుబాటులో లేకుండాపోయింది. అట్టడుగు వర్గాలకు విద్య అనే మాట సత్య దూరం అవుతోంది.

ప్రభుత్వ గ్రామీణ పబ్లిక్ స్కూళ్ల వ్యవహారం చూస్తుంటే కార్పొరేట్ ధనవంతుల చేతుల్లోకి విద్య సంపూర్ణంగా పోయే ప్రమాదం ఉంది. పేద ప్రజలకు ఇరవై గజాల భూమి అడిగినందుకే తుపాకీ తూటాలను రుచి చూపిన పాలకులు రాజస్థాన్, ముంబాయికి చెందిన సంస్థలకు గ్రామీణ పబ్లిక్ స్కూళ్లను కట్టబెట్టాలని చూస్తున్నారు. ప్రభుత్వానికి చిత్తశుద్ధి ఉంటే ఇప్పుడు ఉన్న సంక్షేమ హాస్టళ్లకు, ఎపి రెసిడెన్షియల్, నవోదయ స్కూళ్లకు మరిన్ని మౌలిక సదుపాయాలు కల్పిస్తూ ప్రభుత్వ పర్యవేక్షణలో అదనంగా ఉపాధ్యాయులను తీసుకొని పేద, మధ్యతరగతి విద్యార్థులను చేర్చుకోవచ్చు.

ఇప్పటికే విద్యర్థులు పాఠశాలలకు రావడంలేదు అనే సాకుతో అయిదు వేల స్కూళ్లను మూతవేయించాలి అనే ఉద్దేశంతో ప్రభుత్వం అనేక పద్ధతులను అవలంబిస్తోంది. దీనికోసం ప్రతి ఒక్కరు ఆలోచించాల్సి ఉంది.

**– మహ్మద్ రఫీ**
పర్కాల, వరంగల్

**రా**జకీయార్థిక సామాజిక విశ్లేషణల ద్వారా సమాజాన్ని అర్థం చేసుకోవడానికి, సమాజాన్ని పట్టిపీడిస్తున్న రుగ్మతలను పాఠకలోకానికి అందిస్తూ వివిధ పరిశోధనలకు యువతకు తగిన ప్రోత్సాహాన్ని అందిస్తూ, "నూరు పువ్వులు వికసించనీ వెయ్యి ఆలోచనలు సంఘర్షించనీ" అన్న సూక్తిని ప్రతిఫలింపజేస్తున్న 'వీక్షణం' పబ్లికేషన్స్‌కు అభినందనలు. నేను శ్రీరాముల శ్రీనివాస్ మావోయిస్టు రాజకీయ ఖైదీని. చర్లపల్లి సెంట్రల్ జైలులో లైబ్రరీ ఉన్నప్పటికీ సామాజిక దృక్పథం కల్గిన సాహిత్యం బహుకొద్ది. ఇవి కూడా ఇక్కడి ఖైదీల సగటు చైతన్యానికి తగిన విధంగా లేవు. ఈ జైలులో కూడా విద్యావంతులు, ప్రాథమిక, ఉన్నత విద్యలను అభ్యసించిన వారు ఉన్నారు. వీరు మానసిక ఒత్తిడికి గురవుతూ ఇటు జైలులో అటు కుటుంబాలలో వస్తున్న సమస్యలతో నాలుగు గోడలమధ్య నిర్జీవంగా జీవిస్తున్నారు. కారాగారాలు ఖైదీలను సంస్కరించడానికి కాకుండా అవమానపరిచేవిగా, విధానాల పేర శిక్షలను పెంచేవిగానో, తగ్గించేవిగానో (కావాల్సిన వారికి) మరింత క్షోభకు గురిచేస్తున్నాయి. 'వీక్షణం'లో వస్తున్న వివిధ విశ్లేషణలు ఖైదీలు ఈ వాతావరణం నుండి బయట పడటానికి తోడ్పడుతాయనే ఆశతో, ఈ 'వీక్షణా'న్ని ఖైదీలు స్వంతం చేసుకొనేలా పత్రికను, ప్రచురణలను పరిచయం చేస్తూ ఒక సమావేశం నిర్వహించినట్లయితే అవగాహన పెరగడమేగాక పౌరుడిగా తన బాధ్యతను గుర్తించడానికి దోహదపడుతుంది.

'వీక్షణం' పత్రిక, పబ్లికేషన్స్ జైలుకు రాకపోవడం వల్ల చదవడానికి అవకాశం లేకుండాపోయింది. మీరు ఖైదీలకు మీ పబ్లికేషన్స్ పంపించడం ద్వారా నాలుగు గోడల మధ్య నుండి సమాజాన్ని వీక్షించడానికి తోడ్పడతారని భావిస్తున్నాను.

**– శ్రీరాముల శ్రీనివాసులు**
చర్లపల్లి సెంట్రల్ జైలు

**'వీ**క్షణం' అక్టోబర్ 07 సంచికలో పవన్ కళ్యాణ్ ఉదంతం 'చెప్పేవారికి వినేవారు లోకువా' అనే వ్యాసం బాగుంది. సమాజంలో గుర్తింపు ఉన్నవారైనా, సామాన్య ప్రజలైనా న్యాయస్థానానికి సమానమే. కానీ, ఈ ప్రజాస్వామ్య సూత్రాన్ని పవన్ కళ్యాణ్ ఉదంతంలో న్యాయస్థానం ఉల్లంఘించింది. న్యాయస్థానాలు కూడా ఇట్లా వ్యవహరిస్తే ప్రజాస్వామ్యం ప్రశ్నార్థకమవుతుంది. పవన్‌కళ్యాణ్, బాలకృష్ణలకు చట్టం, న్యాయాలే అతీతంగా ఉన్నాయని తేలిపోయింది. కాశ్యప్ వ్యాసం ఈ విషయాన్ని చాలా బాగా వివరించింది.

**– రవిప్రసాద్**
కర్నూలు

**'వీ**క్షణం' అక్టోబర్ 07 సంచికలో 'గద్వాల సంస్థానంలో అక్రమమైన పన్నులు' అనే శీర్షికన వచ్చిన వ్యాసం ఇప్పటికి అరవై అయిదేళ్ల క్రితం రైతాంగం పడ్డ అష్ట కష్టాలు మన ముందుంచాయి. గద్వాల సంస్థానం రైతాంగంపై రకరకాల పేర్లతో అక్రమ పన్నులు విధించి వారిని హింసించిన తీరు కంట తడి పెట్టించింది. సరిగ్గా ఈనాటికీ రైతాంగం అదే విధంగాను, మరింత అధ్వాన్నంగాను పడుతున్న కష్టాలు, చేసుకుంటున్న ఆత్మహత్యలు మనకు అప్పటి నుంచి ఇప్పటి వరకు పాలకుల విధానాలు ఏమాత్రం మారలేదని చూపుతున్నాయి. ప్రజల మీద బాధ్యతతో, ప్రేమతో బద్దం యెల్లారెడ్డి, వట్టికోట ఆళ్వారుస్వామి గద్వాల సంస్థానానికి సమర్పించిన ఈ నివేదిక నిజంగానే సామాజిక పరిశోధన చేసేవారికి ఎంతో ఉపయోగ పడుతుంది. ప్రజల బాధ్యతతో, నిబద్ధతతో పనిచేసేవారికి మార్గదర్శకంగా ఉంటుందనడంలో ఎంత మాత్రం సందేహం లేదు.

**– పి. శంకర్**
మహబూబ్‌నగర్

**'వీ**క్షణం'లో బాలకార్మికులు, విద్యా, వైద్య రంగాలు, రవాణా వ్యవస్థ, పర్యావరణం లపై విశ్లేషణాత్మకమైన వ్యాసాలు వస్తే బాగుంటుంది.

**– సుధాకర్**
గుంటూరు

## ప్రాణాలతో గేమ్స్ - గ్యామన్ ఇండియా

పంజాగుట్ట ఫ్లై ఓవర్ కూలడం వెనుక దాని నిర్మాణ సంస్థ గ్యామన్ ఇండియా నిర్లక్ష్యమే ప్రధాన కారణమని నిపుణుల కమిటీ తేల్చి చెప్పింది. ఈ నిర్లక్ష్యానికి జరిమానాగా ప్రాజెక్ట్ వ్యయంలో పదిశాతం అంటే మూడు కోట్ల రూపాయలను ప్రభుత్వానికి ఆ సంస్థ చెల్లించాలని సిఫారసు చేసింది. ఫ్లై ఓవర్ నిర్మాణ బాధ్యతను పర్యవేక్షిస్తున్న తనికెళ్ల ఇంటిగ్రేటెడ్ కన్సల్టెంట్స్ లిమిటెడ్, టాండన్ కన్సల్టెంట్స్ ప్రైవేట్ లిమిటెడ్, జాయింట్ వెంచర్ ప్రాజెక్ట్స్ మేనేజ్‌మెంట్స్ కన్సల్టెంట్స్, గ్రేటర్ హైదరాబాద్ మున్సిపల్ కార్పొరేషన్, హైదరాబాద్ మెట్రో వాటర్ వర్క్స్‌ల నిర్లక్ష్యం కూడా ఇందులో ఉందని ఆర్ అండ్ బి ఇంజనీర్ ఇన్ ఛీఫ్ కె. శివారెడ్డి అధ్యక్షతన ప్రభుత్వం ఏర్పాటు చేసిన ఐదుగురు ఇంజనీర్ల కమిటీ తన 157 పేజీల నివేదికలో స్పష్టం చేసింది. సెప్టెంబర్ 27న పురపాలక శాఖ మంత్రి కోనేరు రంగారావుకు ఈ కమిటీ తన నివేదికను అందజేసింది. కాటన్ నాటి బ్రిడ్జీలు, షాజహాన్, నిజాంల నాటి కట్టడాలు, ప్రపంచ అద్భుతాలుగా ఇప్పటికీ చెక్కు చెదరకుండా ఉంటే, మఖలో పుట్టి పుబ్బలో పోయినట్లు ఇప్పటి ప్రాజెక్టులు లాభాలు మాత్రమే ధ్యేయంగా కొనసాగుతున్నాయి. 'సంక్షేమం' పునాదిగా కాక, 'లాభం' మాత్రమే పునాదిగా పైకి లేచే నిర్మాణాలకు మనుషుల ప్రాణాలు కారుచౌకగానే ఉంటాయి. విశేషమేమంటే ప్రభుత్వం గుర్తించిన కేటగిరీ – 1 మూడు సంస్థల్లో స్కెన్‌స్కా సిమెంటేషన్ ఇండియా, ఎన్.సి.సి., గ్యామన్ ఇండియాలు ఉన్నాయి.

## 'రియల్' హత్య - 'ఎన్‌కౌంటర్' న్యాయం

బ్యాంకులో అప్పులు తీసుకుని తిరిగి చెల్లించని వారి వెంట ఉద్యోగ ధర్మంగా వెంటపడ్డ స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండోర్, ద్వారకా బ్రాంచి చీఫ్ మేనేజర్ కానూరి కామనప్రసాద్ అక్టోబర్ 18న కిడ్నాపై, 20నాడు హత్య గావించబడ్డారు. దీనివెనుక విశాఖ రియల్ ఎస్టేట్ ఛాయలు కనిపిస్తున్నాయి. నేరపూరితంగా మారిపోయిన విశాఖపట్నంలోని భూవ్యాపారం ఈ సంఘటనతో కళ్లకు కడుతోంది. విశాఖలో రియల్ బూమ్ రావడంతో చాలామంది బ్యాంకుల్లో ఆస్తులు తనఖా పెట్టి, భారీగా రుణాలు తీసుకుని రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తున్నారు. ఈ వ్యాపారంలో దెబ్బతిన్నవారు రుణాలు తిరిగి చెల్లించలేక పోతున్నారు. రుణాల రికవరీలో నిక్కచ్చిగా వ్యవహరిస్తూ, రుణగ్రహీతల ఆస్తులజప్తు కార్యక్రమం కొనసాగిస్తున్న ప్రసాద్‌కు ఎవరినుంచి ప్రమాదం ఉందో తెలుసు కోవడం కష్టం కాదు. సులభ సంపదకోసం పరుగులో మనిషి ప్రాణాలు ఇలా బలయిపోవడం విశాఖ ప్రజలను కలవరపరుస్తోంది. హంతకులుగా అనుమానించి అదుపులోకి తీసుకున్న వారిలో ఇద్దరిని పోలీసులు 'ఆత్మరక్షణార్థం' హతమార్చి ఎన్‌కౌంటర్ న్యాయాన్ని అమలు చేశారు.

## ఆస్ట్రోనాటికల్ కాంగ్రెస్

సెప్టెంబర్ 24న '58వ ఇంటర్‌నేషనల్ ఆస్ట్రోనాటికల్ కాంగ్రెస్ (ఐఎసి)' హైదరాబాద్‌లో ప్రారంభమయింది. ఈ సదస్సులో నలభై అయిదు దేశాలకు చెందిన రెండువేల ఖగోళ నిపుణులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా కేంద్ర మంత్రి పృథ్వి చౌహాన్ మాట్లాడుతూ అంతరిక్ష ఆస్తులను పరిరక్షించుకోవాలని, పరస్పర సహకారం గురించి ఆలోచించాలని అన్నారు. వచ్చే అయిదేళ్లలో అరవై అంతరిక్ష ప్రయోగాలకు సిద్ధమౌతున్నట్లు ప్రకటించారు. ఏదేమైనా ఈ అంతరిక్ష పరిశోధనలు నేలపై ఉన్న సామాన్యులకు ఇంత అన్నం పెడతాయా అన్నదే ప్రశ్న. సముద్రంలో రామసేతుకై, చంద్రుడిపై సాయి రామ్ కై, అంతరిక్షంలో రియల్ ఎస్టేట్ కై, ప్రజాస్వామిక ఆకాంక్షలపై డేగచూపుకై కాక పరిశోధనా ఫలాలు భూమార్గం పట్టే అవకాశమేదైనా ఉందా అనేదే మౌలికమైన ప్రశ్న.

## వరికి ధరలేదు.... రెండుకే కిలో బియ్యం

మధ్యంతరం వేడి ఒక్కసారిగా ఎగజిమ్మి అంతలోనే తాత్కాలికంగా తగ్గుముఖం పట్టింది. రాజకీయ పార్టీలన్నీ మధ్యంతరం కోసం ప్రణాళికలు సిద్ధం చేసుకుంటున్నాయి. వాగ్దానాలు, వరాల జల్లులు కురిపిస్తున్నాయి. నిన్న కష్టసాధ్యమన్న 'ఉచిత విద్యుత్తు' నేడు సాధ్యమే అని తెలుగుదేశం పార్టీ ప్రకటించింది. రెండు రూపాయలకు కిలో బియ్యం, మరిన్ని ఉద్యోగాలు ఇలా రకరకాల కొత్త వాగ్దానాలతో కాంగ్రెస్ ప్రభుత్వం వ్యూహాలు రచిస్తోంది. అరవై ఏళ్ల స్వాతంత్ర్య భారతంలో లక్షలాది ఇళ్లు కట్టించే అవసరం ప్రజలకు గూడులేని పరిస్థితిని సూచిస్తుంటే, ఇంకా కూడు, గుడ్డ అందడానికి చాలాకాలమే పట్టవచ్చు. ఒకపక్క రైతులు వరి మద్దతు ధరకోసం, గిట్టుబాటు ధరకోసం ఉద్యమిస్తుంటే, రెండు రూపాయలకే కిలో బియ్యం ఇస్తానని ప్రభుత్వం ప్రకటనలు గుప్పిస్తోంది. ఓటరు మహాశయులారా పారాహుషార్...

## దిగజారుడు ఇక భాషలోకి...

పాలనపై, సిద్ధాంతాలపై, విధానాలపై విమర్శలు పోయి రాజకీయాలు వ్యక్తిగత దూషణలకు, సంకుచిత వ్యాఖ్యలకు దిగజారి పోయాయి. స్వయంగా ముఖ్యమంత్రి 'అమ్మ కడుపున ఎందుకు పుట్టానా అని బాధపడతావు' అని, రోశయ్య 'చెయ్యితీస్తా' అని, కాంగ్రెస్ మహిళా విభాగం నాయకురాలు గంగభవాని 'నాలుక కోస్తా' అని, తెలుగుదేశం మహిళా నాయకురాలు రోజా 'రాత్రికి బారు, ఉదయం దర్బారు' అన్న వ్యక్తిగత విమర్శలు రాజకీయ అసహనానికి చిహ్నాలు. ఆడమ్స్ వంతెన (రామసేతు) వివాదంలో కరుణానిధి 'రాముడు తాగుబోతు' అని అనడం, వి.ఎచ్.పి. 'కరుణానిధి తలను నరికి తెచ్చిన వారికి బహుమతి ఇస్తాం' అని ప్రకటించడం కూడా ఈ కోవలోకే వస్తాయి. మేం చేసేవి చేస్తాం, మీరు మాత్రం పడి ఉండండని అనే ధోరణి జనంలో ఉన్నవారికి చెల్లదు. జనంలో ఉన్నారు కాబట్టి జనం ప్రశ్నిస్తారు. ఎందుకంటే ఏదీ వ్యక్తిగతం కాదు, అంతా రాజకీయమే.

## సెజ్‌లు సరే, ఉద్యోగాలేవి ?

రాష్ట్రంలో 46 ప్రత్యేక ఆర్థిక మండలాల (సెజ్) ఏర్పాటుకు కేంద్ర ప్రభుత్వం నోటిఫికేషన్ ఇచ్చింది. దేశంలో సెజ్‌ల కోసం భూముల (పంట భూములతో సహా) కేటాయింపులో మన రాష్ట్రానిదే అగ్రస్థానం. ఆయా సంస్థలిచ్చిన హామీల మేరకు వీటిద్వారా 10,70,600 మందికి ఉపాధి లభించాల్సి ఉంది. కానీ ఇప్పటిదాకా 6,958 మందికి ఉపాధి లభించింది. మరోపక్క సామాజికవేత్తలు సెజ్‌లు కల్పించే ప్రతిఒక్క ఉద్యోగానికి ఐదుగురు నిరుద్యోగులు అవుతారని చెబుతున్నారు. గత అనుభవాలను బట్టి చూసినా వచ్చిన బహుళజాతి సంస్థలు హామీ పడిన ఉద్యోగాలలో కనీసం ఒక్క శాతం కూడా ఉపాధి అవకాశాలు కల్పించలేదు. అయినా వారికి సాగిలపడడమే విధానంగా పాలకులు వ్యవహరిస్తున్నారు. ◆

మధ్యంతర బడ్జెట్‌ను ప్రవేశపెట్టి, గుజరాత్, హిమాచల్ ప్రదేశ్‌ల శాసన సభ ఎన్నికల ఫలితాలు చూసి నిర్ణయించుకుందామని కాంగ్రెస్ పార్టీ మధ్యంతర ఎన్నికల ఆలోచనను వాయిదా వేసుకుందంటున్నారు **జి.ఎస్. రామ్మోహన్**

# మధ్యంతరం తథ్యమా ?

అణు ఒప్పందమే జీవిత సర్వస్వం కాదని కొద్దికాలం క్రితం ప్రధాని వేదాంతం మాట్లాడడంతో కాంగ్రెస్ ఒకడుగు వెనక్కువేసిందేమో అనే సందేహం తలెత్తింది. ఎంతైనా ప్రధాని రాజకీయాలను కోరి వచ్చిన నేత కాదు. మనకు ప్రమాదవశాత్తూ, కాంగ్రెస్‌కు అదృష్టవశాత్తూ వచ్చి పడిన నేత. నిష్కర్ష మనిషిగా పేరుగాంచినవాడు. కాబట్టి మామూలు రాజకీయవేత్తల మాదిరి మనల్ని ఎక్కువకాలం సందేహాల్లో ఉంచడం ఇష్టంలేక మళ్లీ అణురాగం మొదలెట్టారు. కాంగ్రెస్ తీరు చూస్తే మధ్యంతర ఎన్నికలను పూర్తిగా అడ్డుకోవడం కాకుండా కొంచెం వాయిదా వేయడం వ్యూహంగా కనిపిస్తోంది. ప్రధాని లాంగ్వేజ్, బాడీ లాంగ్వేజ్ కాంగ్రెస్ అంతర్గత సచివాలయాల్లో ఏమి జరుగుతున్నదో సూచన మాత్రంగా తెలియజేస్తూ ఉంటాయి. సీజన్డ్ పొలిటీషియన్స్ మాదిరి లోపలి అసంతృప్తిని, కోపాన్ని దాచుకోగలిగిన 'రాజకీయనైపుణ్యం' సాధించినవాడు కాదాయన. అణువివాదం తీవ్రతరమైన కొత్తలో కాంగ్రెస్ డిసెంబర్‌లో లోక్‌సభరద్దుకు సిఫారసు చేయవచ్చని సీనియర్ జర్నలిస్టులకు ఉప్పందింది. తర్వాత పరిణామాలను చూసినపుడు అది మారిందేమో, అణుఒప్పందం లాంటి అంశాలపై కాంగ్రెస్ ఎన్నికలకు వెళ్లదేమో అని వారు భావించారు. ఇపుడు పరిస్థితి మళ్లీ మొదటికొచ్చింది. ఆంగ్ల పత్రికలైతే ప్రధాని వేదాంతం మాట్లాడడంపై తీవ్రస్థాయిలో విరుచుకుపడుతున్నాయి." అంతకుముందు వెన్నెముక ఉందనుకున్నాం. ఇపుడు లేదని రుజువైంది." "మాటతప్పిన ప్రధాని", "మడమ తిప్పిన ప్రధాని", "చిత్తశుద్ధి లేని ప్రధాని" లాంటి పరుషమైన పదాలతో విరుచుకుపడ్డాయి. ముఖ్యంగా ఆంగ్ల మీడియా. వాటి స్వభావానికి, వాటికి ప్రధానికి ఉన్న భావబంధానికి విరుద్ధమైన వ్యాఖ్యలవి. భక్త రామదాసు తరహా నిందాస్తుతిగా భావించొచ్చేమో! సహజంగానే మధ్యంతర ఎన్నికలు త్వరగా రావాలని మీడియా ఆశపడుతుంది. అదొక్కటే కాదు. అణు ఒప్పందం అమల్లోకి రావాలని కూడా చిత్తశుద్ధితోనే కోరుకుంటుండొచ్చు. ఎందుకంటే భారత్‌ను తొందరతొందరగా అగ్రరాజ్యాల సరసన చూడాలని వాటికి కోరికగా ఉంది. అది మన్మోహన్‌సింగ్ అండ్ పార్టీకి ఉన్న కోరిక కూడా. కేవలం సామ్రాజ్యవాదం ముందు సాగిల పడడం, దేశ ప్రయోజనాలను తాకట్టు పెట్టడం వంటి ఐడియలాజికల్ లోడెడ్ పదజాలం వల్ల విషయంలో సీరియెస్‌నెస్‌ను మనమే తీసివేసినవారమవుతాం. పాలకవర్గంలోని చాలామంది, మధ్యతరగతిలోని అనేకమంది దేశం త్వరత్వరగా అగ్రరాజ్యాల సరసన చేరాలని అనుకుంటున్నారు. ఈ విషయంలో అందరికీ ఆరాధ్యంగా ఉన్న దేశ అనుభవం ఉపయోగ పడుతుంది కాబట్టి వారి చేయిపట్టుకుని నడవాలనుకుంటున్నారు.

విట్టన్ బ్యాగులు లూయిస్ విటన్, ఆర్మనీ దుస్తులు, మోబ్లా పెన్నులు, క్రిస్టియన్ డైర్ సుగంధాలు, బెల్వడేర్ లిక్కర్లూ, బెంట్లీ కార్లు...ఇలా చాలా చాలా భారత్‌లోకి శరవేగంగా వస్తున్నాయి. లండన్‌లోనో, ఆమ్‌స్టర్ డామ్‌లోనో "ఇన్‌క్రెడిబుల్ ఇండియా" పండుగలు జరుగుతున్నాయి. 2010కల్లా దేశంలో ఏడాదికి కోటికిపైగా సంపాదించే కుటుంబాలు కోటి 40 లక్షలు ఉంటాయని, అరకోటి నుంచి కోటిరూపాయల సంపాదన గల కుటుంబాలు 2లక్షల 50 వేలు ఉంటాయని సర్వేలు వెల్లడిస్తున్నాయి. మొత్తంగా ఇండియా తనకు తానే ఒక బ్రాండ్‌గా మారింది. ఇంకెంత మాత్రమూ పేదదేశం అనిపించు కోవడానికి పైకెదిగినవారు సిద్ధంగా లేరు. సత్యజిత్‌రే, మృణాల్‌సేన్, శ్యాంబెనగల్ ఎపుడో తీసిన సినిమాలను తిట్టేవారి సంఖ్య పెరుగుతోంది. ధనిక దేశం అనిపించుకోవాలనే ఆత్రం చాలా తీవ్రంగా ఉంది.

ఆనంద్ పట్వర్ధన్ డాక్యుమెంటరీ "వార్ అండ్ పీస్"లో ప్రమోద్ మహాజన్ ఉపన్యాసం ఉంటుంది. ఎన్‌ఆర్‌ఐ విద్యార్థులతో తన సంభాషణ గురించి వివరిస్తారు. క్లాస్‌రూమ్ పరిచయ కార్యక్రమంలో ఫ్రం ఇండియా అని చెప్పగానే ఏంటీ ఎక్కడుందదీ అన్నట్టు ప్రశ్నార్థకమైన ముఖాలతో అందరూ చూస్తుంటే తల ఎక్కడ దాచుకోవాలో తెలిసేది కాదని, అణుపరీక్షల తర్వాత ఇండియా పేరెత్తగానే గౌరవంగా తలాడిస్తున్నారని వారు తన్మయత్వంతో చెప్పినట్టు ఆయన వివరిస్తారు. ఇది అబద్ధమేమీ కానక్కర్లేదు. వారు ఎన్‌ఆర్‌ఐలు మాత్రమే కానక్కర్లేదు. త్వరత్వరగా సంపాదించేసుకున్న, సంపాదించుకుంటున్న వర్గానికి గొప్పగా చెప్పుకోవడానికి ఏదో కావాలి. ఇన్‌స్టంట్ సంపాదనపరులకు ఇన్‌స్టంట్ విజయాలు కావాలి. వరల్డ్‌కప్ కాకపోతే 20×20 అయినా కావాలి. పాతకాలపు వడ్డీవ్యాపారస్తుల్లాగా కాకుండా డబ్బును ఎంత వినియోగిస్తావు అనేదాన్ని బట్టే హోదా నిర్ణయమవుతోంది కాబట్టి రోడ్ల మీద డబ్బు ప్రవహిస్తోంది. వినియోగ ఆధారిత అభివృద్ధి నమూనాలో పైవారు మిగిలిన వనరులను అపరిమితంగా వాడుకుంటున్నట్టే విద్యుత్‌ను కూడా విచ్చలవిడిగా ఉపయోగిస్తున్నారు. ఆ మధ్య ఎక్కడో ఒక ఆవేదన కనిపించింది. అభివృద్ధి చెందిన నగరాలను రాత్రిపూట పైనుంచి చూస్తే, ఫొటోలు తీస్తే కనిపించినట్టుగా భారత నగరాలు కనిపించడం లేదని ఒక దేశభక్తుడు ఎవరో వాపోయారు. ఎంత వ్యథ

పాపం! కాబట్టి ఇండియా షైనింగ్‌కి ఇప్పుడు మరిన్ని వెలుగులు కావాలి. పదిశాతం జిడిపి వైపు పరిగెత్తాలంటే ప్రగతిరథానికి మరింత ఇంధనం కావాలి. విద్యుత్ కావాలి. పదిహేనేళ్లుగా సాగుతున్న భారీ అభివృద్ధి డిజైన్‌లో భాగమే 123 అణు ఒప్పందం. అణు ఒప్పందాన్ని అమలు చేస్తే పాశ్చాత్య దేశాల నుంచి అణుఇంధన సరఫరా జరుగుతుంది. అణుపరీక్షల కాలం నుంచి అసుంట పెట్టిన పాశ్చాత్య దేశాలు తమ కౌగిట్లోకి తీసుకుంటాయి. దాని వల్ల అవి భారత్‌ను అణుదేశంగా కూడా కొంతవరకైనా గుర్తించినట్టవుతుంది.

ఇతరత్రా అంశాలు కూడా ఇందులో భాగంగా ఉండొచ్చుకానీ అవన్నీ చిన్నవి. పాలకుల అవినీతికి, వారి కుటుంబాలు, విదేశీ కాంట్రాక్టర్లు సంపాదించుకోవడానికి దీన్ని లింకు పెట్టి మాట్లాడితే సమస్యను తక్కువ చేసి చూడడమే అవుతుంది. కానీ ఈ ప్రగతి రథ చక్రాల కింద నలిగిపోయే జీవులు, మరుగున పడిపోయే జీవుల సంగతి ఏమిటి? 75 వేల గ్రామాలు ఇప్పటికీ విద్యుత్ సౌకర్యం లేని పరిస్థితుల్లో ఉంటే, వాటి గురించి ప్రస్తావన కూడా లేకుండా 10 శాతం జిడిపి అందుకోవడానికి అవసరం అనే రీతిలోనే అణువిద్యుత్‌ను మాట్లాడడం లోని ఔచిత్యమేమిటి? నిజానికి ఆ 75 వేల గ్రామాలకు విద్యుత్‌ను అందించలేకపోతున్నది విద్యుత్ కొరత వల్ల కాదు. చిత్తశుద్ధి లేక. ఎందుకంటే వాటికి అవసరమైన విద్యుత్ అవసరాలు మన విద్యుత్ పరిభాషలో కనీసమాత్రంగా కూడా పరిగణించలేనట్టివి.

అలాగే 15 ఏళ్లుగా లక్షన్నరకు పైగా రైతులు, చేనేత కార్మికులు ఆత్మహత్యలు చేసుకున్న పరిస్థితుల్లో వాటి గురించి పట్టింపు లేకుండా పెంచుకునే జాతీయసంపద విలువ ఎంత? జిడిపి ఎనిమిది శాతం పెరిగినా పది శాతం పెరిగినా గ్రామీణ భారతానికి ఎంత ఒరిగింది అనేది ప్రశ్న. ఇప్పటికీ ఆకలిచావులు సంభవించే దేశం, గ్రామాలకు రక్షిత నీటి సరఫరా చేయలేని దేశం, అందరికీ ఆరోగ్యం అందించలేని దేశం అర్జంటుగా అగ్రరాజ్యాల సరసన నిలబడకపోతే వచ్చే నష్టమేమిటి? విద్యుత్ ఉత్పత్తికి ప్రత్యామ్నాయ మార్గాలే లేవా? ఇందుకోసం మన దేశాంగ విదేశాంగ విధానాలను కూడా మార్చుకుని పెద్దన్న ముందు జీ హుజూర్ అనాలా? ఆకలితో అలమటించే ప్రజల (హంగర్ ఇండెక్స్) సూచికలో 94వస్థానంలో అదీ ఇథియోపియా కంటే దారుణంగా ఉన్న దేశం సిగ్గూఎగ్గూ లేకుండా భారీ రంగుల కలలో తేలిపోవడమేమిటి? ప్రజాస్వామిక వాదులు వేస్తున్న ప్రశ్నలివి.

ఒక రకంగా దేశాన్ని అగ్రదేశాల సరసన చూడాలని ముచ్చట పడుతున్న వారికి దేశాన్ని మానవీయంగా చూడాలని పోరాడుతున్న వారికి మధ్య ఉన్న వైరుధ్యం ఇది. వర్తమాన అభివృద్ధిలో విలువలకు తావు తక్కువ అని ఇప్పటికే రుజువైంది. ఇరాన్ విషయమై ఐక్యరాజ్యసమితిలో భారత్ వ్యవహరించిన తీరు, ఇరాక్ విషయమై భాషలో వచ్చిన మార్పు, పాలస్తీనా విషయంలో ఏర్పడిన మౌనం ఇవన్నీ సంకేతాలే. ఇపుడు జరుగుతున్న అభివృద్ధి నమూనా ప్రజాస్వామిక వాదుల పరిభాషలో పంకాను తాకిన పెంట (అరుంధతీ రాయ్ వాడిన పదబంధం షిట్ హిట్‌ది ఫ్యాన్). ఈ అభివృద్ధి నమూనాలో మిగిలిన అంశాలపై ఎంత గట్టిగా నిలబడ్డారు అనే దానితో నిమిత్తం లేకుండా కనీసం ఒక్క అంశం మీదైనా చిత్తశుద్ధిని ప్రదర్శించినందుకు వామపక్షాలను అభినందించాలి.

మళ్లీ ఎన్నికల దగ్గరికే వస్తే ప్రస్తుత పరిస్థితులను బట్టి ఏప్రిల్ తర్వాత ఏ క్షణాన్నైనా రావచ్చేమో అనిపిస్తోంది. గ్రామీణ ఉపాధి పథకం మీద రాహుల్ గాంధీకి అర్జెంటుగా ప్రేమ పొంగుకు రావడం, బుల్లి దొరగారి కోరికను మన్నించి వెంటనే ప్రభుత్వం ఏప్రిల్‌నుంచి అన్ని జిల్లాలకు విస్తరిస్తున్నట్టు ప్రభుత్వం ప్రకటించడం కాకతాళీయమేమీ కాదు. పేదరికం ఎంత తీవ్రంగా తగ్గిపోయిందో పాలకులు గట్టిగట్టిగా చెపుతుంటారు కానీ అవన్నీ ఒట్టి లెక్కలే అని ఇలాంటప్పుడే తెలిసిపోతుంది. పేదరికం అంత బాగా తగ్గిపోతే ఎన్నికల ఊసు రాగానే హడావిడిగా తాయిలాలు ప్రకటించాల్సిన అవసరమేముంటుంది? రెండు రూపాయలకు కిలోబియ్యాలు, ముస్లింల అభివృద్ధి చర్యలు ఇపుడే ఎందుకు గుర్తొస్తాయి? బహశా కేంద్ర బడ్జెట్ సమర్పించాక ఎన్నికలు జరిగే అవకాశమున్నట్టు కనిపిస్తోంది-అనుకోని పరిణామాలేమీ సంభవించకపోతే. గుజరాత్, హిమాచల్ ప్రదేశ్ ఎన్నికల ఫలితాలను అధ్యయనం చేసి కాంగ్రెస్ ముహూర్తం నిర్ణయించవచ్చు. తెహల్కా-హెడ్‌లైన్స్ టుడే ఏమి బయటపెట్టినా మళ్లీ నరహంతకమోడినే గుజరాత్‌కు దిక్కవుతాడేమోనని భయంగా ఉంది.( మోడి దేశంలోనే ఉత్తమ అడ్మినిస్ట్రేటర్ అని మీడియా కితాబిచ్చి ఉంది-జలగం వెంగళరావుకి మల్లే) ఇది గుజరాత్ ప్రజలను తక్కువ చేయడం కాదు. హైదరాబాద్ పాతబస్తీలో 80ల ప్రథమార్ధంలో ఉన్న వాతావరణం ఇప్పుడు గుజరాత్ అంతటా నెలకొందేమో అనిపిస్తోంది. పోలరైజేషన్ ఆ స్థాయిలో ఉన్నప్పుడు స్త్రీ గర్భస్థ పిండాన్ని చీల్చానని ప్రకటించుకున్న హంతకుడిని కూడా వీరునిగానే పరిగణించే స్థితికి ప్రజలు చేరుకున్నా ఆశ్చర్యపోనక్కర్లేదు. మొత్తం రాష్ట్రాన్నే ఈ రకంగా మార్చడంలో హిందూత్వ లాబరేటరీలోని సిద్ధాంతవేత్తలు విజయం సాధించారా లేక ఇదంతా నైరాశ్యపు ఆలోచనేనా అనేది కొద్దిరోజుల్లో తేలిపోతుంది. బిజెపి ప్రవక్త ప్రకాశ్ జవదేకర్ హెడ్‌లైన్స్ టుడేలో చెపుతున్నారు. తెహల్కా-హెడ్‌లైన్స్ టుడే స్టింగ్ కాంగ్రెస్ ప్రోద్బలంతోనే జరిగిందంటున్నారు. కానీ అందులోనివి వాస్తవాలు కావని చెప్పడం లేదు. చెప్పలేరు కూడా. ఇంత హేయమైన- హిట్లర్ కాలంలో కూడా వినిపించని ఘోరాలకు పాల్పడిన పార్టీ ప్రవక్తగా ఆయన టివి చానల్‌ను ఎదుర్కోవడమే దుస్సాహసం. కనీసం క్షమాపణ కూడా చెప్పకుండా మామూలు రోజు వారీ ఆరోపణలకు దిగడం చూస్తే వాళ్లెంతగా బరితెగించారో అర్థమవుతుంది. నానావతి నివేదిక వచ్చాకే ప్రతిస్పందిస్తామని ఆయన చెప్పారు. నివేదిక వచ్చాక ఏమవుతుంది? ఏయే పోలీస్ అధికారులు, పాలకులు బాంబేలో ముస్లింల ఊచకోతకు పాల్పడ్డారో, ప్రేరేపించారో స్పష్టంగా ఆధారాలతో శ్రీకృష్ణ కమిషన్ నిరూపిస్తే ఏమి చర్యలు తీసుకున్నారు?

ఇవాళ కావాల్సింది అగ్రరాజ్యాల సరసన చేరడానికి పరుగులు పెట్టడం కాదు. కనీస చట్టబద్ధతకు హామీ ఇవ్వగలమా? అందరినీ సమానంగా చూస్తామని రాజ్యాంగంపై ప్రమాణం చేసిన వారే హంతకులుగా మారిన ఆటవిక రాజ్యాన్ని ఎదుర్కోగలమా? కొద్దిమంది ఆడంబరపు వెలుగులకు పరుగులు పెట్టే ముందు అందరికీ ఆహారం, నీరు, గృహవసతి వంటి కనీస అవసరాలు తీర్చే నాగరిక రాజ్యంగానైనా మార్చేట్టు ఒత్తిడి తేగలమా? ఇవీ ఇవాళ మన ముందు ఉన్న సవాళ్లు. ◆

అణు కార్యక్రమం అవసరమా, దాన్ని పూర్తిగా నిర్మూలించగలమా, ఇప్పటికే ఉన్న వ్యర్థాలను సురక్షితంగా నాశనం చేయగలమా అనే మౌలికప్రశ్నలు వేస్తూ, సౌరశక్తిని ప్రత్యామ్నాయంగా సూచిస్తున్నారు **కె. విజయ్ కుమార్**

# అణుఒప్పందం పూర్వాపరాలు

ఈ మధ్యకాలంలో ఇంతగా చర్చకు గురవడమే కాకుండా ప్రభుత్వ పతనానికి కూడా కారణమవుతుందనుకున్న విషయం ఇండియా–అమెరికా అణు ఒప్పందం. దీనినే 123 ఒప్పందం అంటున్నారు. అసలీ 123 ఏమిటి?

అణు విద్యుత్తు గురించి, అమెరికా తన దేశంలో ఒక చట్టం చేసింది. అదే 'అమెరికా సంయుక్త రాష్ట్రాల అణువిద్యుత్ చట్టం – 1954'. ఈ చట్టంలో ఉన్న 123వ సెక్షన్ గురించే ఇప్పుడు చర్చ జరుగుతోంది. ఈ సెక్షన్ పేరు 'ఇతర దేశాలతో (అణు విద్యుత్తు గురించి) పరస్పర సహకారం'. ఇప్పటికే చాలా దేశాలతో అమెరికా ఈ ఒప్పందం కుదుర్చుకుంది. ప్రతి ఒప్పందంలోని విషయాలు, పరిమితులు అమెరికా అవసరాన్ని బట్టి, ఆయా దేశాలతో అమెరికాకి ఉన్న సంబంధాన్ని బట్టి ఉంటాయి. ఉదాహరణకి, జపాన్‌తో ఒప్పందంలో ఇంధనాన్ని తిరిగి శుద్ధి చేసే హక్కుల్ని నిరంతరాయంగా యిస్తే, చైనాతో ఒప్పందంలో తిరిగి శుద్ధి చేయదలచిన ప్రతిసారీ అమెరికా అనుమతి పొందాలి. మన దేశంతో ఒప్పందం గురించి నమూనా తయారు చేశారు. సంతకాలు కాకముందే ఇతర రాజకీయ పార్టీలు అభ్యంతరాలు లేవనెత్తినందువల్ల ఆగిపోయింది. ఈ ఒప్పందం వలన మన దేశానికి జరిగే (ప్రభుత్వం చెప్పే) మేలేమిటి?

1. మన దేశానికి అధునాతనమైన న్యూక్లియర్ పరిజ్ఞానం దొరికే అవకాశం ఉంటుంది.
2. యురేనియం ఇంధనాన్ని మరింత ఎక్కువగా దిగుమతి చేసుకునే వెసులుబాటుంటుంది.

ప్రతిపక్షాలు, ముఖ్యంగా సి.పి.ఐ., సి.పి.ఎం., బి.జె.పిలు చెప్పేదేమిటి?

1. ఈ ఒప్పందం అమెరికా హైడ్ యాక్ట్‌కి లోబడి ఉంటుంది.
2. మన దేశంలో అణు పరీక్షలకి సంబంధించిన పూర్తి హక్కుల్ని అమెరికాకి ధారాదత్తం చేసినట్లవుతుంది.

హైడ్ యాక్ట్ ప్రకారం అమెరికాతో ఒప్పందం కుదుర్చుకున్న దేశాలు అణు పరీక్షలు నిర్వహించకూడదు. ఒకవేళ నిర్వహిస్తే అమెరికాయే గాక ఇతర దేశాలు కూడా ఇంధన సరఫరా నిలిపివేస్తాయి.

అంటే, ఇప్పుడు రాజకీయ పార్టీల చర్చంతా మన అణు కార్యక్రమం అమెరికా అధీనంలోకి వెళ్తుందా లేదా అనేగాని అసలు అణు కార్యక్రమం మంచిదా కాదా అనికాదు. బ్రిటిష్ యూనివర్సిటీలో చదువుకుని, వాళ్లకి అనుకూలమైన చదువుని ఒంటబట్టించుకున్న మన్మోహన్‌సింగ్ గారు అమెరికాకి అనుకూలంగా మాట్లాడటం సహజమే. అలాగే, అమెరికా వ్యతిరేకతకి మించి ఆలోచించని లెఫ్ట్ వాదన ఊహించదగినదే. అసలు చర్చించవలసిందీ, నిర్ణయాలు తీసుకోవలసిందీ అణు కార్యక్రమాన్ని కొనసాగించడమా లేదా అని.

ఐక్యరాజ్య సమితికి అనుబంధంగా ఉన్న అంతర్జాతీయ అణుశక్తి సంస్థ (ఐ.ఎ.ఇ.ఎ), 1953లో ఏర్పడినప్పుడు, జపాన్‌పై అణుబాంబు వేసి, జన విధ్వంసానికి, మానవ సమాజ విద్రోహానికి పాల్పడిన యూరోపియన్, అమెరికన్ పాలకులు శాంతి వచనాల చిలకపలుకులు పలికారు. ఇప్పటికీ వారి చేతిలో ఎన్నో అణ్వాయుధాలున్నాయి. ఇతర దేశాలు అణ్వాయుధాలు సమకూర్చుకోకుండా అమెరికా ఆంక్షలు పెడుతోంది. ప్రపంచంలో ఒక దుష్టశక్తిగా ఎదిగిన అమెరికా ఇతర దేశాల్ని దుష్టులని ముద్ర వేసి దాడులు జరుపుతోంది.

అహింస గురించి మాట్లాడే మనదేశం, అమెరికా, రష్యాలతో సహా అన్ని దేశాలలోనూ అణు కార్యక్రమాలు నిలిపి వేసే విధంగా కార్యాచరణ ప్రారంభించాలి. మనదేశం 1955 నుండి ఇప్పటి వరకూ కొన్ని లక్షల కోట్ల రూపాయలు అణు కార్యక్రమంపై ఖర్చు చేసింది. ఇంత చేసినా, మనం ఉత్పత్తి చేసే అణు విద్యుత్తు, మనం వాడే మొత్తం అణు విద్యుత్తులో 10 శాతానికి మించలేదు. ప్రపంచవ్యాప్తంగా కూడా అణు విద్యుత్తు మొత్తం విద్యుదుత్పత్తిలో 17 శాతానికి మించి లేదు. ఇదే ఖర్చు సౌరశక్తిపై చేసినట్లయితే ఇప్పటికి ఎంతో పురోగతి సాధించి, మన విద్యుత్తు సమస్యలు తీరేవి. మానవాళికి ఎంతో మేలు చేసినవాళ్ల మయ్యేవాళ్లం.

### అణు కార్యక్రమం గురించిన బహిరంగ రహస్యమేమిటి?

అణు కార్యక్రమాలు ప్రమాదకరం. ముడిసరుకు త్రవ్వకం నుంచి, ఉపయోగించిన వ్యర్థపదార్థాన్ని నిర్మూలించే వరకు ఖర్చు చూస్తే మిగిలిన విద్యుదుత్పాదకాలకంటే ఎక్కువ. ఒక విధంగా ఇది మనిషి పక్కలో బల్లెం. నాగార్జునసాగర్ వద్ద అణు విద్యుత్తు కేంద్రం నిర్మించడానికి ఒకప్పుడు ప్రభుత్వం తలపెట్టింది. త్రిమైల్ ఐలాండ్

**సమాజ పరివర్తన దానధర్మాలతో, సానుభూతి వ్యక్తం చేస్తే వచ్చేది కాదని, జవాబుదారీతనం ఉన్న వ్యవస్థ కావాలని, సమాజ పరివర్తన ధ్యేయంగా చదువు సాగాలని అంటున్నారు చుక్కా రామయ్య**

# కాన్సెప్ట్ స్కూళ్లు ఎవరి ప్రయోజనాల కోసం?

*"ఐ నో వై ది కేజ్డ్ బర్డ్ సింగ్స్...*
*ఇట్ ఈజ్ నాట్ ఎ కారోల్ ఆఫ్ జాయ్...*

*ఐ నో వాట్ ది కేజ్డ్ బర్డ్ ఫీల్స్...*
*వెన్ ది విండ్ స్టీర్స్ సాఫ్ట్ థ్రూ ది స్ప్రింగింగ్ గ్రాస్,*
*అండ్ ది రివర్ ఫ్లోస్ లైక్ ఎ స్ట్రీమ్ ఆఫ్ గ్లాస్...*

*ఐ నో వై ది కేజ్డ్ బర్డ్ బీట్స్ హిజ్ వింగ్*
*టిల్ ఇట్జ్ బ్లడ్ ఈజ్ రెడ్ ఆన్ ది క్రూయల్ బార్స్...*

**పాల్ లారెన్స్ దూబర్**

ఇది మార్కెట్ యుగం. వినియోగదార్లను ఎంత బాగా బోల్తాకొట్టిస్తే తమ వ్యాపారం అంత బాగా జరుగుతుంది. అది దసరా అయినా, రంజాన్ అయినా ఒకటే. అది ఎవరి పండుగైనా ఒకటే. స్కూల్ అయినా, సినిమాహాలయినా ఒకటే. ఈ వ్యాపారానికి కుల, మత, ప్రాంతీయ విచక్షణ ఉండదు. దీనిలో భాగంగా ఎన్నికలు కూడా ఒక వ్యాపారమే. ఎన్నికలు సమీపిస్తున్న కొద్ది కొత్త కొత్త ప్రకటనలు వస్తాయి. ఒకరు వన్ ఇన్ వన్ అంటారు. మరొకరు వన్ ఇన్ టు అంటారు. మరొకరు ముందుకు అడుగేసి వన్ ఇన్ త్రీ అంటారు. వీరందర్ని పల్టీ కొట్టించాలంటే వన్ ఇన్ ఫోర్ అంటారు. వన్ ఇన్ ఫోర్ రేడియో ఏమిటని మీరు అడగవచ్చును. అంటే ఉన్న ఊళ్లోనే కడుపునిండా బువ్వకోసం రెండు రూపాయలకు కిలో బియ్యం, ఉన్న ఊళ్లోనే ముస్తాబయిన ఇల్లు, ఉన్న ఊళ్లోనే వాడుకున్నంత విద్యుత్ సౌకర్యం, వీటన్నింటికి మించింది ఉన్న ఊళ్లో నుంచే అమెరికాకు వెళ్లేందుకు చదువు. ఏ వడ్డీ వ్యాపారి దగ్గరకు పోకుండా పావలా వడ్డీ, ఎన్నికల తర్వాత అందరికీ స్వర్గమే. వీటన్నింటికన్నా ధీటయింది అమెరికాకు వెళ్లే చదువు అతి ముఖ్యమైనది. కానీ చిన్నదైనా అన్నింటికన్నా

---

లాగానో, చెర్నోబిల్ లాగానో ప్రమాదం జరిగితే మొత్తం హైదరాబాద్ ఖాళీ చేయవలసి రావచ్చు. ప్రకాశం, కర్నూలు, గుంటూరు, కృష్ణా, నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాలు దెబ్బ తినడమే కాకుండా, కృష్ణా నదీ పరీవాహక ప్రాంతమంతా కొన్ని తరాలు నాశనమయ్యే ప్రమాదం ఏర్పడుతుంది. అటువంటి కేంద్రం ఎవరికోసం? ఎందుకోసం?

17వ శతాబ్దం నుండి వ్యాపారవర్గాలు రాచరికంపై పెత్తనం సాధించి పాలనని తమ అదుపులోకి తెచ్చుకుని, దానినే ప్రజాస్వామ్యంగా ప్రచారం చేస్తూ, తమ దోపిడీకి అనుకూలమైన విధానాలని ఏర్పరచుకున్నాయి. దాదాపు ప్రపంచదేశాలన్నీ వీరి అధీనంలోకి వచ్చాయి. ఒకప్పుడు రాజులు భూవ్యాప్తంగా తమ అధికారాన్ని విస్తరించటానికి యుద్ధాలు చేస్తే, ఇప్పుడు దేశాల్ని పాలిస్తున్న వ్యాపార వర్గాలు తమ మార్కెట్‌ని విస్తరించుకోటానికి ముడిసరుకుల్ని, ఇంధనాన్ని కొల్లగొట్టటానికి యుద్ధాలు చేస్తున్నారు. ఈ యుద్ధోన్మాదంలో, ఒకరికి మించి ఒకరు ఆయుధాలు సమకూర్చుకుంటున్నారు. ఇప్పుడు ఆయుధ వ్యాపారమే పెద్ద వ్యాపారమైంది.

మొదటిసారిగా రూజ్వెల్టు నాయకత్వంలోని అమెరికా అతి దుర్మార్గమైన కార్యక్రమానికి పూనుకుని, అణుబాంబుని జపానుపై విసిరింది. అటువంటి హీనచరిత్ర కలిగిన అమెరికాతో సంబంధాలు, అందునా అణుకార్యక్రమంలో సంబంధాలు, హేయమయినవి అవుతాయా లేక అహింసా విలువలతో కూడిన సంబంధాలవుతాయా? తర్వాత వీలైనన్ని దేశాలు అణుబాంబు కోసం అణు కార్యక్రమం మొదలు పెట్టాయి. పనిలో పనిగా, ఇంధన ప్రాసెసింగ్‌లో వచ్చే వేడిని వాడుకుని నీటి ఆవిరి ద్వారా విద్యుత్తుని ఉత్పత్తి చేస్తున్నాయి. అదే ముఖ్య కార్యంగా ప్రచారం చేస్తున్నాయి.

ఈ రోజున ప్రపంచ ప్రజలంతా కలిసి నిరోధించవలసింది, నిర్మూలించవలసింది అణుకార్యక్రమాల్ని, అణు ఉత్పాదకాల్ని. ఈరోజు ప్రపంచం ముందు ఉన్న అతి పెద్ద ప్రమాదకర కార్యక్రమం, ఇప్పటి వరకూ సాగిన అణు కార్యక్రమాల ద్వారా మిగిలిన వ్యర్థ పదార్థాలని ఏం చెయ్యాలి అని. వాటిని ఎక్కడ విసిరేసినా, పరిసరాలు, నీరు, గాలి అన్నీ కలుషితమవుతాయి. దీనివల్ల మానవజాతి, జంతుజాతులు, వృక్ష జాతులు కొన్నితరాల వరకు దెబ్బతింటాయి. కొన్ని నాశనమవుతాయి.

అమెరికా తన భూభాగంలో కాకుండా ఇతర దేశాల భూభాగాల్లో వాటిని విసిరేస్తున్నది. ఇంకా ఆ ప్రయత్నాలు ముమ్మరం చేస్తున్నది. అందువల్ల కూడా అమెరికాతో ఒప్పందం సరియైంది కాదు. ◆

ఇదే ముద్దయిన ఆలోచన. అసలుకన్నా వడ్డీనే ఎక్కువ. ఏ పార్టీకీ ఎవరికీ రాని ఆలోచనే ఎక్కువ మందిని ఆలోచింపచేస్తుంది. పట్టణాల్లో ఉండేటటువంటి పిల్లలు ఇంగ్లిష్ చదువులు చదువుకొని అమెరికాకు పోయి, డాలర్లు సంపాదించి తమకు కావలసిన స్థలంలో ఆంధ్రప్రదేశ్‌లో రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసి అంబానీతో పోటీపడే వ్యవస్థ బలపడుతుంటే, ఆ రుచిని పల్లె ప్రజలకు కూడా చూపిస్తానని వాగ్దానం చేయటం, ఇలాంటి ఆలోచన రావటం ఐన్‌స్టీన్ ఆలోచనల కన్నా గొప్పవేమో. ఒకవైపు బడికే పంపించే స్థితి లేదంటున్న తల్లిదండ్రులకు, తరగతి గదిలో కిక్కిరిసి గాలి ఆడకుండా రాత్రింబవళ్లూ బాధపడుతున్న గ్రామాల విద్యార్థులకు టాయిలెట్లు లేకుండా, విశ్రాంతి గంట కోసం ఎదురుచూస్తున్న ఆడపిల్లలకు, పంతుళ్లే లేకుండా నడిపిస్తున్న స్కూళ్లకు, వాటిని గమనిస్తున్న తల్లిదండ్రులకు ఊహకందని వరాలు.

అమెరికాకు వెళ్లడం అందరికీ ఆశయమే కావచ్చును, ఆనందం కావచ్చును. భవిష్యత్తు స్వప్నాల కల కూడా కావచ్చును. ఇంగ్లీషు రావటం ఈ కొత్త ప్రపంచీకరణలో అందరికీ అవసరమే. గ్రామీణ వాతావరణం నుంచి వచ్చిన పిల్లలకు తెలుగులోనే టెక్స్ట్ బుక్స్ లేక, ఆ పుస్తకమే అర్థం కాకుండా చేసి తల్లడిల్లుతున్న విద్యార్థులకు ఇంగ్లిష్ పాఠాలు చెప్పేందుకు ఎంత శిక్షితులైన ఉపాధ్యాయులు కావాలి? అందుకు ఎంత నిబద్ధత కావాలి? ఇంగ్లిష్ ఒక సబ్జెక్టు పెడితేనే వణుకు వస్తోంది అని భావించే దశ ఇంకా కొనసాగుతోంది. అలాంటి పిల్లల్లో ప్రతిభను వెలికి తీసి ఇంగ్లిష్‌లో బోధించే ఉపాధ్యాయులకు ఎంత దీక్ష ఉండాలి. వారికెంత శిక్షణుండాలి. వారికెన్ని వసతులు కల్పించాలి. విద్యార్థులకు ఎంత సాయం చేయాలి. ఈ విషయాలన్నీ ఆచరణలో సాధ్యం కావాలి.

గ్రామాలలోని పిల్లల తల్లిదండ్రులు చదువుకున్న వారేం కాదు. వారి ఇంట్లో ఇంతకు ముందు మోడల్స్ ఏమీ లేవు. మోడల్‌గా నిలిచిన వాళ్లు లేరు. పల్లెటూరిలో ఉన్న స్కూల్లో చదువుకొని తమకు తామే తమ ప్రతిభను పెంచుకొని ఈ పోటీ ప్రపంచంలో నిలుచోవాలని ప్రయత్నిస్తున్న విద్యార్థులను, ఈ కొత్త వ్యాపారులకు ఎంత సపోర్టు ఇస్తే ఆ పిల్లలను నిలబెడతారని ఆశించటం పాలకులకు ఎంత వరకు తగును? విద్యారంగంలో అనుభవం లేనటువంటి మనుషులు, వ్యాపార లావాదేవీల్లో ఆరితేరిన మనుషులు, సామాజిక సోయి లేని మనుషులు ఈ బాధ్యతను ముందుకు తీసుకెళతారా? అని అనుమానం రావటం సహజం. కొందరికి మేనేజ్‌మెంట్ ఎవరైతేనేమి చదువు చెప్పే వాళ్లు యాజమాన్యం కాదు గదా. పోటీ పరీక్షల్లోకి కావలసిన సిలబస్ ప్రధానం కదా? అనే వారూ లేకపోలేదు. ఒక సమాజంలో మార్పు తీసుకురావటం అంత సులభమైన పనికాదు. అంకిత భావం, పట్టుదల, క్రమశిక్షణ గల యాజమాన్యం మాత్రమే ఆ పని చేయగలుగుతుంది. అలాంటి నిబద్ధత ఉన్న యాజమాన్యాలే అణగారిన వర్గాల పిల్లలకున్న ప్రతిభను వెలికితీయగలుగుతాయి. లేకపోతే అమెరికాలోని నీగ్రోలకు పట్టిన గతే మన దగ్గర అణగారిన వర్గాల పిల్లలకు పడుతుంది. అమెరికాలో తెల్లజాతి వారికి సమానమైనటువంటి చదువు నల్లవారికి, ఆఫ్రో అమెరికన్ వర్గాల పిల్లలకు ఎందుకు అందించటం లేదు. అమెరికాలోని పాఠశాలల్లో పిల్లలు కాల్పులు జరిపే పరిస్థితి ఎందుకు వచ్చింది. దానికి కారణం పెట్టుబడిదారీ వ్యవస్థ. ఈ సరికొత్త వ్యాపారులే ఇందుకు కారణం. ఈ ప్రాంత ప్రజలపైన వాత్సల్యంతో వాళ్లు వస్తున్నారా? వాళ్లు గ్రామీణ ప్రాంత పిల్లలను ఉద్ధరించేందుకు వస్తున్నారా? ప్రభుత్వం సంతర్పణ చేస్తున్న భూమిని కాజేసేందుకు వస్తున్నారా? ఇందిరాగాంధీ పోటీ చేసిన మెదక్ జిల్లాను అభివృద్ధి చేసేందుకు పరిశ్రమలు పెట్టుకోమని భూమినిచ్చారు. డబ్బులిచ్చారు. దానిపై పెట్టుబడిదారులు వాలి ఆ భూమిని కాలుష్యభూమిగా మార్చారు. కానీ ఆ మెదక్ జిల్లా పటాన్‌చెరు ప్రజలకు దొరికింది కాలుష్యం, కలుషిత నీళ్లు, ఛిద్రమైన ఆరోగ్యాలు. డబ్బు మాత్రమే సమాజ పరివర్తన తీసుకరాదు. ఆ డబ్బును వినియోగించే యాజమాన్య లక్ష్యమే అది ఆచరణలో తన పనిని తెలియజేస్తుంది. ఏ దేశంలోనైనా చదువు అన్నది సమాజ పరివర్తనే ముఖ్య భాగంగా ఉంటుంది. సమాజ పరివర్తన దానధర్మాలతో సానుభూతి వ్యక్తం చేస్తే వచ్చేది కాదు, జవాబుదారీతనం ఉన్న వ్యవస్థ కావాలి. ఆ కర్తవ్యాన్ని నెరవేర్చకపోతే ప్రశ్నించే అధికారం ఉండాలి. బలవంతులు తమ పిల్లలను జవాబుదారీ తనమున్న సంస్థల్లో పెడతారు. కానీ ఆ గ్రామీణ ప్రాంత పిల్లలను మాత్రం యాజమాన్య తోడేళ్లకు అప్పగిస్తారట.

గ్రామీణ ప్రాంతాలనుద్ధరించే సంకల్పమే నిజమైతే దాన్ని ప్రభుత్వానికెందుకివ్వరు? దాన్ని ప్రభుత్వం చేతిలో ఎందుకుంచరు? ఇలాంటి సంస్థలు ఆంధ్రప్రదేశ్‌లో లేవా? గ్రామీణ ప్రాంతాల పిల్లల్లో ప్రతిభను వెలికితీసిన ఎ.పి. రెసిడెన్షియల్ స్కూల్, ఎ.పి. సోషల్ వెల్ఫేర్, ట్రైబల్ వెల్ఫేర్ సంస్థల చరిత్ర తెలియదా? వాటిని ఉద్దేశ్యపూర్వకంగా బలహీనపరిచి ఈ కొత్త సంస్థను పెట్టే కారణం ఏమిటి? ఎందుకు? ఎవరి లాభం కోసం? ఈ కొత్త గుడారాలు ఎవరి కోసం? ఈ గుడారాలకు కొత్త మెరుపులద్ది ప్రజలను మభ్యపెట్టడానికై కొంతకాలం చిక్కుతుందేమో? ఏమో? సమాజ భాగస్వామ్యంలోని ఈ గుడారాలను గ్రామీణ విద్యార్థుల కోసమే నిర్మించుతామని చెప్పి, ఈ ఎన్నికల గుడారంలో ఇదొక సంక్షేమ కార్యక్రమంగా చేర్చటం జరుగుతుంది. పేదవాడు నిలబడే జాగా అడిగితే ఇళ్లు కట్టిస్తామంటారు? మా పొలాలకు నీళ్లివ్వమంటే తొమ్మిది గంటలో, పన్నెండు గంటలో కరెంట్ పెడతామంటారు? ధరలను కంట్రోల్ చేయమంటే రెండు రూపాయల బియ్యం పాట పాడుతున్నారు. మా బడులకి పంతుళ్లనిచ్చి సౌకర్యాలు కల్పించమంటే? నగర, పట్టణాల్లో మీ పిల్లల మాదిరిగా వసతులు కల్పించమంటే, డూన్ స్కూల్స్ కట్టిస్తామంటారు. వుట్టి కెగరలేనమ్మ ఆకాశానికెగిరిన చందంగా ఉంది ఈ రూరల్ పబ్లిక్ స్కూళ్ల పరిస్థితి. ఇది ఎన్నికల కోసం మాత్రమే చేసే వాగ్దానమంటే రాజకీయమని, నీళ్లమీద రాతలనే ఊరుకుంటాం. కానీ గ్రామీణ విద్యార్థుల ప్రతిభను వెలికితీసి మీ పిల్లల మాదిరిగా వీళ్లను అభివృద్ధి చేయాలనే కోరిక మీకుంటే నిజాయితీగా జవాబుదారితనం ఉన్నటువంటి సంస్థల కప్పగించండి. దానికి కావలసిన మౌలిక వసతులను సమకూర్చి పెట్టండి. లేకుంటే పేద ప్రజల పేరు చెప్పి ఇది వరకు పది ప్రణాళికల డబ్బు ఏ గోతిలోకి పోయాయో? ఈ 25 వేల కోట్ల డబ్బు కూడా అలాగే వ్యాపారుల, దళారుల పాలు అవుతుంది.

◆

వాస్తవాలను పరిశీలించి లంచగొండి ఆఫీసర్లపై కఠిన చర్య తీసుకోవటమా లేక దిగజారిపోయిన చట్టబద్ధతను, ప్రజా స్వామ్య విలువలను మరింత దిగజార్చటమా అనేది ప్రభుత్వం ఆలోచించుకోవాలని అంటున్నారు **వి. చలపతిరావు**

# సమాల్ చర్య నేరమా?

రామచంద్ర సమాల్ మీడియాకు అవినీతిపరులయిన ఐ.ఏ.ఎస్, ఐ.పి.ఎస్ ఆఫీసర్ల వివరాలు, ఆయన రిటైరయిన తర్వాత అందజేయక ముందే అవినీతి అందెలమెక్కి రాజ్యమేలుతోందని రాష్ట్ర ప్రజలకందరికీ తెలుసు. కాకపోతే ప్రజలకు ఈ స్థితిని ఎదిరించి పరిపాలనా యంత్రాంగాన్ని ప్రక్షాళన చేసే చైతన్యంగాని, స్తోమతగాని రాలేదు. దీనికి కారణం ఈ దేశాన్ని పాలిస్తున్న మాఫియా రాజకీయ ముఠాలే. వీరు ప్రజల పవిత్రమైన ఓటు హక్కును ఓటర్లకు డబ్బు ఇచ్చి, సారా సీసాలు అందజేసి ఇంకా ఇతర అవినీతి విధానాల ద్వారా దుర్వినియోగం చేస్తున్నారు. ఓటర్లను కూడ తమ వలెనే లంచగొండ్లుగా తయారు చేస్తున్నారు. వారి నైతికస్థాయిని దిగజార్చి, పరోక్షంగా వారు యంత్రాంగాన్ని ప్రశ్నించే శక్తిని బలహీనపరుస్తున్నారు.

ప్రస్తుతం ఏ శాఖను చూసినా, అధికార్లు, అనధికార్లు, ఎం.ఎల్.ఏ.లు, మంత్రులు అందరూ కలిసి నిరాటంకంగా ప్రజాధనాన్ని దోచుకుంటున్న సంగతి, పట్టణాలలో పల్లెలలో వేసేరోడ్లు, స్కూల్ భవనాలు, ఇతర ప్రభుత్వ కట్టడాల నాణ్యత, ప్రభుత్వంలోని అవినీతి స్థాయి గురించి ప్రజలకు చెప్పకనే చెబుతోంది. సదరు కట్టడాలపై ఒకవేళ ప్రభుత్వం ఒక లక్ష రూపాయలు మంజూరు చేస్తే ఆ డబ్బులో 20-30 శాతం నిధులు కూడ ఆ కట్టడంపై సరిగా ఖర్చుకావడం లేదు. ఈ కట్టడాల స్థితి క్రమంగా పిల్లలు ఇసుకలో కట్టె గుజ్జనగూళ్ల స్థితికి చేరుకుంటున్నాయి. అందుకే ఈ రోడ్లు ఒక సంవత్సరం తిరుగకముందే పెద్ద పెద్ద గుంటలు పడి గతుకులపాలయి కార్లు మోటారు సైకిళ్లు నడవటానికే కాదు, పాదచార్లు నడవటానికి కూడా యోగ్యంగా ఉండటంలేదు. ఇలాంటి నాశిరకం పనుల కోసం తెచ్చిన రుణ భారం పన్నుల రూపంలో ప్రజలపై మోపటం, ఆ రుణాలతో చేసిన ఖర్చులో ఎక్కువభాగం తమ జేబులు నింపుకోవటం నేటి ప్రభుత్వాధికార్లు, రాజకీయ నాయకులు చేస్తున్న పని. ఇప్పటి రాజకీయ సంస్కృతి పూర్తిగా అభివృద్ధి నిరోధకంగా తయారయింది.

ఇక జలయజ్ఞం పేర నడిచే నీటి ప్రాజెక్టుల పనితీరు ఇంకా దారుణంగా ఉంది. ఇ.పి.సి. పద్ధతిలో జరిగే ప్రాజెక్టు పనులపై ప్రభుత్వ ఇంజనీర్ల ఆజమాయిషి కాని నియంత్రణ గాని పూర్తిగా లోపించిందని నిత్యం పత్రికలలో వార్తలు వస్తున్నాయి. దీనికి కారణం కాంట్రాక్టర్లే తమకు ఇచ్చిన పనులకు డిజైన్‌చేసి పనులు కొనసాగించటం అని, నాశిరకంగా వేసిన పులిచింతల డ్యాం వరదలో కొట్టుక పోవడానికి ఇదే కారణం అని తెలుస్తోంది. మొత్తం జలయజ్ఞం పనులన్నీ ఇదే విధంగా కొనసాగుతున్నాయని ప్రజలు, ప్రజా ప్రతినిధులు గగ్గోలు పెడుతున్నారు. అయినా వై.ఎస్.ఆర్. ప్రభుత్వంలో పెద్ద కదలికలేదు. సదరు ఇ.పి.సి. పద్ధతిలో నడిచే పనులు ఇదే విధంగా నడుస్తున్నాయి. వీరికిచ్చే పది శాతం మొబిలైజేషన్ అడ్వాన్సులలో అయిదు శాతం కమిషన్ల రూపంలో మంత్రులు, అధికార్లు, ఇంజనీర్లు వెంబడే గుంజుతున్నట్లు బహుళ ప్రచారం ఉంది.

మొన్న పంజాగుట్ట నిర్మాణంలో ఉన్న ఫ్లైఓవర్ కూలిన సంఘటన ప్రభుత్వంలో పెచ్చు పెరిగిన అవినీతికి దర్పణం పడుతోంది. అలా నిర్మాణ దశలో ఫ్లైఓవర్ ఎందుకు కూలిందని ప్రశ్నిస్తే, కొందరు ఇంజనీర్ మహాశయులు చెప్పుతున్న సంజాయిషి ఏమిటంటే ఫ్లైఓవర్ నిర్మాణం కోసం అమర్చె ప్రికాస్ట్ సిమెంటు బ్లాకులు, సెంట్రింగ్ సపోర్టు పిల్లర్ల కిందికి వర్షపు నీరు వచ్చి వాటి కింది మట్టి వరద తాకిడికి కదిలి ఆ సెంట్రింగ్ పిల్లర్లు, ఫ్లైఓవర్ బ్లాకులు కూలి కిందబడ్డాయని చెబుతున్నారు. రెండవ కారణం హైద్రాబాద్ మెట్రోవాటర్ వర్క్సువారు పైపులు వేయటానికి తీసిన గుంటలు, మూడవ కారణం ఈ ఫ్లైఓవర్ కంట్రాక్టర్ వద్ద పనిచేస్తున్న సబ్ కాంట్రాక్టర్ నిర్లక్ష్యం వలన ఈ ఘటన జరిగిందని చెబుతున్నారు. ఈ కారణాలు ఏవైనా ఇవి ఊహించలేనివి, నియంత్రించలేనివి కాదు కదా. యంత్రాంగమంతా అవినీతిమయమయి కాంట్రాక్టర్ల ఇష్టారాజ్యంగా పనులు నడిపిస్తున్నప్పుడు ఇటువంటి సంఘటనలు మామూలే కదా.

ప్రజా పంపిణీ విధానం కోసం కేటాయించిన వేల టన్నుల బియ్యం గోదాంల నుండి నేరుగా ఎలా బ్లాక్ మార్కెట్‌లలోకి తరలిపోతున్నాయో, అదే విధంగా బంగ్లాదేశ్ లాంటి విదేశాలకు ఎగుమతి చేయడానికి ఎలా వ్యాగన్లలో నింపి నేరుగా సరిహద్దుల వరకు తరలిపోతున్నాయో ఆ మధ్య వార్తలు వచ్చాయి. ఇదంతా ప్రభుత్వ యంత్రాంగంలో రైల్వే సిబ్బందిలో గల అవినీతి వల్లనే సాధ్యమవుతోంది కదా. ఇదే విషయం సమాల్ చెబితే ప్రభుత్వంలో ఇంత ఉలుకు ఎందుకు. సమాల్ మీద కారాలు మిరియాలు రుద్దటం ఎందుకు? ఒకవేళ సమాల్ ఏవరైనా ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్. అఫీసర్‌లపై గాని తప్పుడు అభియోగం వేస్తే, బురదజల్లె ప్రయత్నం చేస్తే, అటువంటి ఆఫీసర్లు కోర్టును ఆశ్రయించవచ్చును. తాము అవినీతి పరులం కామని రుజువు చేసుకోవచ్చును గదా. కాని ప్రభుత్వం హోల్‌సేల్‌గా అవినీతి ఆఫీసర్లందరి కోసం వకాల్త పుచ్చుకోవటం సమర్థనీయమా?

వ్యవసాయదార్లకు నాశిరకం విత్తనాలు, పురుగు మందులు, ఎరువులు వగైరా సరఫరా చేయటం వలన పంటలు నాశనమయి, రైతులు చేసిన అప్పులు తీర్చలేక గత దశాబ్దం నుండి ఆత్మహత్యల పాలయినారు. ఈ స్థితి ఇప్పటికీ కొనసాగుతోంది. దీనంతటికీ కారణం సంబంధిత ప్రభుత్వ యంత్రాంగం ముఖ్యంగా ఉన్నత శ్రేణి అధికార్లలో బాగా ముదిరిపోయిన అవినీతి కాదా. ఈ అవినీతి జాడ్యం పబ్లిక్ రంగ బ్యాంకులకు కూడ బాగా విస్తరించింది. పెద్ద వ్యాపారులకు, బిల్డర్లకు, రియల్టర్లకు అప్పులిచ్చి కమిషన్లు దండుకోవడం బ్యాంకు మేనేజర్లు ఎగ్జిక్యూటివ్‌లకు అలవాటు అయిపోయింది. అదే చిన్న రైతులకు, వ్యాపారులకు, బీదలకు మాత్రం బ్యాంకు రుణాలు లభ్యం కావటం కష్టమైంది. ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ ప్రక్రియలను ఈ దేశంలో ప్రవేశపెట్టిన దరిమిలా, బ్యాంకులు పూర్తిగా పెట్టుబడిదారులు పెద్ద వ్యాపారాలకే చుట్టాలయినాయి. ప్రభుత్వం తమ సంక్షేమం, అభివృద్ధి ప్రణాళికల ప్రకారం తగు రుణ లక్ష్యాలు నిర్ణయించినప్పటికీ బ్యాంకులు అట్టి లక్ష్యాలను గౌరవించడంలేదు. బీద, మధ్యతరగతి వారి నుండి వేల కోట్ల రూపాయిల డిపాజిట్లు సేకరించటం, ఆ విధంగా సేకరించిన డిపాజిట్ల నుండి 70 శాతం రుణాలు పెద్ద వ్యాపారస్తులకు, పారిశ్రామిక వేత్తలకు అందజేయటం బ్యాంకులు ప్రస్తుతం చేస్తున్నవని. ఇందువలననే దేశంలో ద్రవ్యోల్బణ నియంత్రణ జరగడంలేదు. కూరగాయలు, నిత్యావసర వస్తువుల ధరలు వగైరా యథావిధిగా గత రెండేండ్ల నుండి ఒకే విధంగా కొనసాగుతున్నప్పటికీ ప్రభుత్వం అయిదు శాతం నుండి నాలుగు శాతం వరకు, ప్రస్తుతం నాలుగు నుండి మూడు శాతం వరకు ద్రవ్యోల్బణం రేటు తగ్గిందని ఏకపక్షంగా నిరాధారంగా చెప్పుకు పోతోంది. ద్రవ్యోల్బణం తగ్గిందని ప్రభుత్వం చెబితే ప్రజలు నవ్వుకుంటున్నారు.

ఇక్కడ చెప్పవలసి వచ్చిందేమిటంటే, అవినీతి రొంపిలో పీకల దాక కూరుకుపోయిన ప్రభుత్వ యంత్రాంగానికి గాని, స్వార్థ మాఫియా సంస్కృతిని అలవరచుకున్న రాజకీయ నాయకులతో నడుస్తున్న ప్రభుత్వాలకు గాని దేశ ఆర్థిక వ్యవస్థలో అత్యంత ముఖ్య సెక్టార్ అయిన బ్యాంకింగ్ సెక్టార్‌పై సరి అయిన నియంత్రణ గాని, అవగాహన గాని లేకుండా పోయింది. దేశ సమగ్రాభివృద్ధి కోసం ప్రణాళికాబద్ధ మయిన ప్రభుత్వ కృషి ఎంత అవసరమో బ్యాంకుల తోడ్పాటు కూడ అంతే అవసరం. రిజర్వ్ బ్యాంక్ అధికార్లు లాలూచిపడనిదే రామోజీరావు లాంటి బడా వ్యాపారస్తుడు ఎచ్.యు.ఎఫ్. పేర వందల కోట్ల రూపాయిల డిపాజిట్లను నాన్ బ్యాంకింగ్ వ్యవస్థ మోస్తరుగా సేకరించగలడా? అలాగే రిజర్వ్ బ్యాంక్ పర్యవేక్షణ సరిగా ఉంటే, ఆంధ్రప్రదేశ్‌లో గాని ఇతర రాష్ట్రాలలో గాని అర్బన్ కో-ఆపరేటివ్ బ్యాంకులు వేల సంఖ్యలో డిపాజిటర్లను నిలువునా ముంచగలుగుదురా?

ఇప్పుడు కేంద్ర ప్రభుత్వం ఎప్పుడు మాట్లాడినా, మన దేశపు ఆర్థిక వ్యవస్థ బాగా వేగంగా అభివృద్ధి అవుతోందని గొప్పలు చెప్పుకుంటున్నది. మన వృద్ధి రేటు ఎనిమిది నుండి తొమ్మిది శాతం వరకు పెరిగిందని, మన దేశం మెరుస్తోందని ఆనాడు ఎన్.డి.ఎ ప్రభుత్వం, ఈనాడు యు.పి.ఎ. ప్రభుత్వం పనిగట్టుకొని ప్రచారం చేస్తున్నవి. వీరు ప్రవేశపెట్టిన ఆర్థిక సంస్కరణల వలన వ్యాపారవర్గాలు, పారిశ్రామికవర్గాలు అభివృద్ధిఅయి వారి ఆదాయాలలో గణనీయమయిన వృద్ధి అయిన మాట నిజమే. కాని గ్రామీణుల, వ్యవసాయదార్ల ఆదాయం తగ్గిపోయింది. అందుకే అన్ని రాష్ట్రాలలో రైతులు ఆత్మహత్యలకు గురి అవుతున్నారు. గ్రామీణ రంగం, గిరిజన ప్రాంతాలు మౌలిక సౌకర్యాలు లేక వెనకబడటానికి కారణం రాజకీయులు, అధికార్లు బడావ్యాపార్లకు తాబేదార్లుగా మారి గ్రామీణ రంగాన్ని నిర్లక్ష్యం చేయడం వల్లనే. ప్రభుత్వ యంత్రాంగంలో అవినీతి విచ్చలవిడిగా వ్యాపించి ఉండటం చేత కేంద్రం ప్రభుత్వం సంక్షేమ స్కీంలు, సర్వశిక్ష అభియాన్, గ్రామీణ ఉపాధి పథకాలకు సంబంధించిన వేల కోట్ల రూపాయిల నిధులు ఉద్యోగుల, దళారీల, కాంట్రాక్టర్ల పాలు అవతున్నాయి. సదరు స్కీంలు సరిగా గ్రౌండ్ కావటంలేదు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 2007-08 ఆర్థిక సంవత్సరానికి బహు భారీ బడ్జెట్‌ను మొత్తం 81 వేల కోట్లతో అందులో 30 వేల కోట్ల వార్షిక ప్రణాళికలతో అసెంబ్లీలో ప్రవేశ పెట్టింది. చివరికి ఈ బడ్జెటుపై సరి అయిన చర్చ జరగకుండానే దీన్ని ఆమోదింప చేశారు. ఇప్పుడు ఆరు నెలలయింది వివిధ పద్దుల పైన కేటాయించిన నిధులు ఎలా ఖర్చు అవుతున్నాయో పారదర్శకత ఎంత మాత్రం లేదు. ఈ నిధులు ఎలా ఖర్చు అవుతున్నాయో భూమిమీద ఎంత శాతం ఖర్చు అవతున్నయో ఎంత శాతం సరసాదేవి లాంటి బ్రోకర్లపాలు అవతున్నాయో, ఎవరికీ తెలియదు. కట్టు తెంచుకొన్న పశువులు పచ్చటి చేలపై బడి మేసినట్లుగా ప్రజాధనంను అడ్డగోలుగా మంత్రులు, ఎం.ఎల్.ఎ.లు, అధికార్లు, బ్రోకర్లు, పైరవీకార్లు, కాంట్రాక్టర్లు మేసేస్తున్నట్లు ఎన్నో వార్తలు, అభియోగాలు నిత్యం వస్తున్నాయి. ఆడిట్ ఏజెన్సీలు పూర్తిగా బలహీనంగా ఉన్నాయి. కాగ్ ఇచ్చిన ఆడిట్ రిపోర్టులను గూడ ప్రభుత్వాలు ఖాతరు చేయటం లేదు. విచ్చలవిడిగా బాధ్యతారాహిత్యంగా మాఫియా సంస్కృతి అలవరచుకొని రాజకీయ నాయకులు ప్రజాధనాన్ని దోచుకుంటున్నారు. ఎం.ఎల్.ఎ.లు, ఎం.పి.లు వారి నామినేషన్‌తోపాటు సరిగా వారి ఆస్తి వివరాలు ఇవ్వటం లేదు. ఏ.సి.బి. లాంటి సంస్థ ఒకటి వీరి ఆస్తులపై, అక్రమ సంపాదనపై నిఘాఉంచి అలాంటి అక్రమ ఆస్తులు పెరిగినప్పుడు ఆ ఆస్తులను వెలికితీసి అలాంటి నాయకులపై చట్టరీత్యా చర్య తీసికొనే అధికారాలు ఆ సంస్థకు కల్పించాలి. సి.బి.ఐ సంస్థ లాంటివి రాష్ట్రస్థాయి లో ఇలాంటి అవినీతి పరులపై చర్య తీసికోవడానికి ఒక సంస్థను ఏర్పాటు చేయాలి.

ఈ దేశంలో లంచగొండితనం వలన అరవై శాతం బీదల పరిస్థితి రోజురోజుకూ, కడుహీనంగా తయారవుతోంది. వీరి కోసం కేటాయించిన సంక్షేమ నిధులన్నీ మధ్య దళారీల పాలవుతున్నాయి. ఈ నిధులు సరిగా మార్కెట్ గ్రూప్‌ల కోసం ఖర్చు అయివుంటే వారి ఉత్పాదకశక్తి పెరిగి మనదేశం వృద్ధి రేటు కూడ చైనా వృద్ధిరేటు వలెముందుకు సాగి పోయివుండేదని, కనుక ఈ పరిస్థితిలో ప్రభుత్వం సమాల్ చెప్పిన వాస్తవాలను పరిశీలించి లంచగొండి ఆఫీసర్లపై కఠిన చర్య తీసుకోవటమా లేక ఈ లంచగొండి ఆఫీసర్లను వెనకేసుక వచ్చి సమాల్‌పై ఏదో సాంకేతిక కారణాలపై చర్య తీసుకొని, దిగజారిపోయిన చట్టబద్ధతను, ప్రజాస్వామ్య విలువలను మరింత దిగజార్చటమా అనేది ఆలోచించాలి. ◆

**మాకు నోరు లేకపోవచ్చు గాని సిగ్గులేదా అని 'నాగరిక' సమాజాన్ని ప్రశ్నిస్తున్న వాకపల్లి ఆదివాసి మహిళల బాధను వినిపిస్తున్నారు ఎన్. వేణుగోపాల్**

# ఆరని వాకపల్లి ఆగ్రహం

"ప్రభుత్వానికి, పోలీసులకు కళ్లులేవు, చెవులులేవు, బుద్ధిలేదు"

ఈ మాటలు అన్నది ఎవరో ప్రభుత్వ విమర్శకులు కాదు. పోలీసుల వ్యతిరేకులు కాదు. రాజనీతిశాస్త్రాన్ని మథించి ప్రభుత్వమంటే ఏమిటో, ఒకానొక ప్రభుత్వ శాఖగా పోలీసుల విధులూ బాధ్యతలూ ఏమిటో చదువుకున్న వాళ్లు కాదు. వర్గసమాజంలో రాజ్యాంగయంత్రం అసలు స్వభావం ఎలా ఉంటుందో సైద్ధాంతికంగా తెలుసుకున్న వాళ్లు కాదు.

ఆ మాటలు అన్నది విశాఖపట్నం నుంచి నూటయాభై కిలోమీటర్ల అవతల, ఒరిస్సా సరిహద్దుకు కూతవేటు దూరంలో మారుమూల కొండలమధ్య బతుకుతున్న కోందు తెగకు చెందిన నిరక్షరాస్య ఆదివాసి మహిళలు.

ప్రపంచానికంతా పెద్ద ప్రజాస్వామ్య దేశాన్నని తనకుతాను గప్పాలుకొట్టుకునే రాజ్యంలో, సంక్షేమరాజ్యాన్ననీ, వెనుకబడినవారి అభ్యున్నతి కొరకే పని చేస్తున్నాననీ చెప్పుకుంటూ వేలకోట్ల రూపాయల ప్రజాధనాన్ని స్వాహా చేసే రాజ్యాంగ యంత్రం ఆ ప్రజల పట్ల ఎట్లా పనిచేస్తుందో, ఎంత ఈసడింపుతో, ఎంత వ్యతిరేకతతో వ్యవహరిస్తుందో స్వానుభవంతో తెలుసుకున్న మహిళలు చేసిన వ్యాఖ్యలు అవి. ఆ మహిళలు ఆ మాటలు అన్నది తమకు జరిగిన అన్యాయానికి తక్షణ ప్రతిస్పందనగా ఏదో అప్పటికప్పుడు కలిగిన ఆగ్రహంతో, కసితో కాదు. వాళ్లు ఆ మాటలు అన్నది తమపై అత్యాచారం జరిగిన ఏడువారాల తర్వాత అక్టోబర్ 14న. ఆ అత్యాచారం జరిగిన ఆగస్ట్ 20న వాళ్లు అనుభవించిన హింస, అవమానాల కన్న ఎక్కువగా ఆ తర్వాత ఏడువారాలలో ప్రభుత్వం నుంచీ, పోలీసులనుంచీ ఎదురయిన అవమానాలు, నిర్లక్ష్యం, నిరాదరణ, హేళన, దుష్ప్రచారం వాళ్లకు రాజ్యస్వభావాన్ని తేటతెల్లం చేశాయి.

ఆ గ్రామం పేరు వాకపల్లి. విశాఖపట్నం నుంచి నూటపది కిలోమీటర్లు (అందులో మూడో వంతు ఘాట్ రోడ్డు) ప్రయాణించి, గిరిజన సంక్షేమం కోసమే ప్రభుత్వం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ ప్రధాన కార్యాలయం ఉన్న పాడేరు దాటి అందమైన ప్రకృతి మధ్య, కొండలూ అడవులూ నిండిన దారిలో మరొక ముప్పై కిలోమీటర్లు వెళితే జి.మాడుగుల అని పిలవబడే గంగరాజు మాడుగుల వస్తుంది. అక్కడి నుంచి మరి పది కిలోమీటర్లు వెళ్లి నుర్మతి అనే కాస్త పెద్ద గ్రామం దాటి కొంతదూరం వెళ్లాక రోడ్డు (ఆశ్చర్యకరంగా గిరిజనుల జీవితాల బాగుకోసం అవసరమైన ఆస్పత్రులు గాని, విద్యా సౌకర్యాలు గాని, మంచినీటి సౌకర్యాలు గాని రాలేదు గాని, మారుమూల దాకా పోలీసు వాహనాలు ప్రయాణించడానికి అనువైన మంచి తారురోడ్లు మాత్రం వచ్చాయి) పక్కనే ఒక లోయ ఉంటుంది. ఆ లోయ దిగి అక్కడ ప్రవహిస్తున్న కాలువ దాటి ఒక కొండ ఎక్కి, దిగి మరొక కొండ ఎక్కబోతుండగా వాలులో ఉంటుంది వాకపల్లి.

అది ఒకే గ్రామం అనడానికి కూడ వీలు లేదు. అక్కడక్కడా కొన్ని కొన్ని ఇళ్లతో, ఆ ఇళ్ల సమూహాల మధ్య రెండు మూడు ఫర్లాంగుల దూరంతో విస్తరించుకుని ఉన్న విశాలమైన నాలుగైదు వాడల సమూహమైన గ్రామం అది. మొత్తం అరవై గడపల దాకా ఉండవచ్చు. గ్రామం జనాభా నాలుగు వందలకు మించదు. అందరికందరూ కోందు తెగకు చెందిన ఆదివాసులే.

మైదాన ప్రాంతాల ప్రమాణాలతో చూస్తే అది పేద గ్రామం అనిపించవచ్చు గాని అక్కడ చుట్టూరా పరచుకున్న పంటలు, పచ్చదనం, సెలయేళ్లతో నీటి సౌకర్యం చూస్తే మాత్రం అది సంపన్న గ్రామం కావడానికి అన్ని అవకాశాలూ ఉన్నాయనిపిస్తుంది. అక్కడి ఆదివాసులు పసుపు పండిస్తారు. వరి, జొన్న పండిస్తారు, కందులు, అలసందలు పండిస్తారు. పిప్పళ్లు పండిస్తారు. అరటి చెట్లు విస్తారంగా ఉన్నాయి. అక్కడ ఉండే పసుపులో క్యాన్సర్ రోగ నిరోధక ధాతువులు మిగిలినచోట్ల పండే పసుపులో కన్న ఎక్కువగా ఉన్నందువల్ల ఆ పసుపుకు మంచి ధరకూడ పలుకుతుంది. అక్కడ ఉండే పిప్పళ్లు ఔషధాలకు ఉపయోగపడతాయి గనుక వాటికి బయటి మార్కెట్‌లో మంచి గిరాకీ ఉంది. కాకపోతే ఈ దినుసులతో లాభసాటి వ్యాపారం చేసి డబ్బు సంపాదించే వాళ్లు ఆదివాసులు కాదు, మధ్య దళారీలు. గ్రామంలో కొన్ని పక్కా ఇళ్లు ఉన్నప్పటికీ పేదరికం, మరీ ముఖ్యంగా చిన్నారి పిల్లలను చూసినప్పుడు కొట్టవచ్చినట్టు కనబడుతూనే ఉంటుంది.

ఆ ఆదివాసుల గ్రామం తూర్పు కనుమలలోని అన్ని గ్రామాలలాగే విప్లవోద్యమ ప్రభావంలో ఉంది. ఆ గ్రామం నుంచి గతంలో కొందరు వ్యక్తులు దళాలలో చేరారనీ, ఇప్పటికీ ఆ గ్రామ ఆదివాసులు విప్లవకార్యకర్తలకు, దళాలకు ఆశ్రయమిస్తారనీ ప్రతీతి. అయినా ఆగస్ట్ 20 కి ముందు ఆ గ్రామంలోకి పోలీసులు ప్రవేశించలేదు. ఇప్పుడు నల్లమల నుంచి విప్లవకారులను తుడిచిపెట్టేశామని, ఇక ఆంధ్ర-ఒరిస్సా సరిహద్దు ప్రాంతంలో ఆ పని చేయబోతున్నామని ప్రకటించిన నేపథ్యంలో

పోలీసులు ఆ ప్రాంతంలో భయోత్పాతాన్ని సృష్టించదలచుకుని ఆ భయోత్పాత సృష్టికి ఎన్నుకున్న గ్రామాలలో వాకపల్లి కూడా ఉంది. ఆ గ్రామస్తుల మీద దాడి చేయడం ద్వారా ఆ గ్రామస్తులనూ, పరిసర గ్రామస్తులనూ భయపెట్టాలని, విప్లవోద్యమంలో పాల్గొంటున్నందుకు, దానికి సహకరిస్తున్నందుకు "శిక్ష" విధించాలని పోలీసులు పథకం రచించారు.

ఈలోగా విశాఖపట్నం ఏజెన్సీలో విస్తారమైన, సంపన్నమైన ఖనిజ నిలువలు ఉన్నాయని, అందులో సామ్రాజ్యవాద, బహుళజాతి సంస్థల యుద్ధపరికరాల పరిశ్రమకు అవసరమైన బాక్సైట్ ఖనిజం విస్తృతంగా ఉన్నదని తెలిసివచ్చింది. గిరిజనుల భూబదలాయింపును నిరోధించే 1/70 చట్టం ఉన్నప్పటికీ, దాన్ని తుంగలో తొక్కి దేశదేశాల సంపన్నులకు బాక్సైట్‌ను కట్టబెట్టాలని పాలకవర్గాలు ప్రయత్నాలు ప్రారంభించాయి. ఆ ప్రయత్నాలను ఆదివాసులు తీవ్రంగానే అడ్డుకోవడం ప్రారంభించారు. ఆ ఆదివాసి ప్రతిఘటనను అణచివేయాలంటే, బాక్సైట్ తవ్వకాలకు ఆటంకాలను తొలగించాలంటే ఆదివాసులను భయపెట్టి లొంగదీయాలని పాలకవర్గాలు పథకాలు సిద్ధం చేశాయి. ఆదివాసుల మీద ఉక్కుపాదం అటు విప్లవోద్యమాన్ని తుడిచివేయడానికి, ఇటు బాక్సైట్‌ను సామ్రాజ్యవాదులకు అప్పగించడానికి మార్గంగా పనికొస్తుందని చేసిన కుట్ర ఫలితమే వాకపల్లి అత్యాచారం.

రెండు దశాబ్దాలుగా చట్టవ్యతిరేకంగా, ఏ ప్రజాస్వామిక అజమాయిషీ లేకుండా, వందల కోట్ల రూపాయల ప్రజాధనం ఖర్చుపెడుతూ, నంబర్లు లేని వాహనాలలో, లెక్కచూపనక్కరలేని ఇంధనం వాడుతూ, ఎక్కడా నమోదుకాని పద్ధతిలో జీతభత్యాలు పొందుతూ అభివృద్ధి అయిన గ్రేహౌండ్స్ అనే బలగాన్ని ఈ పనికి నియోగించాలనుకున్నారు. మరే పోలీసు విభాగం ఈ పని చేసినా ఎక్కడో ఒకచోట నమోదు అవుతుంది. ఎక్కడో ఒకచోట విచారణను ఎదుర్కోవలసి వస్తుంది. ఎప్పుడో ఒకప్పుడు శిక్ష పడుతుంది. అవి తప్పించుకోవాలంటే విచారణాతీత, శిక్షాతీత ప్రవృత్తి అలవాటయిన బలగాలను ఈ కార్యక్రమానికి వాడుకోవాలి.

అలా గ్రేహౌండ్స్ పోలీసులు ఆగస్టు 20 ఉదయాన వాకపల్లిలోకి ప్రవేశించారు. అది ప్రధానంగా వ్యవసాయ గ్రామం కావడం వల్ల ఆ సమయానికి పురుషులు ఎవరూ గ్రామంలో లేరు. మామూలుగానే ఆ గ్రామ పురుషులు తెల్లవారుఝామున మూడు నాలుగు గంటల సమయంలో పంటల దగ్గరికి వెళ్లి తొమ్మిది దాటాక వెనక్కి తిరిగి వస్తారు. గ్రేహౌండ్స్ దాడి ఉదయం ఆరు ఆరున్నర ప్రాంతంలో జరిగింది. గ్రామం మీద గ్రేహౌండ్స్ దాడి అంటే మేకల మంద మీద తోడేళ్ల గుంపు పడినట్టే. మొత్తం గ్రామమే కకావికలమైపోయింది. ఇళ్లముందర, ఇళ్లపక్కన చెట్ల గుబుర్లలో పని చేసుకుంటున్న స్త్రీల మీద, ఇళ్లలోపల వంటపనిలో ఉన్న స్త్రీల మీద గ్రేహౌండ్స్ విరుచుకుపడ్డారు. దాడిలో పాల్గొన్న మొత్తం గ్రేహౌండ్స్ 20 మంది పైన ఉంటారని అంచనా. అందులో సగం మంది తుపాకులు ఎక్కుపెట్టి ఉండగా కనీసం సగంమంది ఆదివాసి మహిళలపై అత్యాచారానికి పాల్పడ్డారు. ఘటన జరిగిన వెంటనే అక్కడికి వెళ్లిన పాత్రికేయులకు, ప్రజా సంఘాల వారికి పగిలిన గాజు ముక్కలు, చిరిగిన చీరలు, చెదిరిన నేల వంటి సాక్ష్యాధారాలు స్పష్టంగా కనబడ్డాయి.

కాని ఆ అత్యాచారం వార్తలు వెలువడగానే ఏ పరిశోధనా, విచారణా లేకుండానే అది అబద్ధమని రాష్ట్ర డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ ప్రకటించారు. తమ పోలీసు బలగాలు అక్కడ మావోయిస్టుల కోసం కూంబింగ్ జరుపుతున్నారు గనుక ఆ కూంబింగుకు అడ్డుకట్ట వేయడానికి మావోయిస్టులు గిరిజన మహిళలతో ఆడిస్తున్న నాటకంగా ఆయన ఆ వార్తలను కొట్టిపడేశారు. ఆనాడు అత్యాచారం చేసిన పోలీసులు వాకపల్లిలో బెదిరించడం, తిట్టడం, అత్యాచారం చేయడం మాత్రమే చేశారు తప్ప ఇళ్లలోకి వెళ్లి సోదాలు కూడ చేయలేదని, అంటే వాళ్లు అసలు కూంబింగ్ ఉద్దేశ్యంతో రాలేదని తేలుతున్నదని బాధితులు అంటున్నారు.

అత్యాచారం వార్తలు వెలువడినవెంటనే డిజిపి తీసుకున్న వైఖరిని హోంమంత్రి, ముఖ్యమంత్రితో సహా పాలక రాజకీయ నేతలందరూ తీసుకున్నారు.

అత్యాచారం తర్వాత వెంటనే ఆ మహిళలకు తగిన వైద్య పరీక్షలు చేయించి, సాక్ష్యాధారాలు సేకరించాలి. కేసు నమోదు చేసి నిందితులను, బాధితులను విచారించాలి. అది ఏజెన్సీ ప్రాంతం గనుక, బాధితులు షెడ్యూల్డ్ తెగలకు చెందినవారు గనుక చట్టపరమైన నిబంధనలు చాలా తీవ్రంగా ఉంటాయి. కాని ఆ పనులన్నీ చేయవలసింది మళ్లీ పోలీసులే గనుక వాళ్లు ఒక్క పని కూడా చేయలేదు. ప్రజల ఒత్తిడిమీద చేయవలసి వచ్చినప్పుడు కూడా అరకొరగా చేశారు. తప్పులతడకగా చేశారు. వైద్య పరీక్షలకు ఉద్దేశ్యపూర్వకంగా ఆలస్యం చేసి సాక్ష్యాధారాలు మిగలకుండా చేశారు. నేరం జరిగిన స్థలాన్ని వెంటనే సందర్శించి ఆధారాలు సేకరించలేదు. ఎట్టకేలకు కేసు నమోదు చేశారు గాని నిందితుల పేర్లు లేవు. నిందితుల పేర్లు తెలియనప్పుడు, సందర్భ ఆధారాలను బట్టి ఆ రోజు అక్కడికి వెళ్లినవాళ్లందరినీ బాధితుల ముందర నిలబెట్టి బాధితుల గుర్తింపును బట్టి నిందితులను నిర్ధారించవలసి ఉండగా ఆ పనీ చేయలేదు. ఈ అవకతవకల వల్ల ఫోరెన్సిక్ నివేదికలో సాక్ష్యాధారాలు బయటపడలేదు.

ఈలోగా సాధారణ పోలీసు దర్యాప్తు కోసం వచ్చిన అధికారి ఐదులక్షల రూపాయలు ఇస్తామని, కేసు ఉపసంహరించుకొమ్మని బేరం మొదలుపెట్టాడు. పోలీసుల దర్యాప్తుమీద నమ్మకం లేదని కొత్తగా నియమించిన సిఐడి శాఖ కూడ పోలీసు వ్యవస్థలో భాగమే గనుక ఆ దర్యాప్తు కూడ సక్రమంగా జరగలేదు. ఆ దర్యాప్తు అధికారి అత్యాచారం జరిగిన ఏడువారాలదాకా సంఘటనాస్థలాన్నే చూడలేదు. హైకోర్టు, రాష్ట్ర మానవహక్కుల కమిషన్, జాతీయ ఎస్.సి. ఎస్.టి. కమిషన్ ఇచ్చిన ఆదేశాలన్నిటినీ ప్రభుత్వం తుంగలో తొక్కింది. గిరిజన సంక్షేమశాఖ అధికారి కొంతలో కొంతయినా న్యాయంగా విచారణ జరిపి నివేదిక ఇచ్చారనుకుంటే ఆ నివేదికను బయటపెట్టకుండా, దాన్ని తిరగరాయించడానికి, అత్యాచారం జరగలేదని చెప్పించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

జిల్లా కేంద్రానికి మూడు, మూడున్నర గంటల ప్రయాణదూరంలో ఉన్న ఈ గ్రామాన్ని సందర్శించడానికి, బాధితులను పరామర్శించడానికి జిల్లా కలెక్టరుకు ఏడువారాల దాకా తీరిక దొరకలేదు. జిల్లా పోలీసు సూపరింటెండెంటుతో, చుట్టూ డజన్లకొద్దీ నేమ్ ప్లేట్స్ లేని, నంబర్లు

**ఆదివాసుల అభివృద్ధికి అడుగడునా అడ్డుపడుతూ, వారి ఆకాంక్షలకు తూట్లు పొడుస్తూ, అణచివేత విధానాలతో పాలకులు సాగిస్తున్న పాలనవల్ల, తమ నేలకు తామే పరాయిలౌతున్న ఆదివాసుల జీవితాన్ని మన వివరిస్తున్నారు జి. రమేష్**

# మన్యం ఆదివాసుల జీవిత చిత్రణ

**వా**రు అడుగేస్తే ఆంక్ష... పనిచేస్తే ప్రతిబంధకం...! మొత్తంగా వారి బతుకే నిర్బంధం. ప్రకృతి సిద్ధంగా సంక్రమించిన వారి ఉపాధి అశాస్త్రీయం. అపేక్షనీయం. తిండికరువై మామిడి టెంకతిన్నా, దొరికిన మాంసం తిన్నా అది అశుభ్రం. సూదిమందే కాదు, గోలిమందు కూడా దొరకనిచోట ఆదివాసులంతా మలేరియాకో విషజ్వరానికో, డెంగీకో ఏటా వందల్లో, వేలల్లో సామూహికంగా బలైపోవడం 'నాగరిక' సమాజం పరోక్షంగా వేసిన శిక్షాశాసనం. ఆదివాసులు వేటాడితే వన్యమృగాలు అంతరించిపోతాయట. పోడుచేస్తే గిరులన్నీ బోడిగుళ్లవుతాయట. జీవన విధానంలో భాగమైపోయిన వారి 'బాణం' ఎక్కుపెడితే శాంతిభద్రతలు మంటగలుస్తాయట. అందుకనే ఇప్పుడు ఆదివాసీ ప్రాంతాల్లో కరెంట్ లేకున్నా, విద్య, వైద్య సదుపాయాలు లేకున్నా, ఇళ్లు లేకున్నా అత్యాధునిక పోలీసు బలగాలు 'కంపెనీల' కొద్దీ పోలీసు క్యాంపులు పెడతాయి. లేకుంటే కూంబింగ్‌లు చేస్తాయి. ఇదంతా వారి కోసమే, వారికి నాగరికత అలవాటు చేసేందుకేనని నాగరికులు చెబుతుంటారు. యావత్ ప్రపంచానికి నాగరిక జీవన మార్గదర్శనం చేసిన ఆదివాసీ జాతులకు నేడు 'జీవించే హక్కు' ప్రశ్నార్థకమవుతోంది.

సామూహిక జీవనాన్ని శాస్త్ర సాంకేతిక రంగాలు అభివృద్ధి కాక మునుపే ఆదర్శ జీవనంగా క్రియాత్మకంగా నిరూపించి చూపాయి ఆదిమ గణరాజ్యాలు. పర్యావరణాన్ని, ప్రకృతిని తమవెంట సమృద్ధం చేసుకుంటూ జీవనదారులు వేసినవారు ఆదివాసులు. ఉపాధిని, సంఘజీవనాన్ని 'మంది' ప్రయోజనానికి భూమికగా చేసిన ప్రజాస్వామిక తత్వం ఆదివాసుల జీవనసారం. అందుకనే ఒక కవి "నాగరికతలో, సాగుచరితలో మీరే మాకు సారథులు" అంటూ ఆదివాసులను కీర్తించాడు. ఇంతటి శాంతికాముక పురోగామి జీవనాన్ని ప్రపంచానికి అందించిన ఆదివాసీ తెగలు నేడు అంతరించిపోయే అంచున నిలబడి బిక్కుబిక్కుమంటున్నాయి. ఈ దేశానికివిముక్తి మార్గం చూపించిన అల్లూరి ఎలుగెత్తిన చోటు విశాఖమన్యం. పితూరీతో వలసపాలకుల గుండెల్లో రైళ్లుపరుగెత్తించిన వీరయ్యదొర తిరుగుబాటు చేసిననేల ఇది.

---

లేని, అసలు యూనిఫారాలే లేని, తుపాకులు ఝుళిపిస్తున్న టీషర్టులు, జీన్ పాంట్ల గ్రేహౌండ్స్ లేదా స్పెషల్ పోలీసులతో కలిసి ఆయన అక్టోబర్ 14న ఆ గ్రామానికి వచ్చాడు.

"మీకు నిరసన తెలిపే, ధర్నా జరిపే హక్కు పూర్తిగా ఉన్నది. మీరు ధర్నా జరుపుతుంటే మా పోలీసులు వేధిస్తున్నారని మీ నాయకులు పత్రికలకు చెపుతున్నారు. అది సరికాదు. నేను పూర్తిగా మీకు న్యాయం చేయడానికే ఉన్నాను. కాని మీ వాళ్లే కోర్టుకు ఎక్కారు గదా, కోర్టులో ఉన్నప్పుడు నేను ఏమీ చేయలేను. పైగా మీ గ్రామానికి వచ్చిన 20 మందిలో పది మందే గదా రేప్ చేసింది. ఆ పది మంది ఎవరో మీకూ తెలియదు, నాకూ తెలియదు. ఆ పది మందిని శిక్షించవలసిందే, కాని మిగిలిన పదిమంది నిర్దోషులకు శిక్షపడగూడదు గదా, వారికి అన్యాయం జరగకూడదు గదా. రేపు కోర్టు ఇదిగో వీళ్లు నేరం చేశారు అని చెప్పనివ్వండి, వాళ్ల మీద తప్పకుండా చర్య తీసుకుంటాం" అని ఆయన ఆ గ్రామంలోని పురుషులకు ఉపన్యాసం ఇచ్చాడు. పక్కనే నిలబడి ఉన్న బాధిత మహిళలతో మాట్లాడలేదు సరిగదా, "వాళ్లకు తెలుగు రాదు గనుక నేను మాట్లాడడం లేదు" అని తప్పించుకున్నాడు.

బాధిత మహిళలలో సగం మందికి తెలుగు బాగా మాట్లాడడం వచ్చు. అందరికీ తెలుగు అర్థం అవుతుంది కూడ. ఒకపక్క కలెక్టర్ ఉపన్యాసం సాగుతుంటే, మరోపక్క నిలబడిన బాధిత మహిళలు తమ వాదనంతా బిగ్గరగానే, తెలుగులోనే వినిపిస్తూ ఉన్నారు. తమ తరఫున తమ పురుషులు మాట్లాడినా చాలుననుకునే మధ్యతరగతి మహిళల కన్న భిన్నంగా, కలెక్టర్ వెళ్లిపోగానే 'మాతో మాట్లాడకుండానే వెళ్లిపోయాడు చూడండి' అని ఆ ఆదివాసి మహిళలు అన్నారు.

అక్టోబర్ 14 నాటికి కూడ వాకపల్లి మహిళలలో అత్యాచారాల పట్ల ఆవేదన, ఆగ్రహం కనిపించాయి. ఆ ఏడువారాల్లో ప్రభుత్వం ప్రదర్శించిన దుర్మార్గమైన అలసత్వం పట్ల అసంతృప్తి కనిపించింది. తమ మీద జరిగిన అంత ఘోరమైన, నీచమైన దాడిపట్ల నాగరిక సమాజం ప్రదర్శిస్తున్న నిర్లిప్తత చూసి వారిలో నిరసన కనిపించింది. ప్రభుత్వ శాఖలు, స్వతంత్ర సంస్థలు ఒక్కొక్కటీ తమ పట్ల కొనసాగించిన అన్యాయంతో ఈ రాజ్య స్వభావం తెలిసివచ్చి వ్యక్తమవుతున్న ఆగ్రహం కొట్టవచ్చినట్టు కనిపించింది.

వాకపల్లి బాధిత మహిళలు వినిపించిన ఎన్నో ఆలోచనా స్ఫోరకమైన మాటల్లో ఒకటి : "మాకు నోరు లేకపోవచ్చు గాని సిగ్గు లేదా" అని. ఆ ప్రశ్నకు నోరున్న వాళ్లందరమూ జవాబు చెప్పాలి. నోరులేని వాళ్లకోసం ఉపయోగించలేకపోతే మనకు నోరు ఉండి మాత్రం ప్రయోజనమేమిటి? ◆

## ఆదివాసీ తెగల వైవిధ్య జీవనస్థలి మన్యం

విశాఖ జిల్లాలో పదకొండు మండలాల్లో విస్తరించిన మన్య ప్రాంతంలో వివిధ ఆదివాసీ తెగలు నివసిస్తున్నాయి. ఏజెన్సీగా పిలిచే ఆదివాసీ మన్యం జిల్లాలో 22 లక్షల 360 హెక్టార్ల మేర విస్తరించివుంది. కొయ్యూరు, గూడెం కొత్తవీధి, చింతపల్లి, జి.మాడుగుల, పాడేరు, పెదబయలు, ముంచంగిపుట్, హుకుంపేట, డుంబ్రిగూడ, అరకులోయ, అనంతగిరి మండలాల్లో అనేక ఆదివాసీ తెగల వారు జీవిస్తున్నారు.

భగతలు, కొండదొరలు, వాల్మీకి, కువ్వి, నూకదొర, కొటియా, కమ్మరి, పొర్జ, పరంగపొర్జ, గదబ, మాలీ వంటి తెగలు మొత్తం అయిదు లక్షల మంది ఆదివాసులు మన్యంలో జీవిస్తున్నారు. బ్రిటిష్ పాలన నుంచి అధికార మార్పిడి జరిగిన తర్వాత ప్రభుత్వాలు తెచ్చిన చట్టాల నేపథ్యంలో అనేక మార్పులకులోనై ప్రస్తుతం విశాఖమన్యంలో జీవిస్తున్న ఆదివాసులు తమ నేటివ్ జీవితానికి దూరమై వ్యవసాయాన్ని ప్రధాన వృత్తిగా చేపట్టాల్సిన అవసరం ఏర్పడింది. పోడువ్యవసాయం, అటవీ ఉత్పత్తుల సేకరణ, వేటవంటి సంప్రదాయ వృత్తులను కొంతవరకూ కొనసాగిస్తున్నారు. భిన్నమైన జీవనవిధానం కలిగినవారు 'సామంతులు'గా పిలిచే కువ్వితెగ ప్రజలు. వీరు సంచార జీవనం ఆధారంగా బతుకు సాగిస్తుంటారు. కొండలు చదునుచేసి వ్యవసాయం చేస్తారు. ఆ భూమిసారం తగ్గిపోతే వేరొక చోటికి వలసపోతారు. కుండలు చేయడమే వృత్తిగా స్వీకరించిన వారు కొండకుమ్మర్లు. అయితే వీరిని ప్రస్తుత ప్రభుత్వాలు ఆదివాసులుగా గుర్తించకపోవడంతో వివిధ పథకాల ఫలాలు వారికి అందుబాటులోకి రావడంలేదు.

## ఆదివాసుల్లో పేదరికం

ఆదివాసులకు ఉపాధి పెద్ద సమస్యగా పరిణమించిన నేపథ్యంలో వారు సరైన తిండిలేక రోగాలబారిన పడుతున్నారనేది ఒక వాస్తవం. ఒంట్లో సత్తువలేక ఈ రోగాలబారిన పడుతున్నారని అధికారికంగానే ప్రకటిస్తున్నారు. పాడేరు ఏజెన్సీలోని లక్షా 26 వేల పైచిలుకు ప్రజానీకంలో లక్షా 17 వేల పైచిలుకు దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారని అధ్యయనాలు తెలియజేస్తున్నాయి. వీరిలో 57 వేలకు పైగా పేదల్లో పేదలుగా ఉన్నారు. ఆదివాసీ గ్రామాల్లో కూలీపనికి వచ్చే వేతనం రోజుకు రు. 20 మాత్రమే. దీంతోపాటు ఆదివాసీ ప్రాంతాల్లో సంవత్సరంలో నాలుగు మాసాలు మాత్రమే పని ఉండటంతో మిగిలిన రోజుల్లో వారు అర్థాకలితో ఉండాల్సివస్తోంది. పోషకాహార లోపం అత్యధికంగా ఉండేది మే, జూన్, జూలై, ఆగస్ట్, సెప్టెంబరు నెలల్లో మాత్రమేననీ, మలేరియా వ్యాపించేది ఈ నెలల్లోనేనని అధ్యయనాలు తెలియజేస్తున్నాయి. ఈ ప్రాంతంలోని పౌరపంపిణీ వ్యవస్థ కూడా అధ్వాన్నంగా ఉండటంతో సరుకులు కొనుక్కోవడం కూడా ఆదివాసులకు ఇబ్బందిగా పరిణమిస్తోంది. పని దొరకకపోవడం, సంప్రదాయ ఉపాధి వనరులు కరువవడం లేదా నిషేధించడం వంటి కారణాల వల్ల అధిక ఆదివాసీ కుటుంబాలు మండల కేంద్రాల్లోని షావుకార్ల వద్ద రుణగ్రస్తులవుతున్నారు. అధికసంఖ్యలో ఆదివాసులు నెలకు వంద రూపాయలు వడ్డీ చెల్లిస్తుండడంతో వందలాది కుటుంబాలు కునారిల్లుతున్నాయి. మలేరియా వంటి వ్యాధులు వచ్చే ఆదివాసీ ప్రాంతాల్లో నిపుణులు సూచించిన మాలాథియన్ స్ప్రే ఇళ్ల బయట పశువుల కొట్టాల్లో మాత్రమే జరుగుతోంది కానీ, మురుగునీటి కుంటలు, కాల్వల మీద, ఊరు పక్కనే ఉండే పొలాల్లో జరగడం లేదు. ఈ నేపథ్యంలో ఆదివాసులు పారిశుధ్యం సరిగా పాటించరని, వారు పౌష్టికాహారం తినరని నిందించడంలో సహేతుకత ఎంతవరకూ ఉందని అధ్యయనాలు సూచిస్తున్నాయి.

## అభివృద్ధి ఆదివాసులకు శాపం

అభివృద్ధి పేరిట ఆదివాసీ ప్రాంతాల్లోని సహజవనరులను, మానవవనరులను నాగరిక ప్రపంచం బలవంతంగా వినియోగించుకోవడం ఏనాటి నుండో మొదలయ్యింది. అదే ఆదివాసీ ప్రాంతాల్లో ఒక చిన్న చెక్‌డ్యాం నిర్మించాలంటే ఎన్నో ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తోంది. కొంతకాలం క్రితం కొయ్యూరు మండలం బూదరాళ్ల గ్రామం వద్ద చెక్‌డ్యాం నిర్మించేందుకు ప్రయత్నిస్తే చివరికి ఆదివాసీ శాసనసభ్యుని పై కేసులు కూడా పెట్టిన ఘటనలు వున్నాయి. ఈ చెక్‌డ్యాం నిర్మాణానికి రిజర్వ్ ఫారెస్ట్‌లో వున్న పదిమీటర్ల బండరాయి ప్రాంతాన్ని వినియోగించుకోవడం పెద్ద ఉల్లంఘన. కాగా ఆదివాసీలు ఉద్యమం చేయాల్సివచ్చింది. అలాంటిది నగరాలు, మైదాన ప్రాంతాలకు తాగు, సాగునీటి వసతి కల్పించాలన్నా, విలువైన ఖనిజాలు వినియోగించాలన్నా దశాబ్దాలుగా వారికి రక్షణ కల్పిస్తున్న ఆదివాసీ చట్టాలు అడ్డురావు. అంతేకాదు లిబరలైజేషన్ పేరిట ఆయా చట్టాలను బుట్టదాఖలు చేయవచ్చు. పబ్లిక్ హియరింగుల్లో ప్రజాభిప్రాయాన్ని కూడా ఖాతరు చేయనవసరం లేదు. ఇందుకు తాజా ఉదాహరణ బాక్సైట్ తవ్వకాలు, అల్యూమినా రిఫైనరీలు, ఫ్యాక్టరీల కోసం ప్రభుత్వం చూపుతున్న ఉత్సాహం తార్కాణంగా నిలుస్తుంది. తవ్వకాలను జిందాల్‌కు, అల్యూమినా ఫ్యాక్టరీ ఏర్పాటుకూ రాస్-అల్-ఖైమా వంటి ప్రైవేట్ సంస్థలకు అప్పగించేందుకు ప్రభుత్వం తీవ్రమైన ప్రయత్నాలు చేస్తోంది. బాక్సైట్ తవ్వకాలు జరిగితే ఆదివాసులు నిరాశ్రయులవుతారనీ, అల్యూమినా ఫ్యాక్టరీ వల్ల తీవ్రమైన కాలుష్యం విస్తరిస్తుందనీ, నిపుణులు, ప్రజాసంఘాలు, రాజకీయ పార్టీలు చెబుతున్నా ప్రభుత్వం 'అభివృద్ధి' పేరిట వినాశకర తవ్వకాలనూ, లీజులనూ ఉపసంహరించుకునేందుకు ఇష్టపడటం లేదు. ఈ అల్యూమినా అభివృద్ధిలో భాగంగా ఏర్పాటయ్యే యాష్‌పాండ్, రెడ్మండ్ పాండ్‌లు అత్యంత ప్రమాదకరమైన కాలుష్యాన్ని వెదజల్లడమే కాక ఉపరితల నీటివనరులతో పాటు భూగర్భ జలాలు కూడా కాలుష్యమవుతాయన్నా, అభివృద్ధి ప్రయత్నాలు నిలిచిపోలేదు. ఈ విశాల మన్యంలో బహువిలువైన అపారమైన గనులూ, ఖనిజాలూ ఉన్నాయి. ఈ ప్రాంతమే కాదు, ఆదివాసీ ప్రజాభిమానులు ఎవరైనా ఈ దేశంలోని ప్రముఖ గనులనూ, ఖనిజాలనూ, భారీ ప్రాజెక్టులనూ చేర్చి పటంవేస్తే అవన్నీ ఆదివాసుల ప్రాంతాలే అవుతాయి. గతం కన్నా వర్తమానం ఈ వాస్తవాన్ని మరింత స్పష్టంగా ప్రపంచం ముందు ఉంచగలుగుతుంది. ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణ రోజుల్లో దేశంలోని దళారీ నిరంకుశ పెట్టుబడిదారులతో, బహుళజాతి సంస్థలతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కుదుర్చుకుంటున్న వందలాది అవగాహన ఒప్పందాలు ఆదివాసుల అస్తిత్వానికి పెను ప్రమాదంగా తయారవుతున్నాయి. భారీ ప్రాజెక్టులతో

స్వాతంత్ర్యానంతరం 90 లక్షల ఆదివాసుల జీవితాలు నిరాశ్రయమయ్యాయి. ఇదంతా కేవలం మానవ సంపదనే కాకుండా, విస్తార అడవుల్లో ఆదివాసులతో చెలిమి చేసే సమస్త వన్యప్రాణిని క్రమంగా నాశనం చేస్తున్నాయి. అరుదైన వన్యప్రాణి జాతులు లుప్తమయి పోతున్నాయి. పైన పేర్కొన్న పరిస్థితిలో పరాయికరణ చెందుతున్న ఆదివాసులు వారి అస్తిత్వం కోసం వారి జాతి సమగ్ర వికాసం కోసం 'అడవిపై సర్వాధికారం ఆదివాసులకే' అంటూ ఉద్యమానికి దిగక తప్పడం లేదు.

## వారికి అభివృద్ధి ఆమడదూరం

విశాఖమన్యంలో జీవిస్తున్న ఆదివాసుల్లో 95 శాతం మంది తీవ్రమైన పేదరికంలో మగ్గిపోతున్నారు. పొద్దస్తమానం శ్రమించనిదే వారి జీవితం ఘుడియ గడవదు. అటవీ ఉత్పత్తుల సేకరణా, పొలం పనులూ కలిసి రోజులోని అధిక భాగాన్ని హరించివేస్తున్నాయి. నిండు చూలాలు అయినా, పండుముసలైనా, మూడేళ్ల పిల్లలైనా పనిలో పొద్దుతోటి పోటీపడాల్సిందే. ఇంత చేసినా నిత్యం ధరలు పెరుగటంతో సరుకులను కొనుక్కోలేక, ఇల్లు గడవడమే గగనంగా తయారవుతున్న 'ప్రపంచీకరణ' పరిస్థితులలో వారిజీవితాల్లో వలసపోవడం తప్పటంలేదు. భారతదేశంలో ప్రముఖ నగరాలంతటా దగాపడుతూ ఛిద్రమవుతున్న జీవితాలను వెలికితీస్తే అవి అధికశాతం దళిత, ఆదివాసులవేనన్న నగ్నసత్యం బయటపడుతుంది. పలు నదులకు జీవగడ్డగా గుర్తించే ఈ ప్రాంతంలోని 57 పంచాయితీల్లో 1.6 శాతం మందికి మాత్రమే రక్షిత మంచినీరు అందుతోంది. జిల్లాలోని 244 పంచాయితీల్లోని 56 పంచాయితీలకు నేటికీ విద్యుత్ వెలుగులు లేవు.

జిల్లాలోని ఆదివాసీ ప్రాంతాల్లో 30 వేల మంది జనాభాకి ఒకటి వంతున ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఉన్నాయి. నిత్యం శ్రమించే వారి జీవితాల్లోకి వైజ్ఞానిక దృష్టి కోణాన్ని సోకకుండా చేసి వారి ఆరోగ్యాలతో ప్రభుత్వాలు ఆడుకుంటున్నాయి. ఉచిత (నిర్బంధ) విద్య, ఉచిత వైద్యం రాజ్యాంగపరంగా వారికి లభిస్తాయనే సంగతే వారిలో చాలా మందికి తెలియదంటే అతిశయోక్తి కాదు. ఏజెన్సీ ప్రాంతాల్లోని బడుల్లో చేరిన పిల్లల్లో 70 శాతం మంది డ్రాప్‌అవుట్స్‌గా మధ్యలోనే చదువు మానేస్తున్నారన్నది ఒక అంచనా. ఏజెన్సీలోని 1565 అవాసాలకు రెండు కిలోమీటర్ల పరిధిలో ప్రాథమిక పాఠశాలలు లేవు. అదే విధంగా 1791 నివాస ప్రాంతాలకు ప్రాథమికోన్నత పాఠశాలలు అయిదు కిలోమీటర్ల దూరంలోపు అందుబాటులో లేవు. 1931 అవాసాలకు అయిదు కిలోమీటర్ల దూరంలోపు ఉన్నత పాఠశాలలు లేవు. విశాల అటవీ ప్రాంతంలో ఆధునిక అభివృద్ధికి అందనంత దూరంలో విసిరి వేయబడ్డట్టున్న ఆదివాసీ పల్లె జీవితాల్లో విద్య, వైద్యం వారికి అందడం అంటే ఊహకందనిదే. ఎప్పుడు ఏ మహమ్మారి ప్రబలుతుందో తెలియదు. ఏరోగం, ఏనొప్పి ఎవరి ప్రాణాలు బలితీసుకుంటుందో తెలియదు. ఇంత 'అభివృద్ధి' చెందిందంటున్న ప్రపంచంలో ఆదివాసుల్ని యింకా మలేరియా, డెంగీలాంటి జబ్బులు హతమార్చుతూనే వున్నాయి. ఒక్క 2005 సంవత్సరంలో మొదటి ఏడు నెలల్లోనే 2,227 మరణాలు నమోదయ్యాయి. సరైన ఆహారంలేక, పరిశుభ్రత లోపించి వెంటాడే క్షయ, కలరా, కుష్టులాంటి భయంకర వ్యాధులు యేటేటా విస్తరిస్తున్నాయి. పేదరికానికితోడు వారికి అలవడిన పొగ, తాగుడు వంటి వ్యసనాలు, సామ్రాజ్యవాద వినిమయ సంస్కృతి పిచ్చెత్తిస్తున్న పానీయాలు, గుట్కా గూడాకు సహా మాదక ద్రవ్యాలనేకం వారి మూలుగులను పీలుస్తున్నాయి. ఆదివాసీ జీవితం అంటే వీటన్నిటితో పోరాటం అని వారి గురించి తెలిసిన వాళ్లెవ్వరికీ ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. బతుకు పోరాటంలో ఓడిపోతూ, పోరాడుతూ గెలుపు మీద ఎనలేని విశ్వాసంతో జీవిస్తున్న బతుకులు వారివి.

## ఆదివాసీ సంస్కృతిని భ్రష్టుపట్టించే టూరిజం

విశాఖ మన్యంలో అందాల అరకులోయ 'ఊటి'గా ప్రసిద్ధి. ఇక్కడి దట్టమైన అడవులు, అడవుల్లో వన్యమృగాలు, అరుదైన పక్షిజాతులూ, అతిప్రాచీన గృహాలు, జలపాతాలు వీటిని సందర్శించడానికి దేశ విదేశాల నుండి పర్యాటకులు వస్తుంటారు. మానవ సమూహాల వికాసాన్ని అర్థం చేసుకోవడానికి ఇలాంటివి చక్కగా తోడ్పడతాయి. వీటికి వున్న విశిష్ట ప్రాముఖ్యతను దోపిడీ ప్రభుత్వాలు డాలర్లలోకి మార్చుకోవడానికి పోటీ పడుతున్నాయి. ఇక్కడి బహుసుందర దృశ్యాలను పార్కులుగా, ఉద్యానవనాలుగా, జంగిల్ బెల్స్‌గా, యింకా రకరకాల పేర్లతో వీటిని తీర్చిదిద్ది పర్యాటకులను ఆకర్షించడానికి అపూర్వ స్థాయిలో ప్రచారాన్ని మొదలుపెట్టాయి. ఇక్కడ ఆదివాసుల సంస్కృతి, సంప్రదాయాల్ని, కళల్ని కళాఖండాలుగా తీర్చిదిద్ది ఆదివాసీ 'మ్యూజియం' లో పెట్టి సందర్శకుల నుంచి పెద్ద మొత్తంలో డబ్బు గుంజుకుంటున్నారు. ఇక్కడికి వచ్చే సందర్శకుల కోసం మత్తెక్కించే స్టార్ హోటళ్లను, రిసార్ట్సు, ఇతర విడిది కేంద్రాలను విచ్చలవిడిగా నిర్మిస్తున్నారు. వీటిని ఆధారం చేసుకొని అతి నికృష్టంగా జీవించే ఒక లంపెన్ కార్మికవర్గం ఉనికిలోకి రావడం అతి సహజం. అతి ప్రాచీన ప్రజా సంస్కృతిని ధ్వంసం చేస్తూ లాభాల కోసం దుర్మార్గానికి ఒడిగట్టే దాష్టిక సామ్రాజ్యవాద సంస్కృతిని పెంచి పోషించడానికి ప్రభుత్వమే పెద్ద స్పాన్సరర్‌గా వ్యవహరిస్తోంది. ఇక్కడ అసలు విషయం ఏంటంటే ఈ నూతన నిర్మాణాలన్నీ ఒక ప్రాచీన సముదాయాన్నీ, వారి సంస్కృతినీ, వారి చరిత్రనూ హననం చేసి నరమేధాన్ని సాగిస్తూ, వారి సమాధుల మీద వీటిని నిర్మించడానికి ప్రయత్నిస్తున్నారు. దీనిని అడ్డుకోకుండా నిజమైన చారిత్రక ప్రగతి ఉండదు. నిజానికి బ్రిటిష్ వారి రాకతో ఇక్కడి వారి చారిత్రక వికాసక్రమం మలుపు తిరిగింది. మా ఆర్థిక వ్యవస్థ (సమాజపు పునాది) అపసవ్యపు మార్గం పట్టింది. ఇది నానాటికి మరింత వక్ర మార్గం పడుతూ, నేటి ప్రపంచీకరణ విధానాల ఫలితంగా పరాకాష్టకు చేరింది. ఈ విష సంస్కృతిని అంతం చేసి ప్రజా సంస్కృతిని నిర్మించుకోవాల్సి ఉంది.

## జీవించే హక్కును ప్రశ్నిస్తున్న నిర్బంధం

ఆదివాసుల జీవితాలను ఇంధనంతో పోల్చుకోవచ్చు. విశాల అటవీ ప్రాంతంలో మాచ్‌ఖండ్, జోలాపుట్, సీలేరువంటి భారీ ప్రాజెక్టులు నిర్మించడం ద్వారా లక్షలాది ఆదివాసులు నిర్వాసితులయ్యారే తప్పా సాగునీరందే భూములు వారికెక్కడా దక్కలేదు. అనేకానేక పరిశ్రమలకు

నిర్విరామంగా విద్యుత్ అందిస్తున్నా పూటగడవని స్థితే నెలకొంది. వారి ప్రాకృతిక సంపదలన్నీ వారివి కాకుండా పోతున్నాయి. ఫలితంగా ఆదిమానవులను తలచుకుంటూ 'ఆహార సేకరణ'లో భాగంగా అటవీ ఉత్పత్తులను సేకరించుకుంటున్నారు. ప్రభుత్వం తనకు ఇష్టం వచ్చినట్టు అటవీ ఉత్పత్తులను విభజించి లఘు ఉత్పత్తుల సేకరణకే అర్హులంది. భారీ ఉత్పత్తులపై వారికి ఎలాంటి హక్కు లేకుండా నిషేధించింది. గ్రామ సభల గురించి ఎంతో గొప్పగా ప్రచారం చేసుకుంటున్న ప్రభుత్వం ఆచరణలో వాటిని ఏమాత్రం గౌరవించటం లేదు. 73వ రాజ్యాంగ సవరణను ఒక విప్లవంగానే చెప్పి ప్రచారం చేసినవారు ఇప్పటికైనా వారెంతటి భ్రమల్లో వున్నారో అర్థం చేసుకోవాలి. వారు అనేక పరిమితులు, నిర్బంధాలు, ప్రమాదాల మధ్య అటవీ ఉత్పత్తులను పొందాలి.

అటవీ ఉత్పత్తులను పొందడానికి ఆదివాసులు ఎన్ని తిప్పలు పడుతున్నారో వాటి యాజమాన్య హక్కుల కోసం అంతకన్నా అనేక రెట్లు పోరాడుతున్నారు. అడువుల నుండి తరలించుకుపోయే సమస్త ఉత్పత్తులను సేకరించి పెట్టేది వాళ్లు. చాలి చాలనీ 'కూలీరేట్లు' మాత్రమే తీసుకుని జీవిస్తున్నారు. తునికాకు సేకరణలో, కర్ర-వెదురు నరకడంలో, అడ్డాకులు సేకరించినందుకు అతి తక్కువ కూలీరేట్లు చెల్లిస్తారు. రకరకాల అటవీ ఉత్పత్తులు తీసుకుని వారు సంతలోకి వెళితే నిలువుదోపిడీకి బలవుతున్నారు. సామ్రాజ్యవాద యుగంలో ఏదీ స్థానికం కాకుండాపోయి అన్నీ ప్రపంచ మార్కెట్‌తో అనుసంధానించబడుతున్నాయి. ప్రపంచీకరణ విధానాలతో చిల్లర వర్తకులు తుడిచిపెట్టుకుపోతూ, బహుళజాతి సంస్థలు చొరబడని రంగం, ప్రాంతం లేకుండా పోయింది. ఒక్క మన్యంలోనే కాఫీ, విద్యుత్, అటవీ ఉత్పత్తులు, వ్యవసాయ ఉత్పత్తుల ద్వారా ఏటా జరిగే 1000 కోట్ల రూపాయలకు పైబడిన వ్యాపారాన్ని తమ చేతుల్లోకి తీసుకోవడానికి ఘరానా కార్పొరేట్ గృహాలు పోటీపడుతున్నాయి. వీరిని అడ్డుకోవడం ద్వారానే యాజమాన్య హక్కులను అనుభవించడానికి వీలవుతుందని గుర్తించిన ఆదివాసులు పోరాడుతున్నారు. దాన్ని సహించదల్చుకోని ప్రభుత్వం వారిపై నిర్బంధకాండ సాగిస్తోంది. ఇక్కడ బాక్సైట్, సున్నపురాయి, గ్రానైట్, డోలమైట్, కాల్‌సైట్ సహా అతి విలువైన రంగురాళ్లు (వజ్రాలు) కూడా అపారంగా లభ్యమవుతున్నాయి. ఎంతటి కంప్యూటర్ యుగంలోనైనా మూలపదార్థాలను వెలికి తీయకుండా, వాటిని పారిశ్రామిక సరుకులుగా మార్చకుండా మానవుని జీవితానికే మనుగడలేదు. అందుకే వాటిని కబ్జా చేసుకోవడానికి బిర్లా, జిందాల్, ఎస్సార్, రాస్-అల్-ఖైమా, రిలయన్స్ లాంటివారు, బహుళజాతి సంస్థలు పోటీ పడుతున్నాయి. ఉన్న కాస్తో, కూస్తో బతుకులను కబళించడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వీరికి అనుమతిస్తున్నాయి. ప్రకృతి సంపదలతో నిండిన ఈ ప్రాంతాలలోకి రహదారులు వేస్తున్నారు. పారిశ్రామిక అభివృద్ధితో ఆదివాసులను అందలమెక్కిస్తామంటూనే పేద ఆదివాసులను అరెస్ట్ చెయ్యడమూ, పోలీసు కస్టడీలో ఉంచి చిత్రహింసలు పెట్టడమూ, అక్రమంగా కేసులు బనాయించి జైళ్లకు పంపడమూ వంటి సంఘటనలు నిత్యకృత్యమయ్యాయి. ఈ ప్రాంతాల్లో ప్రభుత్వ పాలన అంటే తుపాకీ అంచున పోలీసులు ఆదివాసీ గ్రామాల్లో హుకుం చెలాయిండం. ఇందుకు తాజా ఉదాహరణ ఇటీవల గంగరాజు మాడుగుల మండలంలో 'వాకపల్లి' అత్యాచార ఘటన. గ్రామం పొలిమేరలు దాటని ఆదివాసీ మహిళలు ఊరు విడిచి, మండలం దాటి, జిల్లా కేంద్రంలో భోరుమంటే వారిపై జరిగిన దురాగతం 'అనుమానస్పదంగా' సమాజం చూడటం ఎంతటి దారుణం. పోలీసు స్టేషన్ నుంచి మానవ హక్కుల కమిషన్ వరకూ వారు తమకు అన్యాయం జరిగిందని రోదిస్తుంటే దానిని మావోయిస్టుల ఒత్తిడిగా చిత్రించడం తప్పిదం కాదా అని ప్రజాస్వామ్య వాదులు ప్రశ్నిస్తున్నారు. శాంతి భద్రతల పేరిట పోలీసులు ఆదివాసుల గూడాలపై ఈ రకమైన దాడులకు పాల్పడడం ఇది కొత్తకాదు. విశాఖ జిల్లా చింతపల్లి మండలంలో 1987లో పోలీసులు 45 గ్రామాలపై దాడులు చేసి, గుడిసెలను తగలబెట్టారు. సజీవ దహనానికి, అత్యాచారాలకు తెగబడ్డారు. దానిపై విశాఖ నగరంలో మాజీ న్యాయమూర్తులతో జరిగిన విచారణను కూడా పోలీసులు కిరాయి మూకలతో రసాభాస చేశారు. తమ అస్తిత్వానికై పోరాడుతున్న ఆదివాసీలను అంతమొందిస్తున్నారు. ఇంత భయంకరమైన దౌర్జన్యాలు సునాయాసంగా జరిగిపోతున్నాయి. భారత రాజ్యాంగం తన చట్టాల్లో ఏం చెబుతోంది? 'చట్టం నిర్దేశించిన పద్ధతిలో ఏ వ్యక్తి ప్రాణాన్ని లేదా వ్యక్తిగత స్వేచ్ఛని హరించడం జరగదు' అని చెబుతోంది. కాని నిజానికి జరుగుతున్నదేమిటి? అపహరించుకు పోవడాలూ, హత్యలూ! ఈ హత్యల మీద విచారణలు లేవు, కేసులు లేవు, న్యాయం లేదు. వారి జీవితాల్లో హింసను భరించడం ఒక భాగం అయింది. కుటుంబహింసను భరించడం కన్నా రాజ్యహింసను భరించడమే బాధగాఉంది. కుటుంబంలో, తెగలో అమలవుతున్న సంప్రదాయ హింస మోటుగా వుండి భరించడం దుర్భరంగానే ఉంటున్నప్పటికీ చాలా వరకు జీవితంపై ఆశను చావనీయదది. తన వాళ్లతో అల్లుకున్న కోటొక్క బంధనాలను సాధరణంగా తెంచుకోనీయదది. కానీ రాజ్యహింస శారీరకంగా, మానసికంగా, లైంగికంగా, రాజకీయంగా, సామాజికంగా, సాంస్కృతికంగా, ఆర్థికంగానూ వారి జీవితాలను దుర్భరం చేస్తోంది.

## పోరాట చిత్రణ

'ఆధునిక రాజ్యం' వారి జీవితాలను శాసించటం పెరుగుతున్న కొలది వారి పోరాటాలు విస్తృతమవుతున్నాయి. ఈ దేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా మొదటి తూటా పేల్చింది ఆదివాసీలే నన్న వాస్తవాన్ని ఒకసారి గుర్తుకు తెచ్చుకుంటే, ఈ మన్యంలో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా జరిగిన ఘనమైన తిరుగుబాట్ల చరిత్ర వెంటనే గుర్తొస్తుంది. మొదట రాంభూపతి నాయకత్వంలోని రంప పితూరీలో స్త్రీ-పురుషులు విల్లంబులతోనే గెరిల్లా యుద్ధాన్ని సాగించారు. ఆ తర్వాత ఎక్కడికక్కడే ప్రజా తిరుగుబాట్లు జరిగాయి. వీటిల్లో అల్లూరి నాయకత్వంలో 1922-24 వరకు జరిగిన మన్యం పితూరీ చిరస్మరణీయమైనది. ఆనాడు జరిగిన గొప్ప తిరుగుబాట్లలో బ్రిటిష్ వారి తూటాలకు వందలాది ఆదివాసులు ప్రాణాలు కోల్పోయారు. పరాయి పాలనను వ్యతిరేకించిన వీరయ్యదొర, అగ్గిరాజు, గంటం దొర, మల్లుదొర, మర్రి కామయ్య వంటి ఆదివాసీ వీరులు త్యాగజీవులు

అయ్యారు. మన్యం పితూరీని అణచడానికి బ్రిటిష్ కిరాయి సైనికులు అడవుల్లో సృష్టించిన బీభత్సంలో మరెందరో స్త్రీలు, పిల్లలు, వృద్ధులు ప్రాణాలు కోల్పోయారు. బ్రిటిష్ దుర్మార్గులు వందేళ్ల కిందే మన్యంని ఖాకీలమయంచేసి జరిపిన హత్యకాండ, అత్యాచారాలు, లూటీ, గృహదహనాలు, సజీవదహనాలు, ఆస్తుల నష్టం నేటికీ మన్యం అంతటా తరాలెన్ని మారినా జనాలెవరూ మర్చిపోలేదు. అల్లూరి నాయకత్వంలో జరిగిన 'మన్యం పితూరీ' నేటికీ పోరాట స్ఫూర్తినిస్తోంది. ఇలా చారిత్రకంగా చూస్తే కూడా రెండువందల సంవత్సరాలుగా ఆదివాసీ ప్రజానీకం తొలుత సామ్రాజ్యవాద పాలనకూ, పీడనకూ పిదప భారత పాలకవర్గాలకూ వ్యతిరేకంగా పోరాడుతున్న చరిత్రే. ఈ పోరాటం మామూలుది కాదు. ఇది ఒక యుద్ధం. ఒక జీవన సమరం. వారు ఆధునిక రాజ్యానికి వ్యతిరేకంగా దాని భారీ ఆయుధాలకు వ్యతిరేకంగా సాయుధంగానే పోరాడాలనుకున్నారు. వారి ముందు తరాలవాళ్లు పోరాటకారులు. ఆ పోరాటాల్లో స్త్రీ-పురుషులంతా భాగస్తులే. పోరాటాలన్నీ అంతిమంగా ఓటమితోనే ముగిశాయి. అయినా వారు అలసిపోలేదు. గత రెండున్నర దశాబ్దాలుగా ఆదివాసులు పోరాడుతూనే వున్నారు.

1980 మధ్య నుండి ఈ ప్రాంతంలో కొత్తగాలులు వీయటం మొదలైంది. ముందు తరాలు ఎన్నడో మరచిపోయిన ప్రాచీన మన్యం పదం మరోసారి అడవుల్లో, గూడల్లో వారి గుండెల్లో ప్రతిధ్వనించసాగింది. దౌర్జన్యం, అణచివేతలతో వారిపై కొనసాగుతున్న దోపిడీని పోరాడి అడ్డుకోవాలనీ, 'అడవిపై ఆదివాసులదే అధికారం' అనే నినాదం తొలిసారిగా విన్నారు. పోరాటానికీ, అధికారానికీ గల అంతఃసంబంధాన్ని తెలుసుకున్నారు. కోడికూతతో మొదలై పొద్దుగుంకే వరకు సాగే వారి శ్రామికజన దినచర్యలో వారెక్కడ మోసపోతున్నారో అర్థం చేసుకున్నారు. 1947 అధికార మార్పిడితో వారికి ఒరిగిందేమీలేదని తేలిపోయినా 1980 నుండి ఆదివాసులు సంఘటిత పడుతుంటే సహించలేకపోతున్న ప్రభుత్వ విధానాలు వారి అభిప్రాయానికి మరింత బలాన్నిస్తున్నాయి.

## అడవిపై అధికారం కోసం సాగుతున్న పోరాటం

'స్వాతంత్ర్యం' పూర్వమే వారి అడవులు పరాయికరణ చెందాయి. బ్రిటిష్‌వారు రూపొందించిన చట్టాల మధ్య ఆదివాసులు బందీలయ్యారు. 1853లో తొలిసారి బ్రిటిష్ వాళ్లు ఈ ప్రాంతంలో ప్రత్యక్షంగా అడుగుపెడితే 1864 నుండి ఆదివాసులు వారి చట్టాల తాకిడికి గురవుతున్నారు. గడచిన 150 సంవత్సరాల నుండి ఆ చట్టాలకు చట్టాలు మరింత తోడవుతూ వారిని అడవులు నుండి దూరం చేస్తున్నాయి. భారత అర్ధవలస – అర్ధభూస్వామ్య పాలకవర్గాలు 1980లోనే అడవులను రాష్ట్రాల జాబితా నుండి కేంద్రానికి మార్చి తమ భల్లూకపు పట్టులోకి లాక్కోవడం యాదృచ్ఛికం ఏమీకాదు. ఎక్కడో దూరాన 1967లో నక్సల్బరీ సంతాల్‌లు రాజేసిన నిప్పురవ్వతో అంటుకున్న అడవి మంటలను (దావానలం) చల్లార్చడం కోసం చేపట్టిన చర్య అది. దీనితో చట్టపరంగా ఆదివాసులకు అటవీ భూములు లభిస్తాయన్న ఆశలూ చల్లారిపోయాయి. వ్యవసాయ ప్రధానమైన భారతదేశంలో, నూటికి 70 మంది రైతాంగం ఉన్న దేశంలో భూమి సమస్యే ప్రధాన సమస్య అని ముందు గుర్తిస్తే, ఈ దేశ జనాభాలో 8 శాతంగా ఉన్న ఆదివాసుల ప్రధాన సమస్య కూడా భూమి సమస్యే అని తేలిపోతుంది. 1980 కేంద్ర చట్టంతో ఆదివాసీ రైతుకు ప్రభుత్వ పట్టా భూమి దొరక్కుండాపోయింది. నిజానికి ముందు కూడా అటవీ భూములను సాగులోకి తెచ్చుకోవడం అంటే ప్రభుత్వ అటవీశాఖ వారితో యుద్ధం తప్పేదికాదు వారికి. వారెక్కడైనా కొంత అడవి నరికారని అటవీశాఖవారు పసిగడితే గబ్బిలాల్లా వచ్చి వాలేవారు. వారి ఇండ్లను తగులబెట్టడం, వారి మహిళలపై అత్యాచారాలు జరపడం, దొరికిన వారిని చితకబాదడం, వారి చిరు సంపదలను (కోళ్లు, మేకలు, కల్లు, సారా, పదో-పరకో ఉంటే డబ్బు) కొల్లగొట్టడం 1980వ దశకం వరకూ తప్పిందికాదు. ఇన్ని చేసినా చివరకు రైతును వదలకుండా చట్టాల సంకెళ్లతో బంధించేవారు. వేలకేసులు ఇప్పటికీ కోర్టుల్లో మూలుగుతున్నాయి. భూమిలేకుండా పంటలు లేకుండా రైతాంగ జీవితాలే ఉండవు. ఎన్ని నిర్బంధాలకు గురిచేసినా వారు తెగించి భూమికోసం పోరాడుతున్నారు. ఇదే వారి ప్రధాన పోరాటం. విత్తిన వారి పంట పొలాలను చేదగొడితే అడ్డుకున్నారు. కోతకొచ్చిన పంటను కోయనీయకుంటే ఎదిరించి కోసుకున్నారు. భూముల్లో నాగళ్లు కట్టేదే లేదని అడ్డమొచ్చిన ఫారెస్ట్ అధికారులను చెట్టుకు కట్టేసి ఆడా-మగా తేడా లేకుండా దుక్కలు దున్నుకున్నారు. వారిలో ఆత్మవిశ్వాసం బలపడింది. ప్రభుత్వం ఇచ్చే భూమి పట్టాలతో పనిలేదని పంటలు అనుభవిస్తూ వస్తున్నారు. అటవీశాఖ ఉద్యోగులెవరూ అడవుల్లో తిరగవద్దని ప్రకటించుకున్నారు. ఎదుగుతున్న తరాలపై వారి నీడ పడకుండా చేసుకున్నారు. గడచిన ఇరవై అయిదు సంవత్సరాలలో రెండు లక్షల ఎకరాల అటవీ భూములను పోరాడి సాగులోకి తెచ్చుకున్నారు.

ప్రస్తుత యు.పి.ఎ. ప్రభుత్వం చేయ తలపెట్టిన అటవీ చట్టాన్ని గూర్చి ఇక్కడే చెప్పుకోవాలి. దేశంలోని అనేక ఆదివాసీ ప్రాంతాలలో గత రెండున్నర దశాబ్దాలుగా వెల్లువెత్తుతున్న ప్రజాపోరాటాల ఫలితంగా ఆదివాసీ సాగుభూములకు పట్టాలిస్తామని తిరిగి ప్రభుత్వం అంటోంది. నిజానికి ఆదివాసీ ప్రజలపై ప్రేమతోనో, సానుభూతితోనో అది అలా అనటం లేదు. అది తేనున్న చట్టం వెనుక పెద్ద కుట్ర జరుగుతోందన్న నిజాన్ని మనమంతా గ్రహించాలి. పలు రాష్ట్ర ప్రభుత్వాలు కార్పొరేట్ రంగంతో కుదుర్చుకుంటున్న ఎం.ఒ.యూ.ల ఫలితంగా వారికి గనులు, ఖనిజాల వెలికితీత కోసం బహు విశాల అటవీ క్షేత్రాలను (లక్షలాది హెక్టార్లు) హస్తగతం చేస్తున్నాయి. దీనితో అనేక ఆదివాసీ సముదాయాల అస్తిత్వానికే పెనుముప్పు ఏర్పడుతోంది. వీటి ఫలితాలు ఇప్పటికే నగర్‌నార్ (బస్తర్) కళింగపట్నం (ఒరిస్సా) బైలదిల్లా (బస్తర్) విశాఖ మన్యం తదితర చోట్ల ఎదుర్కొంటున్నారు. అందుకే ఈ ఒప్పందాలను అడ్డుకోవాలి. అవి పారిశ్రామికాభివృద్ధి ద్వారా ఆదివాసీ జన జీవన వికాసానికి పునాదులవుతాయని చేస్తున్న మోసపు ప్రచారాన్ని ఎండగట్టాలి. యుద్ధ ప్రాతిపదికపై సమైక్యంగా పోరాడి అటవీ భూములు, అడవిపై అధికారం మాదే అని చాటాలి. ◆

**సంస్కరణల తర్వాత జరిగిన ఆర్థిక వృద్ధి నుండి కొందరు మినహాయింపుకు గురికావడాన్ని ప్రభుత్వ కార్యక్రమాలు, పథకాలు తగినంతగా పట్టించుకోలేదని అంటున్నారు ఎస్. మహేంద్ర దేవ్**

# ఆంధ్రప్రదేశ్‌లో సమ్మిళిత అభివృద్ధి

## వ్యవసాయం - ప్రాంతీయ అసమానతలు

ఇటీవలి సంవత్సరాలలో ఎన్నో దేశాలలో వాషింగ్టన్ ఏకాభిప్రాయం ఆధారంగా రూపొందిన విధానాలు అమలౌతున్నాయి. ఈ ప్రపంచీకరణ ఆర్థిక సంస్కరణల మీద ప్రధాన విమర్శలలో ఒకటి ఆ విధానాలకు మానవ ముఖం లేదనేది, ఆ విధానాలవల్ల సమ్మిళిత అభివృద్ధి కాని, సమాన అభివృద్ధి జరగడం లేదనేది. క్రమక్రమంగా సమ్మిళిత వృద్ధితో కూడిన విధానాలు అవసరమని అంతర్జాతీయ స్థాయిలో అభిప్రాయం బలపడుతోంది.

భారతదేశంలో గత రెండున్నర దశాబ్దాలలోనూ ప్రత్యేకించి సంస్కరణల తర్వాత ఆర్థికవృద్ధి చెప్పుకోదగినంత మెరుగుపడింది. అయితే ఈ వృద్ధి నుంచి కొందరు మినహాయింపుకు గురికావడాన్ని ప్రభుత్వ కార్యక్రమాలు, పథకాలు తగినంతగా పట్టించుకోవడం లేదు. గత పదిహేను సంవత్సరాల ఆర్థిక సంస్కరణల అనుభవాన్ని బట్టి చూస్తే ఆర్థిక వృద్ధిలో, విదేశీ మారక ద్రవ్యంలో, ఐ.టి. విప్లవంలో, ఎగుమతుల వృద్ధిలో ఎంతో మెరుగుదల ఉన్నప్పటికీ ఆదాయ పంపిణీలో అసమానత కొనసాగుతోంది. పెరుగుతున్న వృద్ధి, సౌభాగ్యాల వల్ల జనాభాలోని కొన్నివర్గాలు మాత్రమే లాభపడుతున్నాయి. విపరీతంగా రైతుల ఆత్మహత్యలు జరగడంలో వ్యక్తమౌతున్న వ్యవసాయ అల్పాభివృద్ధి, ఉద్యోగ కల్పన పెరుగుదలలో కొరత, స్త్రీలు, శిశువుల అభివృద్ధిలో తరుగుదల, ప్రాంతాల వారీగానూ, సామాజికవర్గాల రీత్యాను దారిద్ర్యం కేంద్రీకరణ, మానవాభివృద్ధిలో వెనుకబాటుతనం, గ్రామాలకు, పట్టణాలకు మధ్య విభజన పెరిగిపోవడం, ప్రాంతీయ అసమానతలు కూడా ఉన్నాయి. అందువల్ల మనం ఇకనుంచి అనుసరించే విధానాలలో సమ్మిళిత అభివృద్ధి ఉండాలని ఏకాభిప్రాయం పెరుగుతోంది. పదకొండో పంచవర్ష ప్రణాళిక విధాన పత్రం త్వరితమైన, ఎక్కువ సమ్మిళితమైన వృద్ధి అవసరమని ప్రతిపాదించింది.

భారతదేశం మొత్తానికి వర్తించే మినహాయింపు సమస్యలు ఆంధ్రప్రదేశ్‌కు కూడా వర్తిస్తాయి. ఆంధ్రప్రదేశ్ అనే రాష్ట్రం విభిన్నమైన వనరులతో, చారిత్రక వారసత్వంతో, సంస్థాగత ఏర్పాట్లతో ఉన్న భిన్న ప్రాంతాలను కలపడం ద్వారా ఏర్పడింది. రాష్ట్రావతరణ తరువాత అభివృద్ధి విధానం ముందు ఉండిన సవాల్ ఈ విభిన్నమైన భాగాలను ఒకే ఆర్థిక వ్యవస్థగా సమీకరించడం ఎలా అనేదే. సమాజంలోని అన్ని వర్గాల ఉత్పాదక భాగస్వామ్యాన్ని కలుపుతూ ఉత్పాదక రంగాలను త్వరితగతిన అభివృద్ధి చేయడం ఎలా అనేదే ఆ సవాలు. గత రెండు దశాబ్దాలలో వృద్ధి ఎక్కువగానే ఉండవచ్చు, కాని సమ్మిళిత వృద్ధిగాని, సమాన అభివృద్ధి గాని కొరవడ్డాయి. ఇదంతా రైలు ఇంజన్ వేగంగా పరుగెడుతున్నట్టే ఉంది గాని, ఆ ఇంజన్‌కు పెట్టెలను, ప్రజలను కలిపినట్టు లేదు. మా దృష్టిలో సమ్మిళిత వృద్ధి అంటే వ్యవసాయంలో వృద్ధి, ఉద్యోగ కల్పన, పేదరికం తగ్గింపు, ఆరోగ్య విద్యారంగాల సాంఘిక రంగ అభివృద్ధి, ప్రాంతీయ తదితర అసమానతల తగ్గింపు.

## ఆర్థికాభివృద్ధి

గత రెండున్నర దశాబ్దాలలో జాతీయ స్థాయిలో మనం హిందూ వృద్ధి రేటును దాటి ముందుకు పోయామని అందరికి తెలుసు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రస్థూల ఉత్పత్తి పెరుగుదల రేట్లను చూస్తే కూడా గత రెండున్నర దశాబ్దాలలో హిందూ వృద్ధిరేటును దాటిపోయినట్టే కనబడుతుంది. 1960లలో 1.8 శాతంగా ఉండిన స్థూల రాష్ట్రఉత్పత్తి పెరుగుదల రేటు 1970లలో 2.8కి, 1980లలో 4.9కి, 1990లలో 5.2కి పెరిగింది. ఈ దశాబ్దం తొలి అయిదు సంవత్సరాలలో ఈ అభివృద్ధిరేటు 5.9 శాతంగా ఉండింది. అయితే 1984-85 నుంచి 1993-94 మధ్య 6.4 శాతంగా ఉండిన ఈ అభివృద్ధి రేటు గత పది సంవత్సరాలలో అంటే 1994-95 నుంచి 2004-05 వరకు కాస్త తగ్గి 5.8 శాతంగా ఉంది.

మరొకవైపు తలసరి స్థూల రాష్ట్ర ఉత్పత్తి పెరుగుదల రేటు గణనీయంగా పెరిగింది. 1980లలో 2.8 శాతంగా ఉన్న ఈ తలసరి పెరుగుదల రేటు 1990లలో 3.9 శాతానికి, 2000-05 మధ్య 4.8 శాతానికి పెరిగింది. గత అయిదు సంవత్సరాలలో జాతీయ సగటు తలసరి కన్నా ఆంధ్రప్రదేశ్ తలసరి పెరుగుదల హెచ్చుగా ఉంది. దేశం మొత్తం మీదికన్న ఆంధ్రప్రదేశ్‌లో జనాభా పెరుగుదల రేటు తక్కువగా ఉండడం వల్ల ఇలా జరిగింది.

దేశం మొత్తంతో పోల్చి చూస్తే గత నాలుగు దశాబ్దాలలో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయాభివృద్ధి రేటు తక్కువగా ఉంది. 1994-95 నుంచి 2004-05 మధ్య అది జాతీయ సగటు కన్నా ఎక్కువగా ఉంది. 1990లలో వ్యవసాయేతర రంగాల పెరుగుదల ఆంధ్రప్రదేశ్‌లో తక్కువగా ఉంది. మరో మాటలో చెప్పాలంటే సంస్కరణల వల్ల ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయేతర రంగం పొందిన లాభాలు ఇతర రాష్ట్రాల కన్నా తక్కువ. అయితే గత అయిదు సంవత్సరాలలో వ్యవసాయేతర రంగం కూడా జాతీయ ప్రమాణాలతో సమానంగా ఉన్నట్టుంది.

నికర రాష్ట్ర ఉత్పత్తి ప్రకారం తలసరి ఆదాయం ఆంధ్రప్రదేశ్‌లో జాతీయ స్థాయి కన్న తక్కువగా ఉంది. జాతీయ తలసరి నికర ఉత్పత్తిలో ఆంధ్రప్రదేశ్ వాటా 1993-96 మధ్య 95.7 శాతంగా ఉండింది. 2002-05 కాలానికి అది 99.3 శాతానికి పెరిగింది.

మొత్తం మీద గత అయిదు సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్ స్థూల రాష్ట్ర ఉత్పత్తి మెరుగుపడినట్టు అనిపిస్తుంది. సగటు వార్షిక పెరుగుదల రేటు 2002-07 మధ్య 6.9 శాతంగానూ, 2003-07 మధ్య 7.8 శాతంగానూ ఉన్నాయి. అట్లాగే గత నాలుగు సంవత్సరాలలో వార్షిక పెరుగుదల రేటు వ్యవసాయరంగంలో 2.6 శాతం ఉండగా పారిశ్రామిక రంగంలో 7 నుంచి 8 శాతం, సేవారంగంలో 8 నుంచి 9 శాతం ఉన్నాయి.

భారత అభివృద్ధి గమనంలో ఒక వైచిత్రి ఏమంటే ఆర్థిక వ్యవస్థలో వ్యవస్థాగత పరిణామం మందకొడిగా సాగుతోంది. రాష్ట్ర స్థూల ఉత్పత్తిలో వ్యవసాయరంగం వాటా పడిపోతున్నప్పటికీ ఆ రంగంలో ఉపాధి కల్పన చాలా తక్కువగా 2.5 శాతం నుంచి 2.7 శాతం వరకు ఉంది. గత అయిదు సంవత్సరాలలో 2000-05 వరకు వ్యవసాయ రంగంలో స్థూల ఉత్పత్తి పెరుగుదల రేటు సాలీనా ఒక్క శాతం కన్న తక్కువగా ఉంది. నికర రాష్ట్ర ఉత్పత్తిలో వ్యవసాయం 1980-93 మధ్య 2.3 శాతం పెరుగుదల రేటును, 1993-2006 మధ్య 2.7 శాతం పెరుగుదల రేటును చూసింది. ఇంకా వివరంగా చెప్పాలంటే సంస్కరణల అనంతర దశలో పంటల రంగంలో సాలీనా 0.6 శాతం వృద్ధి కనబడగా, పశుగణాభివృద్ధిలో సాలీనా 8.4 శాతం వృద్ధి కనబడింది. అంటే సంస్కరణల అనంతర దశలో వ్యవసాయ రంగంలో భారీ వృద్ధికి కారణం పశుగణాభివృద్ధిలో పెరుగుదలే.

19 ప్రధాన పంటలను తీసుకొని పంట దిగుబడిలో పెరుగుదల రేట్లను గణించినప్పుడు 1980-92 మధ్య 2.66 శాతంగా ఉన్న పెరుగుదల రేటు 1991-92 నుంచి 2004-05 మధ్య 0.37 శాతానికి పడిపోయింది.

**రాష్ట్ర తలసరి నికర స్థూల ఉత్పత్తి**
**ఆంధ్రప్రదేశ్ - మొత్తం భారత దేశం (1993-94 స్థిర ధరల వద్ద)** (రూ.లలో)

| | 1993-94 | 1994-95 | 1995-96 | 1996-97 | 1997-98 | 1998-99 | 1999-2000 | 2000-01 | 2001-02 | 2002-03 | 2003-04 | 2004-05 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 7416 | 7711 | 8071 | 8514 | 8191 | 9144 | 9445 | 10195 | 10609 | 10875 | 11756 | 12352 |
| భారతదేశం | 7690 | 8070 | 8489 | 9007 | 9244 | 9650 | 10071 | 10308 | 10754 | 11031 | 11799 | 12416 |

మూలం : భారతీయ రిజర్వ్ బ్యాంక్, 2005-05

వాటా మాత్రం మందకొడిగా తగ్గుతోంది. కేరళ, తమిళనాడు, పశ్చిమ బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలో వ్యవస్థాగత మార్పులు కూడా జరిగి వ్యవసాయరంగంలో ఉపాధి వాటా యాభై శాతానికి కన్నా తక్కువకు పడిపోయింది. కాని, ఆంధ్రప్రదేశ్‌లో మాత్రం అది ఇంకా 58.5 శాతంగా ఉంది. జాతీయ స్థాయిలో చూసినప్పుడు రాష్ట్ర స్థూల ఉత్పత్తిలోనూ, ఉపాధి కల్పనలోనూ వ్యవసాయరంగం వాటా కొంత ఎక్కువగానే ఉంది. ఈ వ్యవస్థాగతమైన మార్పులు సాధించడానికి ఆంధ్రప్రదేశ్‌కు మరికొన్ని సంవత్సరాలు పట్టవచ్చు.

మొత్తం మీద చెప్పాలంటే గత కొద్ది సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ సాపేక్షికంగా హెచ్చు అభివృద్ధి మార్గంలోనే 7 నుంచి 8 శాతంగా ఉంది. ద్రవ్యరంగంలో పనితీరు సంతృప్తికరంగా ఉంది. ఐటి రంగంలో విజయం అందరికి తెలిసినదే. జనాభా పెరుగుదల గణనీయంగా తగ్గింది. అయితే ఆర్థిక వ్యవస్థలోనూ, సమాజంలోనూ ఉన్న వేరువేరు రకాల అసమానతలను, దారిద్ర్యాన్ని తగ్గించడానికి సమ్మిళితవృద్ధి అత్యవసరం. దారిద్ర్య నిర్మూలనకు వ్యవసాయరంగం నుంచి వ్యవసాయేతరరంగాలకు తరలించే వ్యవస్థాగత మార్పులు చాలా అవసరం. స్థూల ఉత్పత్తిలో 7 నుంచి 8 శాతం అభివృద్ధిని సాధించడం కన్న, సమ్మిళితవృద్ధి సాధించడం మరింత కష్టతరమైన సవాలు.

## వ్యవసాయం

దేశం మొత్తం మీదనే 1970లలో, ముఖ్యంగా వరి విషయంలో హరిత విప్లవాన్ని సాధించిన అతి తక్కువ రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. గత రెండు దశాబ్దాలలో రాష్ట్రంలో వ్యవసాయ రంగ పెరుగుదల

2003లో రైతుల స్థితిపై జాతీయ సాంపిల్ సర్వే సేకరించిన గణాంకాలను చూస్తే రైతు కుటుంబాల స్థితిగతుల గురించి ఆసక్తికరమైన సమాచారం వెల్లడవుతుంది. ఒక సగటు రైతుకు వ్యవసాయం నుంచి వచ్చిన నికర ఆదాయం మనుగడకు సరిపోయినంతగా లేదు. ఇక చిన్న, సన్నకారు రైతుల పరిస్థితి మరింత కష్టం. పంటసాగు ఖర్చుల ఆధారంగా జరిగిన మరొక పరిశోధనలో 1980తో పోలిస్తే 1990లలో సగటు రైతుకు అందే వ్యవసాయ ఆదాయం గణనీయంగా తగ్గిందని తేలింది.

ఈ అధ్యయనాలలోని ఇతర పరిశీలనల ప్రకారం వ్యవసాయదారులు తమ రుణాలలో అత్యధిక భాగాన్ని ఉత్పాదక అవసరాలకే ఖర్చు పెడుతున్నారు. వ్యవసాయదారుల కుటుంబాలలో తమకు ఉపయోగపడే వ్యవస్థల గురించిన సమాచారం చాలా తక్కువగా ఉంది. వ్యవసాయదారుల కుటుంబాలు డీజిల్‌ను, విద్యుచ్ఛక్తిని ఎక్కువగా ఉపయోగిస్తున్నారు. డీజిల్ వాడే చిన్న, సన్నకారు రైతుల నిష్పత్తి ఇతర వ్యవసాయదారుల కన్న ఎక్కువగా ఉంది. వ్యవసాయదారులకు ఆధునిక సాంకేతిక విధానం గురించి సమాచారం ప్రగతిశీల రైతుల ద్వారా, ఉత్పాదక అమ్మకందార్ల ద్వారా, రేడియో, టీవీల ద్వారా అందుతోంది.

గత దశాబ్దానికి అటూ ఇటూగా వ్యవసాయ సంక్షోభం వల్ల ఆంధ్రప్రదేశ్‌లో రైతుల ఆత్మహత్యలు పెరిగిపోయాయి. రైతుల ఆత్మహత్యలకు, వ్యవసాయ సంక్షోభానికి స్వల్పకాలిక, దీర్ఘకాలిక కారణాలు ఉన్నాయి. ఆత్మహత్య చేసుకున్న రైతు కుటుంబాలకు సహాయం అందించడం వంటి స్వల్పకాలిక చర్యలతో పాటు భూమి, నీటి నిర్వహణ విధానాలలో సుస్థిరత, గ్రామీణ ప్రాంతాలలో మౌలిక సౌకర్యాలు,

సంస్థాగత పరపతిలో పెరుగుదల, పరిశోధన, విస్తరణ కార్యక్రమాలు, మార్కెటింగ్ బలోపేతం చేయడం వంటి చర్యలు వ్యవసాయ రంగ సంక్షోభాన్ని తగ్గించడానికి అవసరం.

రైతుల సమస్యలలో ప్రధానమైనది పరపతి, రుణ సౌకర్యం. రైతుల రుణభారం గురించి ఎన్.ఎస్.ఎస్. 59వ సర్వే గణాంకాలు సమాచారం ఇస్తాయి. జాతీయ స్థాయిలో 49 శాతం రైతు కుటుంబాలు రుణభారాన్ని అనుభవిస్తున్నాయి. అయితే రాష్ట్రాలస్థాయికి వచ్చి చూసినప్పుడు ఈ రుణభారం వేరువేరుగా ఉంది. రుణభారం విషయంలో ఆంధ్రప్రదేశ్ 82 శాతంతో అగ్రస్థానంలో ఉంది. మేఘాలయలో రైతుల రుణభారం 4 శాతంగా అతి తక్కువ స్థాయిలో ఉంది. అయితే ఇలా మొత్తం రుణభారాన్ని చూడడం కన్న, ఆ రుణం ఎవరి నుంచి వచ్చిందో చూడడం అవసరం.

**రుణభారంతో ఉన్న కుటుంబాల రుణ వనరులు – బకాయిలు (శాతాలు) 2003**

(రూ.లలో)

| రాష్ట్రం | మొత్తం గ్రామీణ కుటుంబాలలో రుణభారం ఉన్న కుటుంబాలు | రుణ వనరును బట్టి శాతం | | వనరును బట్టి బకాయి (శాతం) | |
|---|---|---|---|---|---|
| | | సంస్థాగత | సంస్థేతర | సంస్థాగత | సంస్థేతర |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| ఆంధ్రప్రదేశ్ | 82 | 54 | 77 | 31.4 | 68.5 |
| బీహార్ | 33 | 23 | 84 | 41.7 | 58.5 |
| గుజరాత్ | 52 | 63 | 49 | 69.5 | 30.5 |
| హర్యానా | 53 | 76 | 50 | 67.6 | 32.5 |
| కర్నాటక | 62 | 57 | 55 | 68.9 | 31.2 |
| కేరళ | 64 | 96 | 40 | 82.3 | 17.6 |
| మధ్యప్రదేశ్ | 51 | 64 | 66 | 56.9 | 43.0 |
| మహారాష్ట్ర | 55 | 92 | 30 | 83.8 | 16.2 |
| ఒరిస్సా | 48 | 68 | 46 | 74.8 | 25.1 |
| పంజాబ్ | 65 | 58 | 70 | 47.9 | 52.1 |
| రాజస్థాన్ | 52 | 38 | 81 | 34.2 | 65.8 |
| తమిళనాడు | 75 | 59 | 67 | 53.4 | 46.5 |
| ఉత్తరప్రదేశ్ | 40 | 47 | 70 | 60.3 | 39.7 |
| ఉత్తరాంచల్ | 7 | 65 | 44 | 76.1 | 23.9 |
| పశ్చిమ బెంగాల్ | 50 | 51 | 73 | 58.0 | 42.1 |
| భారతదేశం | 49 | 56 | 64 | 57.7 | 42.4 |

గమనిక : సంస్థాగత రుణాలు సంస్థేతర రుణాలు కలిపినప్పుడు వందకు మించి ఉంటుంది ఎందుకంటే రైతులు రెండు వనరుల నుండి రుణాలు తీసుకోవచ్చు.

మూలం : జాతీయ సాంపిల్ సర్వే రిపోర్ట్ నెం. 498 (ఎన్.ఎస్.ఎస్.ఒ, 2005)

రుణభారం ఉన్న రైతు కుటుంబాలలో 56 శాతం సంస్థాగత రుణాలు కాగా, 64 శాతం వడ్డీ వ్యాపారుల నుంచి తదితర సంస్థేతర వనరుల నుంచి పొందినవే. ఇక్కడ రెండు రకాల రుణాలు కలిపినప్పుడు వందకు మించి ఉన్నదంటే, ఒకే రైతు రెండు వనరుల నుంచి తీసుకోవడం కారణం కావచ్చు. మళ్లీ ఇక్కడ కూడా ఒక్కొక్క రాష్ట్రంలోనూ వాటా వేరువేరుగా ఉన్నది. ఆంధ్రప్రదేశ్‌లో 54 శాతం సంస్థల నుంచి, 77 శాతం సంస్థేతర వనరుల నుంచి ఉంది.

అలాగే ఈ గణాంకాలలో నుంచే తేలే మరొక అంశం రైతులు ఇప్పటికే బకాయి పడి ఉన్న రుణాలు ఏయే వనరుల నుంచి అందాయి అన్నది. ఒక రైతుకు వంద రూపాయల రుణ భారం ఉందనుకుంటే అందులో యాభై ఏడు రూపాయల అరవై పైసలు సంస్థల నుంచి, నలభై రెండు రూపాయల నలభై పైసలు సంస్థేతర వనరుల నుంచి ఉందన్నమాట. ఛత్తీస్‌గడ్, జార్ఖండ్, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్ వంటి రాష్ట్రాలలో సంస్థాగత వనరుల బకాయి 60 శాతంపైన ఉండగా, ఆంధ్రప్రదేశ్‌లో అది 31 శాతంగా మాత్రమే ఉంది.

ఇక్కడ పరిగణనలోకి తీసుకోవల్సిన మరొక సమస్య చిన్న, సన్నకారు రైతులకు పరపతి సౌకర్యం ఎంత ఉందనేది. రైతుకు ఉన్న భూమి పెరిగిన కొద్దీ సంస్థాగత వనరు వాటా పెరుగుతుంది. దేశ వ్యాప్తంగా చూసినప్పుడు చిన్న, సన్నకారు రైతులకైతే సంస్థాగత రుణాలు 22.6 శాతం నుంచి 58 శాతం ఉండగా, మధ్య, పెద్ద రైతులకు 65 నుంచి 68 శాతంగా ఉంది. అంటే ఎంత ఎక్కువ భూమి ఉంటే బ్యాంకుల, సంస్థల రుణం అంతగా దొరుకుతుందన్న మాట. అందువల్ల చిన్న సన్నకారు రైతు ఎక్కువగా వడ్డీ వ్యాపారుల మీద, సంస్థేతర వనరుల మీద ఆధారపడ వలసి వస్తోంది. ఆంధ్రప్రదేశ్‌లో పరిస్థితి కూడా అదే. ఆంధ్రప్రదేశ్‌లో చిన్న, సన్నకారు రైతులు 73 శాతం నుంచి 83 శాతం వరకు సంస్థేతర వనరుల మీదే ఆధారపడుతున్నారు. అట్లాగే ఎన్.ఎస్.ఎస్. గణాంకాల ప్రకారం షెడ్యూల్డ్ తెగకు చెందిన రైతులకు సంస్థాగత రుణాలు చాలా తక్కువగా అందుతున్నాయని తేలుతోంది.

ఈ నేపథ్యంలో వ్యవసాయదారుల ప్రధాన సమస్యలు : 1) విత్తనాలు, ఎరువులు, పురుగుల మందులు వంటి ఉత్పాదకాలలో కల్తీ సరుకుల సరఫరా; 2) సంస్థాగత వనరుల నుంచి తగినంత రుణం అందకపోవడం, అందువల్ల వడ్డీ వ్యాపారుల మీద ఆధారపడడం; 3) సాగునీటి సౌకర్యం లేకపోవడం, భూగర్భ జలం ఇంకిపోవడం; 4) రైతులు బోరువెల్స్ తవ్వకానికి ఎక్కువ ఖర్చు పెట్టవలసి రావడం; 5) ప్రత్యేకించి వాణిజ్య పంటలకు విస్తరణ సేవలు లభించకపోవడం; 6) అనేక వ్యవసాయోత్పత్తులకు గిట్టుబాటు ధరలు లభించకపోవడం; 7) మార్కెటింగ్‌లో దోపిడీ; 8) గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయేతర ఉపాధి కార్యకలాపాలు లేకపోవడం; 9) రైతులు ఆరోగ్య అవసరాల కోసం ఎక్కువగా ఖర్చు పెట్టవలసి రావడం.

ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయరంగంలో అధికాభివృద్ధి సాధించడానికి ఎదుర్కొనే సవాల్ ఏమిటి? సమగ్ర వ్యవసాయాభివృద్ధిని సాధించాలంటే సరఫరా మీదా, గిరాకీ మీదా ఉన్న ఆంక్షలన్నింటిని తొలగించవలసి ఉంటుంది. వ్యవసాయరంగానికి మద్దత్తుగా ఉండే వ్యవస్థలను విధాన

**ఎంపిక చేసిన రాష్ట్రాలలో సాగు భూమి ఆధారంగా వివిధ వర్గాల సంస్థాగత, సంస్థేతర రుణాల బకాయిలు శాతంలో**

| రాష్ట్రం | భూమి కలిగిన వర్గాలు– తరగతులు | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | <0.01 | 0.01–0.40 | 0.40–1.00 | 1.01–2.00 | 2.01–4.00 | 4.01–10.00 | 10.00+ | అన్ని సైజులు |
| **సంస్థాగత వనరులు** | | | | | | | | |
| ఆంధ్రప్రదేశ్ | 16.9 | 19.3 | 25.1 | 26.6 | 41.5 | 48.6 | 49.5 | 31.4 |
| బీహార్ | 36.5 | 20.8 | 47.0 | 66.1 | 63.4 | 19.6 | 70.1 | 39.2 |
| మహారాష్ట్ర | 58.3 | 83.2 | 80.2 | 78.8 | 83.8 | 88.7 | 91.1 | 83.8 |
| ఒరిస్సా | 64.7 | 62.4 | 77.1 | 72.1 | 88.4 | 96.9 | 13.2 | 74.8 |
| పంజాబ్ | 24.8 | 29.2 | 65.6 | 49.1 | 61.2 | 47.5 | 30.1 | 47.9 |
| తమిళనాడు | 19.1 | 37.4 | 46.0 | 61.5 | 65.2 | 74.3 | 82.9 | 53.4 |
| **భారతదేశం సగటు** | **22.6** | **43.3** | **52.8** | **57.6** | **65.1** | **68.8** | **67.6** | **57.7** |
| **సంస్థేతర వనరులు** | | | | | | | | |
| ఆంధ్రప్రదేశ్ | 83.2 | 80.9 | 75.0 | 73.4 | 58.4 | 51.4 | 50.5 | 68.5 |
| బీహార్ | 63.5 | 79.2 | 53.0 | 33.8 | 36.6 | 80.4 | 29.9 | 58.5 |
| మహారాష్ట్ర | 41.6 | 16.8 | 19.8 | 21.1 | 16.2 | 11.3 | 8.9 | 16.2 |
| ఒరిస్సా | 35.4 | 37.5 | 22.8 | 27.9 | 11.7 | 3.2 | 86.8 | 25.1 |
| పంజాబ్ | 75.2 | 71.0 | 34.5 | 50.9 | 38.8 | 52.4 | 70.0 | 52.1 |
| తమిళనాడు | 80.9 | 62.5 | 53.9 | 38.6 | 34.7 | 25.7 | 17.2 | 46.5 |
| **భారతదేశం సగటు** | **77.4** | **56.7** | **47.2** | **42.4** | **34.0** | **31.2** | **32.8** | **42.3** |

మూలం : జాతీయ సాంపిల్ సర్వే రిపోర్ట్ నెం. 498 (ఎన్.ఎస్.ఎస్.ఒ, 2005)

పరమైన మార్పులను చేసి మెట్టప్రాంత వ్యవసాయం ఎక్కువ శ్రద్ధపెట్టి, చిన్న, సన్నకారు రైతుల మీద ఉత్పాదక రంగాలను, ఆదాయాలను పెంచే చర్యలు తీసుకోవాలి. వ్యవసాయంలో అందరికీ తెలిసిన కర్తవ్యాలు ప్రభుత్వ రంగంలోనూ, ప్రైవేట్ రంగంలోనూ పెట్టుబడులు పెంచడం, భూసంస్కరణలతో సహా భూ సమస్యలన్నింటినీ పరిష్కరించడం, పరిశోధన, విస్తరణ, సాగునీటి సౌకర్యాల కల్పన, నీటి నిర్వహణ, పరపతి, మార్కెటింగ్, వ్యాపార సరళీకరణ, పంటల మార్పిడి, ఆహారభద్రత నిర్వహణ, వ్యవస్థాగత సంస్కరణలు. వ్యవసాయాభివృద్ధిని మెరుగుపర్చాలన్నా రైతుల ఆదాయం పెంచాలన్నా ఈ అంశాలన్నిటిని పరిగణనలోకి తీసుకోవాలి.

భారత ప్రధానమంత్రి డా. మన్మోహన్ సింగ్ వ్యవసాయ రంగం ఎదుర్కొంటున్న నాలుగు కొరతలను ప్రస్తావించారు అవి; 1) ప్రభుత్వ పెట్టుబడి, పరపతి కొరత, 2) మౌలిక సౌకర్యాల కొరత 3) మార్కెట్ ఆర్థిక వ్యవస్థ కొరత, 4) విజ్ఞాన కొరత. సాగునీటి అభివృద్ధి, నీటి నిర్వహణ చాలా కీలకమైనది. 1960లలో, 70లలో వచ్చిన హరిత విప్లవం మంచి సాగునీటి సౌకర్యాల లభ్యత తోనే సుగమం అయింది. అయితే ఇప్పటివరకు ఉన్న సాగునీటి సౌకర్యాలు కాలక్రమంలో పనికిరాకుండా పోయాయి. ప్రభుత్వ రంగంలో పెట్టుబడుల కొరత వల్ల కొత్తగా సాగునీటి సౌకర్యాలు అతి తక్కువగా ఏర్పడ్డాయి. రాష్ట్రంలో అన్ని భారీ, మధ్యతరహా నీటి పారుదల పథకాల నుంచి సాధించగల మొత్తం సౌకర్యంలో 35 శాతం ఇంకా సాధించవలసే ఉందని, చిన్న నీటి పారుదల వ్యవస్థలో 40 శాతం సాధించవలసి ఉందని ప్రణాళికా సంఘం చెబుతోంది.

తెలంగాణ, రాయలసీమ ప్రాంతాల లో చెరువుల కింద వ్యవసాయం స్థానాన్ని బావుల కింద వ్యవసాయం ఆక్రమించి, ప్రధానంగా మారింది. గతంలో సాంప్రదాయికంగా, గ్రామీణ సమాజం నిర్వహిస్తూ ఉండిన చెరువులను ప్రస్తుతం నీటిపారుదల శాఖ నిర్వహిస్తోంది. ఆ నిర్వహణలోని నిర్లక్ష్యాల వల్ల పెత్తందార్లైన రైతులు చెరువు గర్భాలను ఆక్రమించుకోవడం వల్ల చెరువులు పనికిరాకుండా పోయాయి. చెరువుల వల్ల భూగర్భ జలాలు సమకూరుతాయి కనుక చెరువులు పాడయిపోవడంతో భూగర్భ జలాలు కూడా ఇంకిపోయి బావులు కూడా ఉపయోగపడడం లేదు. ఇటీవల రాష్ట్రంలో జరిగిన పత్తిరైతుల ఆత్మహత్యలకు గల కారణాలలో బావుల వైఫల్యం కూడా ఒకటి. రాష్ట్రంలోని సాగునీటి పారుదల రంగంలోనీ ప్రధాన సమస్యలు ఆ సౌకర్యాల నిర్వహణకు, మరమ్మతులకు తగిన కేటాయింపులు లేకపోవడం, నీటి పంపిణీలో అసమానతలు, నీటిని ఆదా చేసినందుకు ప్రోత్సాహకాలు లేకపోవడం, నీటి తీరువాలు సక్రమంగా వసూలు చేయకపోవడం. నీటి పారుదల రంగంమీద ప్రస్తుత ప్రభుత్వం శ్రద్ధ సరైన దిశలోనే ఉన్నది.

ఇక వ్యవసాయ ఉత్పాదకాలు, మార్కెటింగ్, భూమి, నీటి నియంత్రణ వంటి విషయాలకు వస్తే సంస్థాగత సంస్కరణలు చాలా అవసరం. అవి ధరల విధానంలో, వాణిజ్య విధానంలో సంస్కరణల కన్నా కూడా ముఖ్యమైనవి. భూమి సంబంధించిన అంశాలలో కౌలుదార్లకు, మహిళా వ్యవసాయదారులకు రుణ సౌకర్యం అందించడం ఒక ముఖ్యమైన అంశం. ముఖ్యంగా చిన్న, సన్నకారుల రైతులకు ఉత్పాదకాలు అందించడానికి, రుణసౌకర్యం కల్పించడానికి, విస్తరణ సేవలు అందించడానికి తగిన వ్యవస్థలను రూపొందించాలి. ఎన్నో రకాల మార్కెటింగ్ నమూనాలు ఉన్నాయి. స్వయం సహాయకం బృందాలు, పాడి ఉత్పత్తిదారుల సహకారసంస్థ వంటి నమూనాలు, చిన్న ఉత్పత్తిదారుల సహకార సంస్థలు, కాంట్రాక్ట్ వ్యవసాయ సంస్థలు వంటివి ఎన్నో ఉన్నాయి. నికర సాగు భూమి ఇంకా విస్తరించడానికి చాలా తక్కువ అవకాశం ఉందని అందరికి తెలుసు. గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో భూమి కొరత ఒక తీవ్రమైన అంశంగా ఉన్నది. నీరు కూడా ఒక విలువైన జాతీయ వనరుగా ఉన్నది. దేశంలోనే నీటి వనరుల గురించి తీవ్రమైన ఆందోళన వ్యక్తమౌతోంది. అందువల్ల భూమి వనరులను, జల వనరులను అత్యంత పొదుపుగా వాడుకోవడం వ్యవసాయ అభివృద్ధి విధానాల ప్రధాన కర్తవ్యం కావాల్సి ఉంటుంది.

*(మిగతా వచ్చే సంచికలో)* ◆

**నిత్యావసర వస్తువుల ధరలు, శాంతిభద్రతలు, విద్య, ప్రాజెక్టులు మొత్తంగా రాష్ట్ర ఆర్థిక దుస్థితిని వివరిస్తున్నారు వి. హనుమంతరావు**

# ఆంధ్రప్రదేశ్ ఆర్థిక స్థితిగతులు

మన రాష్ట్ర ప్రభుత్వం రెండవ అర్ధ శతాబ్దంలో జలయజ్ఞం, పరిశ్రమల పేరుతో వేల ఎకరాల భూమిని పందేరం చేసే బాటపడితే, నిర్వాసితులైన పేదలు భూమికోసం, గూడుకోసం ఉద్యమాల బాట పట్టారు. రాష్ట్రవ్యాప్తంగా వేల ఎకరాలు ఆక్రమణ జరుగుతోంది. లాఠీఛార్జీలు, అరెస్టులతో రాష్ట్రం దద్దరిల్లుతోంది. ఖమ్మం జిల్లాలో ఏడుగురు పోలీసుల కాల్పులకు బలయ్యారు. ప్రజలు చైతన్యవంతులు అవుతున్నారనడానికి ఇది ఒక నిదర్శనం. ఈ పోరాటం కేవలం భూమికోసం, భుక్తికోసం జరుగుతున్న ఆందోళన మాత్రమే కాదు. యావన్మంది అభివృద్ధి (ఇన్‌క్లూజివ్ గ్రోత్) ప్రధాని మన్మోహన్ సింగ్ ఇచ్చిన పిలుపు అర్థం సమాజంలో అంతరాల దొంతరలు తగ్గాలనేదే అయితే, అభివృద్ధి ఫలాలు అందరికీ అందాలనేది ఆ పిలుపు అర్థమైతే, ఆ పిలుపుకు స్పందనే ఈ భూయజ్ఞం. ఈ యజ్ఞం సఫలమైనంత మేరకు ప్రజాస్వామ్యానికి పరిపుష్టత చేకూరుతుంది. ఈ భూయజ్ఞాన్ని నిర్బంధంతో అణచివేయ పూనుకోవటం అంటే ప్రధాని పిలుపును చెత్త బుట్టలో పారవేయడమే అవుతుంది. రాష్ట్రంలో మధ్యంతర ఎన్నికల ప్రస్తావనను పాలకవర్గాలు ముందస్తుగా తీసుకొనిరావటం ప్రజల దృష్టిని మరల్చడానికేనని పోరాటానికి నాయకత్వం వహిస్తున్న వామపక్షాలు మరచిపోకూడదు. ఎన్నికలు వస్తే గిస్తే, ఓట్లు పడేవి ఎన్నికల పొత్తులతో మాత్రమే కాదు; ప్రజలు పాల్గొనే ఈ ఉద్యమం వల్లనే. స్వతంత్రం రాక ముందు నుంచి కాంగ్రెస్ పార్టీ భూసంస్కరణల పాటపాడుతూ వచ్చింది. అధికార మార్పిడి జరిగి అరవై సంవత్సరాలయినా, ఇంకా భూపంపకం జరుగుతూనే ఉంది. ఇంకో లక్షన్నర ఎకరాలు పంచుతానంటోంది. ఈలోగా కార్పొరేట్ డేగలు వచ్చి గ్రామీణ ప్రాంతాల భూముల మీద కాంట్రాక్టు వ్యవసాయం పేరుతో వాలుతున్నాయి. వామపక్షాలు ప్రస్తుత అర్థవలస, అర్థభూస్వామ్య వ్యవస్థా, లేక బడాబూర్జువా పెట్టుబడిదారీ వ్యవస్థా అని దశాబ్దాలుగా చర్చిస్తూ వస్తున్న సమస్యను పిట్ట-పిట్ట తగువు పిల్లి తీర్చిందన్నట్లు, బహుళజాతి కార్పొరేట్ సంస్థలు గ్రామీణ వ్యవస్థలో ప్రవేశించి ఆ సమస్య ను పరిష్కారం చేసిందా అని అనిపిస్తుంది. ప్రముఖ వ్యవసాయార్థిక శాస్త్రవేత్త ప్రొఫెసర్ కె.ఆర్. చౌదరి భూసంస్కరణల స్థానంలో ఇప్పుడు వ్యవసాయ సంస్కరణలనేవి వచ్చి కూర్చున్నాయంటున్నారు. ఈ నూతన విధానానికి పునాది వ్యవసాయరంగంలో కార్పొరేట్ పెట్టుబడులకు తలుపులు బార్లా తెరచి పెట్టడమే అంటున్నారు. "పెట్టుబడిని, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రవేశపెట్టడం, పంటల పద్ధతిలో వైవిధ్యం, మెరుగైన నిలువ, ప్రాసెసింగ్ మార్కెటింగ్ సౌకర్యాల ద్వారా విలువ పెంచడం వంటి చర్యలు, మన వ్యవసాయరంగంలో కార్పొరేట్ కార్యకలాపాలకు భూమికను సమకూర్చింది. ఇది ప్రజా బాహుళ్యానికి జీవనోపాధి కల్పించే వ్యవసాయానికి వ్యతిరేకమైనద"ని చౌదరి అంటున్నారు. అంటే అర్థవలస, అర్థభూస్వామ్య వ్యవస్థ నుంచి పెట్టుబడిదారీ వ్యవస్థ చోటు చేసుకుంటున్నట్లు కాదా? అలాంటపుడు రైతాంగ పోరాటాల స్వరూప స్వభావాలు, ఏదిక్కుగా పయనించాలి అనేలాంటి విషయాలను వామపక్షాలు చర్చించాలి.

## ధరల బాదుడు

పోలీసుల బాదుడు చాలదన్నట్లు, ధరల బాదుడు తోడైంది. అసలు ధరలు పెరగనిదెపుడు? ప్రజలు ఆందోళన చేయనిదెపుడు? ధరల తగ్గింపుకు ప్రభుత్వం కొన్ని కంటితుడుపు చర్యలు తీసుకోనిదెపుడు? అయినా ధరలు పెరుగుతూనే ఉన్నాయంటే దానికి 1) ప్రభుత్వ విధానాలు, 2) చీకటి బజారు వర్తకుల మీద చర్యలు తీసుకోకపోవటం, రెండు ప్రధానకారణాలు. ఒక పక్క ధరల పెరుగుదలతో వీపు విమానం మోత మోగుతుంటే, చూడండి ధరలెలా పెరుగుతున్నాయో అని గణాంకాలతో నిరూపించాల్సిన పనిలేదు. పైగా ఉల్లిపాయ ధర పెరుగుదల తాత్కాలికమేనని ప్రధాని ఉపశమన వాక్యాలు పలకటం పరోక్షంగా చీకటి బజారు వ్యాపారులను వెనకేసుకొని రావటమే. సామాన్యుల జీవితాలు ఈ పెరుగుదలతో తలకిందులవుతుంటే, ఊరడింపు వాక్యాలేమిటో? సంస్కరణలు అమలు పరచిన తర్వాత 1994-95లో టోకు ధరల సూచి 112.6 నుంచి మే 2007 నాటికి 212.3 పాయింట్లకు, అంటే సుమారు రెట్టింపు పెరిగాయని రిజర్వు బ్యాంకు సెప్టెంబర్ 2007 సంచిక తెలియచేస్తుంది. టోకు ధరలకు, వినియోగదారులు చెల్లించే ధరలకు పొంతన ఉండదు. వినియోగదారుల చిల్లర ధరల సూచీలను పరిశీలిస్తే, శారీరక శ్రమ చేయని ఉద్యోగుల సూచి 2006-07 జూలై నుంచి 2007 జూలై మధ్యకాలంలో 517 నుంచి 557కు, జూలై 2006-07 మధ్య వ్యవసాయ కూలీల సూచి 385 నించి 418కు, గ్రామీణ శ్రమజీవుల సూచి అదే కాలంలో అదే స్థాయిలలో సూచీలు పెరిగాయి. ఈ గణాంకాలను ఉదహరించడానికి కారణం ధరల పెరుగుదల లోతును, తీవ్రతను తెలియచేయడానికి

మాత్రమే కాదు, ఇలా ధరలు చుక్కలు చూస్తుంటే ఏమిటలా గుడ్లు మిటకరించి చూస్తున్నావని మీరు ప్రభుత్వాన్ని నిలదీస్తారనే ఆశతో మాత్రమే.

కఠిన చర్యలు తీసుకొంటాం అని అనడమే గాని ఎంత మంది చీకటి వ్యాపారస్తులను ప్రభుత్వం శిక్షించిందో చెబుతారా?

ధరల విషయం చర్చిస్తున్నాం కాబట్టి ముఖ్యమంత్రి ఇచ్చిన కిలో రెండు రూపాయల బియ్యం హామీని కూడా పరిశీలించకముందే, ఈ వరం ఆచరణలోకి వస్తే ఖజానాపై భారంపడి ఆర్థికంగా ఉక్కిరిబిక్కిరికి గురయ్యే ఆర్థిక మంత్రి రోశయ్య అడ్డుకట్ట వేశారు. బాగా జ్వరం వచ్చినపుడు రోగి ఏదేదో మాట్లాడేస్తుంటాడు. ఎన్నికల జ్వరం వచ్చిన ముఖ్యమంత్రి కూడా ఏదో ప్రకటించేశారు. కాని మోసే వాడికే బరువెంతో తెలుస్తుంది. తమిళనాడు ముఖ్యమంత్రి పడి బియ్యం రూపాయ పథకాన్ని పోలిన రెండు రూపాయల కిలో బియ్యాన్ని అప్పటి ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు ప్రకటించి పేద ప్రజల చేత జిందాబాద్ అని అనిపించుకొన్నారుగాని దాని మూలంగా ఏర్పడిన రు. 1100 కోట్ల లోటును భర్తీ చేయకపోవడం వల్ల ఈనాటికి కూడా లోటు బడ్జెట్‌తో సహజీవనం చేయాల్సి వస్తోంది. రెండు రూపాయలకే కిలో బియ్యం అందుకుంటే తప్ప రెండు పూటలా తిండి తినలేని పరిస్థితిలో అత్యధిక గ్రామీణ ప్రజలున్నారనే విషయంలో, అటువంటి వారికి ప్రభుత్వ సాయం అందచేయాలనే విషయంలో వివాదానికి తావులేదు. లేకపోతే ఉచిత విద్యుత్ పథకానికి ఎలా సవరణలు చేయాల్సి వచ్చిందో, అలాగే ఈ రెండు రూపాయల పథకానికి కూడా తూట్లు పొడవాల్సి వస్తుంది. పేదల ఖర్చులో అరవై శాతం ఖర్చు తిండి కోసమే ఖర్చు చేయాల్సి వుంటుంది కాబట్టి ఈ పథకం వారికెంతో రిలీఫ్ చేకూరుతుందనటంలో సందేహం లేదు. ఈ పథకాన్ని సమగ్రంగా చర్చించి, సమర్థవంతంగా రూపొందించి అమలు చేయాలి.

## అశాంతి-అభద్రత

విశాఖలో గిరిజనుల మీద లాఠీఛార్జి, భూపోరాటాల సందర్భంలో వందల మంది అరెస్టులు, ముదిగొండలో కాల్పులు, హైదరాబాద్‌లో టెర్రరిస్టు బాంబు పేలుళ్లో మరణాలు, మానవ బాంబులు తిరుగుతున్నాయని కేంద్రం హెచ్చరికలు, బాంబుల భయంతో నగరంలో వినాయక నిమజ్జనం సమయంలో వేలమంది పోలీసుల మోహరింపు, ముఖ్యమంత్రి అదనపు సెక్యూరిటీ చర్యలు, మావోయిస్టుల ఎన్‌కౌంటర్లు – ఇవీ రాష్ట్రంలో శాంతిభద్రతల ముఖచిత్రం. మావోయిస్టులను చక్కగా మట్టుపెట్టేస్తున్నామని కేంద్రం ఇచ్చే కితాబులతో ఉబ్బితబ్బిబ్బైపోతున్న పోలీసు అధికారులకు నగరంలో పెద్దషాక్. మావోయిస్టులను ఎన్‌కౌంటర్ చేయటంలో మరీ బిజీ అయిపోయి, తమ పీఠం కింద పెట్టిన బాంబులను చూసుకోలేదు. ఎక్కడెక్కడో కారు అడవుల్లో మావోయిస్టులెక్కడున్నారో వారికి తెలుసు. కాని నగరంలోనే ఉన్న టెర్రరిస్టుల గురించి ఏమీ తెలియదు. శాంతి భద్రతలు రాజకీయాలతో ముడిపడి ఉంటాయి. సామాజిక పరిస్థితి మీద ఆధారపడి ఉంటాయి. కాగా పరిష్కారం రాజకీయంగా ఉండాలి కానీ పోలీసు యంత్రాంగం కాదు. కాని పాలకులెపుడూ ఈ తప్పు చేస్తూనే వచ్చారు. ప్రస్తుత ప్రభుత్వం అందుకు మినహాయింపేమీ కాదు. అందుకు మూల్యం ప్రజలు తమ ప్రాణాలతో చెల్లిస్తున్నారు. శాంతి భద్రతలు మంత్రులకే కరువైతే, సామాన్యుల సంగతి వేరే చెప్పాలా? ఈ అభద్రతకు తోడు, లారీ ప్రమాదాలు తోడయ్యాయి. లారీ ప్రమాదాలనే నివారించలేని ప్రభుత్వం ప్రజలకు ఎటువంటి భద్రత కల్పిస్తుంది అనే ప్రశ్న వేసుకోవాలి.

## అవిద్యావ్యాప్తి

ఒక పక్క ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలల మూసివేత, మరోపక్క కాన్సెప్ట్ స్కూళ్ల పేరుతో గ్రామీణ ప్రాంతాల్లో అధిక ఆదాయ వర్గాల పిల్లలకు విద్యావకాశాలు – ఇదేనా సర్వశిక్షా అభియాన్ అమలు తీరు? 'అందరికీ అందుబాటులో విద్య' లక్ష్యాన్ని సాధించే తీరు ఇదేనా? ఇదేనా ప్రభుత్వ విద్యా విధానం అమలు తీరు? శిక్షణ పొందిన ఉపాధ్యాయుల నియామకం పోయే, శిక్షణలేని ఉపాధ్యాయుల నియామకంపోయె. విద్యా వాలంటీర్లతో పనికానిచ్చి, సార్వత్రిక విద్య సాధించేశామని ప్రకటిస్తున్నారు. విశ్వవిద్యాలయ స్థాయి చేరేసరికి ప్రాథమిక విద్యలో చేరిన నూరు మందిలో ఎనిమిది మంది మాత్రమే చేరుకుంటున్నారు. పోనీ వారికైనా సరైన శిక్షణ అందుతుందా అంటే లేబరేటరీలైనా సరిగ్గా లేని మెడికల్ కాలేజీలు, అద్దె రోగులతో, డాక్టర్లతో హాస్పిటళ్ల నిర్వహణ (అదికూడా ప్రభుత్వ కమిటీలు ఎంక్వయిరీకి వచ్చినప్పుడు మాత్రమే) సాగుతున్నాయి. అదే ధోరణిలో ఇంజనీరింగ్ కాలేజీలు – ఇలాంటి నేపథ్యంలో నాలెడ్జి కమిషన్ సిఫార్సుల మేరకు నూతన విశ్వవిద్యాలయాల స్థాపనకు ప్రయత్నాలు, విదేశీ విశ్వవిద్యాలయాలకు ఎర్రతివాచీ – భావి ఇంజనీర్లు, డాక్టర్లు ఎలా తమ వృత్తులను కొనసాగిస్తారో తలచుకొంటేనే భయం వేయటంలేదూ? ఇటీవల యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ చేసిన సర్వే ప్రకారం దాని పర్యవేక్షణలో ఉన్న 14 వేల కాలేజీల్లో (మొత్తం దేశంలో) 38 శాతం మాత్రమే యుజిసి గుర్తింపుకు అర్హత కలిగినవని తేలింది. 'ఈ సర్వే ప్రకారం ఎనిమిది శాతం కాలేజీలకు మాత్రమే "ఎ" గ్రేడ్ లభించింది. ఈ విషయంలో విశ్వవిద్యాలయాలు కాస్త నయం. 'ఎ' గ్రేడ్ 38 శాతానికి లభించింది. 28 శాతం మంది ఉపాధ్యాయులు మాత్రమే పి.ఎచ్.డి. సంపాదించినవారున్నారు. 90 శాతం కాలేజీల్లో సమావేశాలు జరుపుకొనే ఆడిటోరియాలు లేవు. అటు ప్రాథమికవిద్య పునాదులు తవ్వేస్తూ, ఇటు ఉన్నత విద్య నాణ్యతను దిగజారుస్తూ పోవడమేనా మన విద్యా విధానం?

## జలయజ్ఞం

నలభైయ్యవ దశాబ్దం చివరిరోజుల్లో తెలంగాణ ప్రాంతంలో, ఆంధ్రలో సాయుధ పోరాటం జరిపినప్పుడు ఇతర రాష్ట్రాల్లో కమ్యూనిస్టు నాయకులు కొందరు పోరాట క్రమంలో ఆ తప్పు చేశారు, ఈ పొరపాటు చేశారని విమర్శలు వస్తే – అప్పటి కేంద్ర పార్టీ నాయకత్వం పోరాటాలు చేయనివాళ్లు తప్పే చెయ్యరు, పోరాటం చేస్తేనే తప్పులు దొర్లుతాయని ఆ విమర్శకులను మందలించారని విన్నా. అలాగే, నీటి పారుదల ప్రాజెక్టుల నిర్మాణం అంటే ఏమిటో తెలియని ఒకటి, అర తప్ప ప్రాజెక్టులే నిర్మించని తెలుగుదేశం నాయకులు (తెలుగుగంగ తప్ప) 26 ప్రాజెక్టులను చేపట్టి, కుంటో, గుడ్డో, నిర్మాణం సాగిస్తున్న ప్రస్తుత పాలకులను గోబెల్స్ స్టైల్‌లో విమర్శించటమే విడ్డూరం. రాష్ట్రంలో ఒకటి రెండు తప్ప నీటి

# పి. యశోదా రెడ్డి



ప్రముఖ సాహిత్య విమర్శకులు, అధికార భాషాసంఘం మాజీ అధ్యక్షురాలు ప్రొఫెసర్ పాకాల యశోదారెడ్డి అక్టోబర్ 7న మధ్యాహ్నం తమ స్వగృహంలో కన్నుమూశారు. ఆమె వయసు 78 సంవత్సరాలు. యశోదారెడ్డి మహబూబ్‌నగర్ జిల్లా బిజినేపల్లిలో 1929లో సామాన్య రైతు కుటుంబంలో జన్మించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్యాభ్యాసం చేసిన యశోదారెడ్డి 1969లో పి.హెచ్.డి. పూర్తిచేశారు. కొంతకాలం ఆల్ ఇండియా రేడియోలో వ్యాఖ్యాతగా పనిచేసి 1955లో ఉపాధ్యాయ వృత్తిలోకి వచ్చారు. 1976లో ఆగ్రా యూనివర్సిటీ ఆమెకు గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసింది. 1990 నుంచి 93 వరకు రాష్ట్ర అధికార భాషా సంఘం అధ్యక్షురాలిగా పనిచేశారు. తెలుగులో సుమారు 30 పుస్తకాలు రాశారు. పారిజాతాపహరణం, తెలుగులో హరివంశములు, ఆంధ్ర సాహిత్య చరిత్ర వికాసం, అమరజీవులు, తెలుగు సామెతలు ఆమె సుప్రసిద్ధ గ్రంథాలు. ఆమె మంచివక్త. అటు సంస్కృత సమాసభరితమైన శైలితో ఇటు తెలంగాణ జాతీయాలు, సామెతలు, పలుకుబడులు నిండిన శైలితో ఆమె సమానంగా ధారాళంగా వేదికల మీద మాట్లాడేవారు. 1950 నుంచే ఆమె ఆలిండియా రేడియోలో 'మావూరి ముచ్చట్లు' శీర్షికతో తెలంగాణ భాష యాసలో రాసిన కథలను చదివేవారు. ఆ విధంగా తెలంగాణ భాషను విస్తృతంగా శ్రోతలకు విన్పించిన చక్కని కథకురాలు ఆమె. ఆ రోజుల్లోనే ఆమె తెలంగాణ భాషకు, యాసకు ప్రతినిధిగా కనిపించేవారు. అందుకే తెలంగాణ భాష అనగానే అందరికీ ఆమె పేరే గుర్తుకు వస్తుంది. అమె అచ్చం తెలంగాణ భాషలో రాసిన కథలు 'మావూరి ముచ్చట్లు', 'ఎచ్చెమ్మ కథలు', 'ధర్మశాల' పేరుతో మూడు సంకలనాలుగా వచ్చాయి. యశోదా రెడ్డి కథా రచయిత్రిగానే కాక విమర్శకురాలుగా, సంప్రదాయ సాహిత్య పరిచయం గల పండితురాలుగా పేరు సంపాదించుకున్నారు. ◆

ప్రాజెక్టులంటే కాంగ్రెస్ పాలనలో నిర్మించినవే. దీనర్థం అంతా సవ్యంగా జరిగిపోతుందని, విమర్శకు తావులేదని అనటం లేదు. ప్రాజెక్టుల నిర్మాణానికి పి.డబ్ల్యూ.డి వ్యవస్థ ఉండగా, దానిని పక్కకు పెట్టి కాంట్రాక్టర్ల వ్యవస్థకు పునాదులు వేసింది కాంగ్రెస్ ప్రభుత్వం. కాంట్రాక్టర్ల వ్యవస్థలో ఉండే అవకతవకలన్నీ నిర్మాణంలో చోటు చేసుకున్నాయి. ఆమ్యామ్యాలు, రాజకీయ నాయకుల వాటాలు సరేసరి. రేపు దేశం అధికారంలోకి వస్తే గిస్తే కాంట్రాక్టర్ల దోపిడీ అంతరించి పోతుందా? అధికారులంతా మడికట్టుకుని కూర్చుంటారా? రాజకీయ నాయకులకు వాటాలుండవా? ఏలేరు లాంటి స్కాంలుండవా?

రైతుకు కావాల్సింది నీరు. ఆ నీరు ప్రస్తుత ప్రభుత్వం ఇస్తానంటోంది. ఇవ్వాళ కాకపోతే రేపు నీరొస్తుంది. రైతుకు స్వాంతన లభిస్తుంది. ఇది రాజశేఖర రెడ్డి భరోసా. వేలకోట్లు ఖర్చు చేస్తున్నప్పుడు అవకతవకలుంటాయి. గొంగట్లో అన్నంతింటూ వెంట్రుకలొచ్చాయను కోవటమెందుకు? సామాన్యులను వేధిస్తున్న సమస్యలు సవాలక్ష ఉన్నాయి. వాటిని తీసుకొని ముఖ్యమంత్రిని వాయించండి. సమస్యలు పరిష్కారం అయ్యేవరకూ వదిలి పెట్టొద్దు. ఆ పని జరగాలంటే ఉద్యమాలు నిర్మించాలి. ఊళ్లవెంబడి తిరిగి ఉపన్యాసాలిస్తే మంత్రాలకు చింతకాయలు రాలవు.

### ఆర్థిక దుస్థితి

కుబేరుడు రావాల్సి ఉందని ముఖ్యమంత్రి అన్న ఒక్క మాటే మన ఆర్థిక పరిస్థితికి అద్దం పడుతుంది. కుబేరుడి రాకను ఎదురు చూడనిదెప్పుడు? పేదవాడు ఈ రోజు ఎలా గడుస్తుందా అని ఎదురు చూస్తున్నట్లే, ప్రభుత్వం కూడా అదే పరిస్థితిలో ఉంది. చంద్రబాబు అప్పులు తెచ్చాడు, రాజశేఖర రెడ్డి ఆ పనే చేస్తున్నాడు. ఆయన ఎనిమిదేళ్ల పాలనలో 40 వేల కోట్లు అప్పుచేస్తే, ఈయన మూడేళ్లలోనే అంత డబ్బు అప్పుచేసి చంద్రబాబుకన్నా తానే ఘనుడనని నిరూపించుకున్నాడు. చంద్రబాబు పాలన నాటితో పోలిస్తే రాజశేఖరుడు కేంద్రం నుంచి బాగానే నిధులు పిండుకొని వస్తున్నాడు. ప్రజల చేత తాగించి ఎక్సయిజ్ శాఖద్వారా సొమ్ములు బాగానే దండుకొంటున్నాడు. అయితే ఒక్క తేడా ఏమంటే ఈయన తెచ్చిన అప్పు ప్రధానంగా ఉత్పాదక రంగాల్లో ఖర్చు అవుతోంది. ఏదో గుడ్డిలో మెల్ల. అయినా నిత్యం చచ్చేవాడికోసం ఏడ్చే వాడెవడన్నట్లు, ఏ రోజుకారోజు పిట్టను కొట్టా, పొయ్యిలో పెట్టా అన్నట్లు కొనసాగే ఆర్థిక దుస్థితి గురించి ఎంత అరచి గీ పెట్టినా ఏం లాభం.

తెల్లారకుండానే కోడి కూసినట్లు, ఇంకా 18 నెలలుండగానే రాష్ట్రంలో ఎన్నికల కోడి కూసింది. ముందస్తు బడ్జెట్లు, ముందస్తు అంచనాలు, ముందస్తుగా ఏర్పాటు. ముందస్తు ఎన్నికలు మామూలై పోయాయి. వామపక్షాలు తప్ప, లోక్‌సత్తాతో సహా అన్ని పార్టీల వరాల వర్షంతో ఓటర్లు తడిసి ముద్దయిపోతున్నారు. ప్రజల సమస్యల పరిష్కారానికైతే నిధుల కొరత ఉంటుంది కాని వరాలివ్వడానికి నిధుల కొరత అడ్డురాదు. ఎందు చేతనంటే ఇచ్చిన వరాలన్నీ తీర్చాలనేదేమీ లేదు కదా. 2004 ఎన్నికల ముందు తిరుపతి సభలో వరాల వర్షం కురిపించారు గాని కొండమీద నుంచి దేవుడు దిగి రాలేదు. కొండ కింద ప్రజలు ఓటు వెయ్యలేదు. కొండ కిందనే ఉన్న రాజశేఖరరెడ్డి పంట పండింది. ఇప్పుడిద్దరూ పోటీపడి మరీ వరాలు కురిపిస్తున్నారు. ప్రజలు నవ్వుకుంటున్నారు. ఏవైతే కాదన్నాడో, ఇప్పుడు అవునంటున్న చంద్రబాబును చూసి ప్రజలు ఔరా అని ముక్కున వేలేసుకుంటున్నారు. నేనిచ్చిన ఫలానా ఫలానా వరాలు తీర్చానా లేదా అని రాజశేఖర రెడ్డి అంటున్నారుగాని, తీర్చని వరాలెన్నో కాగితం మీదనే ఉండిపోయా యంటున్నారు ఓటర్లు. అయినా నాయకులకు తొందరగాని, మనమెందుకు తొందరపడాలి? ఎన్నికల కమిషన్ స్పందించినపుడు చూద్దాం. ◆

## గణాంకాలలో ఆంధ్రప్రదేశ్

| రాజధాని | హైదరాబాద్ |
|---|---|
| వైశాల్యం (చ.కిమీ) | **2,75,069** |
| జనాభా (2001) | **7,62,10,007** |
| జన సాంద్రత (చ.కిమీ) | **275** |
| వార్షిక జనాభా పెరుగుదల 1991-2001 (శాతం) | **1.40** |
| తలసరి ఆదాయం 2005-05 (రూ.) | **25,526** |
| పట్టణ జనాభా (శాతం) | **27.08** |
| అక్షరాస్యత (శాతం) | **60.47** |
| జిల్లాలు | **23** |
| పట్టణాలు | **210** |
| గ్రామాలు | **28,124** |
| ప్రముఖ పట్టణాలు | **హైదరాబాద్, తిరుపతి, విజయవాడ, విశాఖపట్నం** |
| విమానాశ్రయాలు | **హైదరాబాద్, తిరుపతి, విజయవాడ, విశాఖపట్నం** |
| ఓడరేవులు | **విశాఖపట్నం** |
| ప్రధానమైన పంటలు | **వరి, పొగాకు, వేరుశెనగ, మిరప, మామిడి, ద్రాక్ష** |
| ముఖ్యమైన పరిశ్రమలు | **ఐటి, ఆటో విడిభాగాలు, ఉద్యానవనం, కోళ్ల పెంపకం, ఔషధాలు, చేనేత రంగం** |

| | |
|---|---|
| ప్రస్తుత ధరల్లో జీఎస్‌డిపి (2005-06) (రు. లక్షల్లో) | 2,25,89,200 |
| స్థిర ధరల్లో జీఎస్‌డిపి (2005-06) (రు. లక్షల్లో) | 1,17,43,400 |
| జీఎస్‌డిపి కి వార్షిక వృద్ధి రేటు స్థిర ధరల్లో (2000-06) (శాతం) | 6.40 |
| రాష్ట్ర తలసరి ఆదాయం ప్రస్తుత ధరల్లో (2005-06) (రు.) | 25,526 |
| రాష్ట్ర తలసరి ఆదాయ వార్షిక వృద్ధి రేటు (2000-06) (శాతం) | |
| స్థిర ధర | 5.28 |
| ప్రస్తుత ధర | 8.95 |
| జీఎస్‌డిపిలో రంగాలవారీవాటా (2000-06) | |
| ప్రాథమిక రంగం | 30.33 |
| ద్వితీయ రంగం | 21.81 |
| సేవారంగం | 47.87 |
| నికర మూలధనం ఏర్పాటు (2001) | |
| నికర మూలధనం ఏర్పాటు (రు. కోట్లలో) | 26,194 |
| తలసరి నికర మూలధనం ఏర్పాటు (రు.) | 3,437 |
| మొత్తం వినియోగమైన బ్యాంకు రుణాల బకాయిలు (2005) (రు. లక్షల్లో) | 81,85,712 |

*జీఎస్‌డిపి : రాష్ట్ర స్థూల ఉత్పత్తి

| | |
|---|---|
| సంకీర్ణ వార్షిక పెరుగుదల రేటులో మొత్తం వినియోగమైన బ్యాంకు రుణాల బకాయిలు (2001-2005) (శాతం) | 23.36 |
| రుణాలు-డిపాజిట్ నిష్పత్తి వాదకం (2005) (శాతం) | 83.30 |
| వ్యవసాయ కూలీలకు వినియోగదారుల ధరల సూచీ (శాతం) (2005-2006) | 3.10 |
| పట్టణాల్లోని శ్రామికేతర ఉద్యోగుల్లో వినియోగదారుల ధరల సూచీ (శాతం) (2005-2006) | 5.13 |
| వ్యవసాయ జీఎస్‌డిపి స్థిర, ప్రస్తుతధరల్లో (2004-05) | |
| స్థిర ధరల్లో (లక్షల్లో) | 23,04,100 |
| ప్రస్తుత ధరల్లో (లక్షల్లో) | 44,08,600 |
| వ్యవసాయ జీఎస్‌డిపి సగటు వార్షిక వృద్ధి స్థిరధరల్లో (1993-94) (శాతం) (2000-05) | 4.37 |
| భూమి వినియోగం (2002-03) (శాతం) | |
| మొత్తం భూమిలో వ్యవసాయ యోగ్యమైన భూమి | 57.36 |
| నికరంగా నీటి పారుదలకింద ఉన్న భూమి | 37.59 |
| వర్షపాతం (మి.మి.) | |
| 2004 | 2,351 |
| 2000-04 సగటు | 2,589 |

| | |
|---|---|
| ఆహారధాన్యాల ఉత్పత్తి ('000 టన్నులు) | |
| 2004-05 | 13,123.00 |
| 2000-04 సగటు | 13,386.76 |
| ఆహార ధాన్యాల దిగుబడి (కి/హె) | |
| 2003-04 | 2,016 |
| 2000-03 సగటు | 1,951 |
| ఎరువుల వినియోగం (కి/హె) 2003-04 | 137 |
| వ్యవసాయానికి బ్యాంకు రుణం | |
| మొత్తం బ్యాంకు రుణం 2005 (రు. లక్షల్లో) | 9,69,672 |
| సంకీర్ణ వార్షిక పెరుగుదల రేటులో | |
| వ్యవసాయానికి బ్యాంకు రుణ 2001-2005 (శాతం) | 20.58 |
| ఉత్పత్తి రంగం జిఎస్‌డిపి ప్రస్తుత, స్థిర ధరల్లో (2004-05) (రు. లక్షల్లో) | |
| స్థిర ధరల్లో | 15,44,200 |
| ప్రస్తుత ధరల్లో | 25,48,500 |
| ఉత్పత్తి రంగం జిఎస్‌డిపి సగటు వార్షికవృద్ధి 1993-94 (శాతం) స్థిర ధరల్లో | |
| 2000-01 నుండి 2004-05 | 5.54 |
| జిఎస్‌డిపిలో గుర్తింపుపొందిన, గుర్తింపులేని ఉత్పత్తిరంగాల వాటా 2004-05 (శాతం) | |
| గుర్తింపుపొందిన | 67.74 |
| గుర్తింపుపొందని | 32.26 |
| పారిశ్రామిక పెట్టుబడి (1991-2005) నమోదైన | |
| ఐఇఎం దరఖాస్తుల సంఖ్య | 4,109 |
| ప్రతిపాదించిన ఐఇఎంలవిలువ (రు.కోట్లలో) | 1,64,807 |
| చిన్నతరహా పరిశ్రమలు (2005) | |
| చిన్నతరహా, కుటీర పరిశ్రమల సంఖ్య | 66,989 |
| పనిచేయని కుటీర పరిశ్రమల శాతం | 9.84 |
| పరిశ్రమలకు బ్యాంకు రుణం | |
| పరిశ్రమలకు బ్యాంకురుణాలు (2005)(రు. లక్షల్లో) | 37,428 |
| పరిశ్రమలకు బ్యాంకు రుణం | |
| సంకీర్ణ వార్షిక పెరుగుదల రేటు 2001-05 (శాతం) | -8.17 |
| పరిశ్రమలకు బ్యాంకురుణం వాటా (2005) (శాతం) | 1.62 |
| సేవారంగంలో జిఎస్‌డిపి (2004-05) (లక్షల్లో) | |
| స్థిర ధరల్లో | 54,51,700 |
| ప్రస్తుత ధరల్లో | 98,91,900 |
| సేవారంగంలో సగటు వార్షిక వృద్ధి రేటు స్థిరధరల్లో (శాతం) | |
| 2000-01 నుండి 2004-05 | 8.01 |
| వాణిజ్య, వ్యాపార కేంద్రాలు (2003) | |
| దుకాణాలు | 3.50,562 |
| వాణిజ్య సముదాయాలు | 29,473 |
| సినిమాలు, రంగస్థల వేదికలు, హోటళ్లు | 14,593 |
| వీటిల్లో ఉపాధి పొందుతున్న వారి సంఖ్య | 5,21,419 |

| | |
|---|---|
| నమోదైన సాఫ్ట్‌వేర్ పరిశ్రమలు (2001-02) | 1,345 |
| వ్యక్తిగత బ్యాంకు రుణాలు (2005) (రు. లక్షల్లో) | 8,34,390 |
| మొత్తం రుణాల్లో వ్యక్తిగత రుణాలు (2005) (శాతం) | 36.01 |
| వ్యాపారానికి బ్యాంకు రుణాలు (2005) (రు. లక్షల్లో) | 1,03,696 |
| బ్యాంకు రుణాలలో వ్యాపార రంగానికి అందుతున్న వాటా (2005) (శాతం) | 4.48 |
| రోడ్లసాంద్రత (ప్రతి వెయ్యి చ.కిమీ.లకు రోడ్డుపొడవు) (2002) | 713 |
| రోడ్లు - పొడవు, విస్తృతి (2001) | |
| పొడవు (కిమీ) | 1,92,057 |
| పక్కారోడ్లతో అనుసంధానమైన గ్రామాలు (శాతం) | 89.89 |
| రైల్వేలు (2003-04) | |
| పొడవు (కిమీ) | 5,196 |
| వెయ్యి చ.కిమీ.కు రైలుమార్గం | 18.89 |
| ప్రతి లక్షమందికి మోటర్‌వాహనాల సాంద్రత (2003) | |
| రవాణేతర వాహనాలు | 5,771 |
| మోటరు వాహనాలు | 6,425 |
| ప్రతి లక్షమంది జనాభా కలిగిఉన్న మోటరుసైకిళ్లు, కార్లు (2003) | |
| కార్లు | 401 |
| మోటర్ సైకిళ్లు | 5,119 |
| విద్యుత్తు వినియోగం | |
| విద్యుత్తు సౌకర్యం కలిగిన గృహాలు (2006) (శాతం) | 82.91 |
| తలసరి విద్యుత్తు వినియోగం (కివా. గంట) (1999-2000) | 391 |
| తలసరి సిమెంట్ వినియోగం (కేజీలు) (2004-05) | 97.67 |
| బ్యాంకింగ్ వ్యవస్థ (2004-05) | |
| బ్యాంకు శాఖల సంఖ్య | 5,308 |
| ప్రతి లక్షమందికి బ్యాంకు శాఖలు | 7 |
| పోస్టాఫీసుల సంఖ్య (2004) | 16,197 |
| ప్రతి లక్షమందికి పోస్టాఫీసుల సంఖ్య | 21 |
| టెలిఫోన్లు, సెల్‌ఫోన్లు వినియోగం | |
| జనాభాలో టెలిఫోన్ వినియోగదారుల శాతం (2002) | 5.44 |
| ప్రతి వెయ్యి మందిలో సెల్‌ఫోన్లు కలిగిన వారి సంఖ్య (2005) | 70.50 |
| ఉపాధి కల్పనలో వాటా (2004) (శాతం) | |
| ప్రాథమిక రంగం | 62.46 |
| ద్వితీయ రంగం | 16.21 |
| సేవారంగం | 21.41 |
| మొత్తం శ్రామికులు (2001) | |
| శ్రామికులు | 3.48,65,117 |
| శ్రామికేతరులు | 4,12,46,126 |
| పనిచేసేవారు | 2,90,01,326 |
| అడపాదడపా పనిచేసేవారు | 58,63,791 |

| | |
|---|---|
| పనిచేసేవారి రేటు (2005) (శాతం) | |
| పురుషులు | 56.53 |
| స్త్రీలు | 35.43 |
| మొత్తం స్వయం ఉపాధి సంస్థలు (2005) | 40,23,411 |
| స్వయం ఉపాధి సంస్థల వార్షిక వృద్ధి రేటు (1998-2005) (శాతం) | 4.78 |
| గ్రామీణ స్వయం ఉపాధి సంస్థలు (2005) | 28,95,711 |
| గ్రామీణ స్వయం ఉపాధి సంస్థల వార్షిక వృద్ధి రేటు (1998-2005) (శాతం) | 5.37 |
| పట్టణ స్వయం ఉపాధి సంస్థలు (2005) | 11,27,700 |
| పట్టణ స్వయం ఉపాధి సంస్థల వార్షిక వృద్ధి రేటు (1998-2005) (శాతం) | 3.35 |
| జననాల రేటు (ప్రతి 1000 మందికి) | |
| మొత్తం | 21.30 |
| గ్రామాలలో | 21.70 |
| పట్టణాలలో | 20.10 |
| మరణాల రేటు (ప్రతి 1000 మందికి) | |
| మొత్తం | 8.20 |
| గ్రామాలలో | 9.00 |
| పట్టణాలలో | 5.80 |
| స్త్రీ పురుష నిష్పత్తి - 2001 | 978/1000 |
| సంతాన సాఫల్యరేటు (1998-99) (శాతం) | 2.30 |
| స్త్రీ జీవితకాల వ్యవధి 2001-06 (సంవత్సరాలు) | 63.00 |
| పురుషుల జీవితకాల వ్యవధి 2001-06 (సంవత్సరాలు) | 62.80 |
| పేదరికం 1999-2000 (శాతం) | 15.80 |
| భిన్నవర్గాల మధ్య ఆదాయ వితరణ 2006 (శాతం) | |
| ధనికులు | 8.27 |
| మధ్యతరగతి | 64.60 |
| పేదలు | 27.13 |
| మొత్తం జనాభాల షెడ్యూల్డ్ కులాలు, తెగల నిష్పత్తి 2001 (శాతం) | |
| షెడ్యూల్డ్ కులాలు | 16.20 |
| షెడ్యూల్డ్ తెగలు | 6.60 |
| మతాలవారీగా రాష్ట్రజనాభా 2001 (శాతం) | |
| హిందువులు | 89.01 |
| ముస్లింలు | 9.17 |
| క్రిస్టియన్లు | 1.55 |
| జైనులు | 0.05 |
| బౌద్ధులు | 0.04 |
| సిక్కులు | 0.04 |
| ఇతరులు (మతం ప్రకటించని వారు) | 0.13 |
| అక్షరాస్యత 2001 (శాతం) | |
| మొత్తం | 60.47 |
| స్త్రీలలో | 50.40 |
| పురుషులలో | 70.30 |
| మొత్తం ఖర్చులో విద్యపై పెట్టే ఖర్చు 2005-06 (శాతం) | 8.50 |
| ప్రాథమిక విద్యపై (6-14 సంవత్సరాల వారికి) ప్రభుత్వ తలసరి వ్యయం 2003-04 (రూ) | 3,002 |
| ప్రాథమికస్థాయిలో డ్రాపౌట్స్ 2002 (శాతం) | |
| బాలురు | 57.90 |
| బాలికలు | 61.96 |
| మొత్తం | 59.82 |
| ఉన్నత విద్యలో చేరుతున్నవారు 2003-04 (సంఖ్య) | 7,97,857 |
| వందమంది విద్యార్థులకు ఉపాధ్యాయుల సంఖ్య (2003-04) | |
| ప్రాథమిక విద్య | 3.00 |
| ఉన్నత విద్య | 5.20 |
| విశ్వవిద్యాలయాలు (2003-04) | 23 |
| కళాశాలలు - సీట్లు (2003-04) | |
| ఆర్ట్స్, సైన్స్, కామర్స్ కళాశాలలు | 1330 |
| ఇంజనీరింగ్, సాంకేతిక, ఆర్కిటెక్చర్ కళాశాలలు | 238 |
| ఇంజనీరింగ్ సీట్లు | 97,942 |
| మెడికల్ కళాశాలలు | 53 |
| ఎం.బి.ఎ. సీట్లు | 13,045 |
| ఫార్మసీ సీట్లు | 4,955 |
| మొత్తం వైద్యంలో ఆరోగ్యం, సంక్షేమంపై ఖర్చు 2005-06 (శాతం) | 2.60 |
| ప్రతి వెయ్యికి సంవత్సరంలోపు శిశుమరణాల సంఖ్య (2004) | 59.00 |
| సరాసరి మలేరియా రోగులు (2002-04) | 36,492 |
| క్షయ (టిబి) రోగులు (2003-04) | 1,00,505 |
| డయేరియా బాధితులు (2003) | 16,41,127 |
| ఇంటిలోనే తాగునీరు, మరుగుదొడ్ల సదుపాయం ఉన్నవారి శాతం (2002) | |
| గ్రామీణ ప్రాంతం | 12.60 |
| పట్టణ ప్రాంతం | 51.60 |
| పట్టణాలలో మురికివాడలలో జీవించేజనాభా (2001) | 51,87,493 |
| మొత్తం అటవీ ప్రాంతం (2004) (చ.కిమీ) | 63,814 |
| మొత్తం భూమిలో శాతం | 23.20 |
| బీడు భూములు 2004 (చ.కిమీ) | 51,750 |
| మొత్తం భూమిలో శాతం | 18.80 |
| పోలీసుల సంఖ్య (2004) | 77,850 |
| పెద్ద నేరాలు (2004) | 1,58,756 |
| షెడ్యూల్డ్ కులాలు, తెగలపై జరిగిన నేరాలు (2004) | 3,255 |

మూలం : ఆంధ్రప్రదేశ్ పర్‌ఫార్మెన్స్, ఫ్యాక్ట్స్ అండ్ ఫిగర్స్ - సంపాదకత్వం : లవీష్ భండారి, సుమిత కాలె - పి.ఎచ్.డి.సి.సి.ఐ. ప్రచురణ

**ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ బలాలనూ బలహీనతలనూ మదింపు వేసేటప్పుడు ఎటువంటి రాజకీయార్థిక దృక్పథాన్ని అనుసరించాలో విశ్లేషిస్తున్నారు రాజవరం పార్థసారథి**

# ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ బలాలూ బలహీనతలూ

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ వయసు యాభై సంవత్సరాలే కాని, తెలుగు ప్రజల ఆర్థిక జీవనానికి మాత్రం కొన్ని వేల ఏళ్ల చరిత్ర ఉంది. ఆ చరిత్ర క్రమంలో ఎన్నెన్నో అంశాలు కలిసి, కలగలసిపోయి, విడిపోయి, ఇతర ప్రాంతాలతో ఆదాన ప్రదానాలు జరిగి ఇవాళ్టి ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ ఏర్పడింది. అసలు 'ఏర్పడింది' అనే ఒక స్థిరరూపపు మాట వాడడానికి కూడ వీలులేదు. అది ప్రతిక్షణం మారుతూ, విస్తరిస్తూ, కొన్ని పాత అంశాలు పోగొట్టుకుంటూ, కొన్ని కొత్త అంశాలను సంలీనం చేసుకుంటూ చలనశీలంగా ముందుకు సాగుతున్నది. ఈ క్రమంలో తప్పనిసరిగా ఈ ఆర్థిక వ్యవస్థకు కొన్ని బలాలూ ఉంటాయి, కొన్ని బలహీనతలు ఉంటాయి. ఆ బలాబలాలు మారుతూ కూడ ఉంటాయి.

అసలు బలం అని దేన్ని అనాలి, బలహీనత అని దేన్ని అనాలి అనేది కూడ వ్యాఖ్యాత దృక్పథాన్ని బట్టి మారుతూ ఉంటుంది. ఒకరు బలం అనుకున్నది మరొకరు బలహీనత అనుకోవచ్చు. తమ రక్తమాంసాలు, శక్తియుక్తులు అర్పిస్తూ ఈ ఆర్థిక వ్యవస్థ పురోభివృద్ధికి దోహదం చేస్తున్న అసంఖ్యాక శ్రామిక జనాభాను మానవ-ప్రధాన దృక్పథం ఈ ఆర్థిక వ్యవస్థ బలంగా చూస్తే, అదే శ్రామిక జనంలో అత్యధిక భాగం పెట్టుబడి-ప్రధాన దృక్పథానికి ఊరికే కూచుని తినే భాగంగా, బలహీనతగా కనబడుతుంది. కనుక ఏది బలం, ఏది బలహీనత అనేది ముఖ్యంగా దృక్పథానికి సంబంధించిన విషయం అని గుర్తు ఉంచుకుంటూ ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ బలాలనూ బలహీనతలనూ మదింపు వేసే పనికి ఈ వ్యాసం ప్రయత్నిస్తుంది.

సాధారణంగా పెట్టుబడిదారీ ఆర్థిక శాస్త్ర అధ్యయనాలలో ఒక ఆర్థిక వ్యవస్థ బలాలనూ బలహీనతలనూ అంచనా వేసేటప్పుడు బలాలలో "నైపుణ్యం గల శ్రామికులు, వినియోగ ఆకాంక్షలు, కొనుగోలు శక్తి గల మధ్యతరగతి, సహజ సంపదలు, ముఖ్యంగా బొగ్గు, ఇనుప ఖనిజం, నీరు, సున్నపురాయి, గ్రానైట్ వగైరా"లను, బలహీనతలలో "పెట్టుబడి కొరత, మౌలిక సౌకర్యాల కొరత, అధికార యంత్రాంగపు అలసత్వం, అవినీతి, విదేశీ మారకద్రవ్యంలోటు" లను చర్చించడం ఆనవాయితీ. ఈ మొత్తంలో మనుషుల నైపుణ్యం తోనూ, కొనుగోలు శక్తితోనూ తప్ప మనిషికి సహజంగా ఉండే సృజనాత్మకతతోనూ, శ్రమతోనూ సంబంధం తక్కువ. ఒకవైపు మనిషి మీద శ్రద్ధలేకపోగా, పెట్టుబడిమీద, విదేశీ మారకద్రవ్యం మీద ఉండవలసిన దానికన్న ఎక్కువ శ్రద్ధ ఉంటుంది. అందువల్ల ఈ ప్రమాణాలను పరిగణనలోకి తీసుకుంటూనే వాటి పరిమితులను కూడ గమనంలో ఉంచుకోవాలి.

ఒక ఆర్థిక వ్యవస్థ బలాల గురించి, బలహీనతల గురించి ఎన్ని ప్రమాణాలను చర్చించినా, ప్రధానమైన అంశం ఆ ఆర్థిక వ్యవస్థ చోదకశక్తులు ఏమిటనేది. ఆ దృష్టి నుంచి చూసినప్పుడు ఒక దృక్పథం మనిషిని, మానవ సామూహిక శక్తిని, మానవ సృజనాత్మకతను చోదకశక్తిగా పరిగణిస్తుంది. మరొక దృక్పథం పెట్టుబడిని, లాభాన్ని, వ్యక్తిగత ప్రోత్సాహకాలను చోదకశక్తిగా పరిగణిస్తుంది. అయితే చారిత్రకంగా, వ్యవస్థాగతంగా చూస్తే మనిషి, మానవ సామూహిక శక్తి, మానవ సృజనాత్మకత లేకుండా పెట్టుబడి అనేదే లేదు. పెట్టుబడి లేకపోతే లాభంగాని, వ్యక్తిగత ప్రోత్సాహకాలు గాని లేవు. అందువల్ల బలాలు - బలహీనతల చర్చ తప్పనిసరిగా మనిషి ప్రధానంగా జరగవలసిందే తప్ప పెట్టుబడి ప్రధానంగా జరగవలసింది కాదు.

అట్లాగే ఆర్థిక వ్యవస్థ గురించి చర్చలన్నీ సాధారణంగా అంకెల చుట్టూ, పట్టికల చుట్టూ, శాతాల చుట్టూ, పెరుగుదల రేట్ల చుట్టూ తిరుగుతుంటాయి. ఆర్థిక వ్యవహారాలను చర్చించేటప్పుడు అంకెలూ పట్టికలూ శాతాలూ పెరుగుదల రేట్లూ అత్యవసరమైనవే. అందులో సందేహం లేదు. కాని ఆర్థిక వ్యవస్థ అంటే మానవజాతికి సంబంధించిన దయినప్పుడు, మానవజీవితాన్ని సమగ్రంగా సంపూర్ణంగా వివరించడానికి అంకెలు సరిపోవు. మానవజీవిత ఆకాంక్షలేమిటి, ఆ ఆకాంక్షల సాఫల్యం ఎట్లా జరుగుతున్నది, ఆ ఆకాంక్షలలో ఒక ప్రాణిగా మానవజీవి అత్యవసరంగా పొందవలసిన భౌతిక అవసరాలేమిటి, ఆ పైన నాగరికతా ప్రస్థానంలో మనిషి పెంచుకుంటూ వస్తున్న వినోద, విజ్ఞాన అవసరాలేమిటి, అవి ఎట్లా తీరుతున్నాయి, సంఘజీవులుగా, శ్రమజీవులుగా మానవులు ప్రకృతితో సంఘర్షిస్తూ, తమ శ్రమతో, ఊహలతో ఏ వస్తువులూ సేవలూ తయారు చేస్తున్నారు, ఏ వస్తువులూ సేవలూ వినియోగిస్తున్నారు, భవిష్యత్తరాల కొరకు ఏ సంచితాన్ని

వదిలి పెడుతున్నారు, ఈ పనులన్నీ చేయడానికి ఏ రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక విధానాలు దోహదం చేస్తున్నాయి లేదా అడ్డుకుంటున్నాయి అనే ఆలోచనలన్నీ ఆర్థిక వ్యవస్థ చర్చలో భాగం కావలసినవే. వీటిలో కొన్నిటిని పరిమాణాత్మకంగా అంకెలలో కుదించి చెప్పవచ్చు, కొన్నిటిని అంకెలలో చెప్పలేం, కేవలం గుణాత్మకంగా మాత్రమే చెప్పగలం. అందువల్ల అంకెలకు ఉన్న పరిమితిని గుర్తిస్తూనే వాడక తప్పని చోట్ల అంకెలు వాడుతూ ఈ విశ్లేషణ సాగించవలసి ఉంటుంది.

గోదావరి, కృష్ణ, నాగావళి, వంశధార, పెన్న నదులతోపాటు లెక్కలేనన్ని చిన్నా పెద్దా జీవధారలతో, విశాలమైన, సారవంతమైన భూములతో, అపారమైన అటవీ సంపదతో, సుదీర్ఘమైన సముద్రతీరంతో విలసిల్లిన తెలుగు ప్రజల ప్రాంతం రెండున్నరవేల ఏళ్లకు పైగా స్థిర వ్యవసాయాన్ని సాగిస్తున్నది. ఆ విధంగా తెలుగు ప్రజల ఆర్థిక జీవనంలో వ్యవసాయం ప్రధానమైన భాగంగా ఉంటూ వస్తున్నది. తెలుగు ప్రజల నివాసప్రాంతాలలో లేని ఖనిజం లేదు గనుక, ఇనుము వాడకం గురించి కనీసం రెండువేల ఏళ్లుగా తెలుసుననడానికి ఆధారాలున్నాయి గనుక, దాదాపు ప్రతి చేతివృత్తి నైపుణ్యానికీ పరిశ్రమగా అభివృద్ధి చెందగల అవకాశం ఉంది గనుక, ఆధునిక అర్థంలో కాకపోయినా, పరిశ్రమలు కూడ తెలుగువారి ఆర్థిక జీవనంలో కొన్ని వందల ఏళ్లుగా ప్రధాన పాత్ర పోషిస్తున్నాయనవచ్చు. శాతవాహనుల కాలం నుంచే విస్తృతమైన పాలనావ్యవస్థ ఉన్నదనడానికి ఆధారాలున్నందువల్ల, వ్యక్తిగత సేవలను ఆర్థికేతర కట్టుబాట్లు నిర్ణయించినప్పటికీ, ఆ వ్యక్తిగత సేవా వృత్తులకు కూడ వార్షిక పంట దిగుబడిలో పాలు ఇచ్చే సంప్రదాయం ఉన్నందువల్ల ఆర్థిక జీవనంలో సేవారంగం పాత్ర కూడ గణనీయంగా ఉన్నదని చెప్పవచ్చు. అంటే ఆధునిక ఆర్థిక వ్యవస్థలలో ఉన్నట్టుగానే వ్యవసాయ, పారిశ్రామిక, సేవారంగాలు తెలుగువారి ఆర్థిక జీవనంలో వేల ఏళ్లుగా కొనసాగుతూనే ఉన్నాయి.

తెలుగు ప్రజల ఆర్థిక వ్యవస్థ కొన్ని వేల ఏళ్లుగా ఈ ప్రాంతంలోని ప్రకృతి వనరులనూ మానవ నిర్మిత సాధనాలనూ వాడుకుంటూ, కొత్త వనరులనూ సాధనాలనూ కల్పించుకుంటూ విస్తరిస్తున్నది. ఇటు ఆదిలాబాదు నుంచి అటు చిత్తూరు వరకు, ఇటు మెదక్ నుంచి అటు శ్రీకాకుళం వరకు చరిత్రలో ఎన్నో పాలనా ప్రాంతాల కింద కొనసాగినప్పటికీ, స్వతంత్రంగానూ, ఆదాన ప్రదానాలతోనూ తెలుగు ప్రజలు తమవైన వనరులేవో గుర్తించుకున్నారు. తమవైన సాధనాలను సృష్టించుకుని, అరువు తెచ్చుకుని మెరుగుపెట్టుకుని వాడుకుంటున్నారు. ఆ వనరులూ సాధనాలూ అన్నీ కలిసి ఒకే పాలనా ప్రాంతంగా మారిన ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థగా 1956లో తయారయ్యాయి. ఈ యాభై సంవత్సరాల ఆర్థిక వ్యవస్థ అభివృద్ధిని మదింపువేసి దీని బలాలు ఏమిటో, బలహీనతలు ఏమిటో నిగ్గుదేల్చాలంటే గత శతాబ్దాలలో సాగిన అభివృద్ధిని, దాని కొనసాగింపును, వారసత్వాన్ని కూడ పరిగణనలోకి తీసుకోకుండా సాధ్యం కాదు. ఆ రకమైన విస్తారమైన చర్చకు ఇక్కడ అవకాశం లేదుగాని 1956-2006 ల మధ్య ఈ ఆర్థిక వ్యవస్థ ఏమి ఆశించిందో, ఏ మార్గాలలో పయనించిందో, ఏమి సాధించిందో, ఏమి సాధించలేకపోయిందో, ఈ పరిణామాలకు పునాది అయిన బలాలు, బలహీనతలు ఏమిటో చర్చించడం ఈ వ్యాస లక్ష్యం.

నిజంగానే ఒకవైపు నుంచి చూస్తే ఈ ఆర్థిక వ్యవస్థ చాల సాధించినట్టు కనబడుతుంది. ఒక ప్రాంతపు ఆర్థిక వ్యవస్థ బలాన్ని అంచనా కట్టడానికి సాధారణంగా వినియోగించే స్థూల రాష్ట్ర ఉత్పత్తి అనే ప్రమాణం చూస్తే, ఆయా సంవత్సరాల ధరల ప్రకారం 1956లో రు. 857 కోట్లు (స్టాటిస్టికల్ ఆబ్‌స్ట్రాక్ట్, 1960-61) ఉన్నదల్లా, 2006 నాటికి రు. 2,60,734 (సోషియో ఎకనమిక్ సర్వే, 2006-07) పెరిగింది. నిజానికి ఈ అంకెలు ఆయా సంవత్సరాల ధరల ప్రకారం గనుక వీటిని పోల్చిచూడడం సరయినది కాదు. కాని తులనాత్మక పరిశీలనకు అవసరమైన స్థిర ధరల విషయంలో ప్రభుత్వ అర్థ గణాంక శాఖ ఎప్పటికప్పుడు పునాది సంవత్సర ప్రమాణాన్ని మారుస్తున్నది గనుక ఆ స్థిర ధరలు అనే ప్రమాణం కూడ ఉపయోగకరం కాదు. ఆయా సంవత్సరాల ధరలను బట్టి రూపొందిన అంకెలలో నుంచి ద్రవ్యోల్బణ ప్రభావాన్ని తొలగించి పోల్చిచూడడం సరయిన పద్ధతి కాని, ఆ పని చేయడానికి అవసరమైన వివరాలన్నీ లభ్యం కావు. కాబట్టి ఉన్న అంకెల పరిమితిని దృష్టిలో పెట్టుకుంటూనే స్థూలంగా చూస్తే స్థూల రాష్ట్ర ఉత్పత్తి గత యాభై సంవత్సరాలలో 304 రెట్లు పెరిగిందని కనబడుతుంది. ఈ కాలంలో జనాభా పెరుగుదల 3.12 కోట్ల నుంచి 7.62 కోట్లకు (2001 జనగణన) పెరిగింది. అంటే రెట్టింపు అయింది.

అలాగే మొత్తం తిండి గింజల ఉత్పత్తి 1956-57లో 58.92 లక్షల టన్నులు ఉన్నదల్లా 2004-05కు 133.94 టన్నులకు పెరిగింది. ఇదేకాలంలో విడిగా వరి ఉత్పత్తి 34.07 టన్నుల నుంచి 96.01 టన్నులకు, మొత్తం పప్పుధాన్యాల ఉత్పత్తి 2.76 టన్నుల నుంచి 10.17 టన్నులకు పెరిగింది. మరి స్థూల రాష్ట్ర ఉత్పత్తిలో 304 రెట్లు, ఆహార ధాన్యాల ఉత్పత్తిలో 2.27 రెట్లు, వరి ఉత్పత్తిలో 2.81 రెట్లు, పప్పుధాన్యాల ఉత్పత్తిలో 3.68 రెట్లు పెరుగుదల ఉండగా, ఆ ఉత్పత్తిని అనుభవించవలసిన జన సంఖ్యలో 2.44 రెట్ల పెరుగుదల మాత్రమే ఉన్నప్పటికీ, దారిద్ర్యం, నిరుద్యోగం, నిరక్షరాస్యత, అనారోగ్యం, సౌకర్యాలకొరత, సామాజిక అణచివేత వంటి ఏ ప్రమాణం తీసుకున్నా ఈ ఆర్థికవ్యవస్థ అంకెలలో సాధించిన అద్భుత విజయాలేవీ ఈ ప్రమాణాలను మార్చలేకపోయాయని తెలుస్తుంది.

నిజానికి ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థకు చాల శక్తి ఉంది. అది చాల బలసంపన్నమైనది. ఆ బలాలలో ప్రజలు, వనరులు (భూమి, నీరు, ఖనిజాలు, అటవీ ఉత్పత్తులు, సముద్ర సంపద, మౌలిక సౌకర్యాలు, విద్యుత్తు, పరిశ్రమలు, రవాణా సౌకర్యాలు), ఇప్పటికి రూపొంది ఉన్న వ్యవసాయ, పారిశ్రామిక, సేవారంగాల పునాది కీలకమైనవి. వాటిలో ఏ ఒక్కదాన్ని గురించి అయినా, పైపైన చూసినా ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ ఇప్పుడు సాధించినదానికన్న ఎన్నో రెట్లు ఎక్కువ సాధించి ఉండగలిగేదని అర్థమవుతుంది.

మొట్టమొదట ప్రజల విషయమే చూస్తే, 2001 జనగణన ప్రకారం ఏడుకోట్ల అరవైరెండు లక్షలుగా ఉన్న రాష్ట్ర జనాభాలో, రెండుకోట్ల తొంభై లక్షల మంది మాత్రమే ప్రధాన శ్రామికులు ("మెయిన్ వర్కర్స్ - పనిచేసేవారు")గా గుర్తింపు పొందగా, నాలుగు కోట్ల పదమూడు లక్షల మంది "శ్రమచేయనివారు" (నాన్‌వర్కర్స్) గా లెక్కకువచ్చారు. అధికారిక గణాంకాల ప్రకారమే ఆంధ్రప్రదేశ్ జనాభాలో

38.1 శాతం మంది మాత్రమే "పనిచేసేవారు", 7.7 శాతంమంది "అడపాదడపా పనిచేసేవారు", 54.2 శాతంమంది "పనిచేయనివారు" ఉన్నారని తేలుతుంది. ఈ మాటలలో, లెక్కలలో ఉన్న మౌలిక అసంబద్ధతను అలా ఉంచి, అసంఘటిత రంగంలో పనిచేసే చాల శ్రామిక సమూహాలు, మొత్తంగా ఇళ్లలో పనిచేసే స్త్రీలు ఈ నిర్వచనాలలోకి సరిగా రారనేది ఒక వాస్తవం. అందువల్ల ఈ గణాంకాలను చాల జాగ్రత్తగా పరిగణనలోకి తీసుకోవలసి ఉన్నది.

జనాభాలో సగానికన్న చాల తక్కువమంది మాత్రమే పనిచేసేవారు ఉండగా స్థూల రాష్ట్ర ఉత్పత్తి రెండు లక్షల అరవై వేల కోట్ల రూపాయలుగా ఉన్నదంటే, పనిచేయగలిగిన వారందరికీ పని కల్పించగలిగితే రాష్ట్ర స్థూల ఉత్పత్తి మరెంతగా పెరగగలదని కూడ ఒకవైపు నుంచి వాదించవచ్చును. ఇక జనాభాను వయసుల రీత్యా వర్గీకరించి చూస్తే, రాష్ట్రంలో పని చేయగల జనాభా (అంటే 19-59 మధ్య వయస్కుల) సంఖ్య మూడు కోట్ల ఎనభై మూడు లక్షలుగా, అంటే సరిగ్గా సగంగా ఉన్నది. అంటే ప్రభుత్వ గణాంకాలను యథాతథంగా అంగీకరించినా కనీసం ఒక కోటి మంది పనిచేయగలవాళ్లకు పనిలేని స్థితి ఉందని తేలుతుంది. వీళ్లందరికీ పని చూపించగలిగినా, మిగిలిన జనాభాను (పసిపిల్లలను, చదువుకుంటూ ఉండవలసినవారిని, వృద్ధులను) పోషించడానికి తగినంత ఉత్పత్తి చేయవచ్చు. కాని ప్రస్తుతం కొనసాగుతున్న రాజకీయార్థిక విధానాల వల్ల పనిచేయనక్కరలేని వయసులవాళ్లు పని చేయవలసి రావడం, పనిచేసే వయసులోని వారికి పని దొరకకపోవడం కొనసాగుతున్నాయి. ఒకవైపు నిరుద్యోగం, అల్పోద్యోగం, దారిద్ర్యం కొనసాగుతుండగా, పిడికెడు జనాభాకు మాత్రం ఇబ్బడిముబ్బడిగా సంపదలు పెరుగుతున్నాయి.

ప్రభుత్వ గణాంకాల ప్రకారమే రాష్ట్రంలో ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజిలలో నమోదు చేయించుకుంటున్న నిరుద్యోగుల సంఖ్య సాలీనా మూడు - మూడున్నర లక్షలు ఉంటుండగా ఉద్యోగ కల్పన ఏ సంవత్సరం కూడ ఇరవై వేలకు మించడం లేదు. అంటే రాష్ట్రంలో నిరుద్యోగ సైన్యంలోకి ఏటా మూడు లక్షలమంది చేరుతున్నారు. వీరిలో సగం మందికన్న ఎక్కువకు చిరుద్యోగాలు గాని, స్వయం ఉపాధి అవకాశాలు గాని దొరకడం లేదని నిస్సందేహంగా చెప్పవచ్చును. ఇప్పటివరకు ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజిలలో నమోదు చేసుకుని ఉద్యోగాలు పొందని వారి సంఖ్య ఇరవై ఐదు లక్షలు దాటింది. మరొకవైపు సంఘటిత రంగంలోని ఉద్యోగుల సంఖ్య నానాటికీ తగ్గిపోతున్నది. ఈ అంకెలన్నీ రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో గొప్ప బలంగా ఉన్న మానవశక్తినీ, ఆ మానవశక్తిని ఉపయోగించుకోలేకపోతున్న బలహీనతనూ ప్రకటిస్తాయి. ఆ బలహీనత వల్ల అపారమైన మానవశక్తి వ్యర్థం అవుతుండడం మాత్రమే గాక, ఆ మానవశక్తి సృజనాత్మకత వికసించడానికి వీలులేని స్థితి ఏర్పడుతోంది.

ఇక సహజ వనరుల విషయానికి వస్తే, ఏ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికైనా సహజవనరులు బలంగా, నిజమైన పునాదిగా ఉంటాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఆ వనరులు పుష్కలంగా, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను ఎన్నోరెట్లు ఇనుమడింపజేయగలవిగా ఉన్నాయి. ఆరుకోట్ల ఎనభై లక్షల ఎకరాల రాష్ట్ర వైశాల్యంలో, వ్యవసాయానికి వీలయిన సారవంతమైన భూమి కనీసం నాలుగుకోట్ల ఎకరాలు ఉంటుంది. రెండు పెద్ద జీవనదులతో, దాదాపు నలభై చిన్న నదులు, సెలయేళ్లతో రాష్ట్రంలో అపారమైన జలవనరులున్నాయి. మొత్తం రాష్ట్రం వాడుకోగలిగిన జలవనరులు నాలుగువేల శతకోటి ఘనపుటడుగులు (టి.ఎం.సి.) ఉంటాయని అంచనా. వెయ్యికిలోమీటర్ల సముద్రతీరంలో విస్తారమైన సముద్ర సంపదను, మత్స్య సంపదను వాడుకునే అవకాశం ఉంది. పర్యావరణ సంరక్షణ ప్రమాణాల ప్రకారం రెండు కోట్ల ఇరవై లక్షల ఎకరాల అడవి ఉండవలసి ఉండగా ప్రస్తుతం కోటిన్నర ఎకరాల మేర అడవి ఉంది. రాష్ట్రంలో లేని ఖనిజం లేదు. అన్ని జిల్లాలలోనూ కొద్దోగొప్పో ఖనిజ నిలువలున్నాయి. ప్రధానమైన ఖనిజ సంపద చెప్పాలంటే వెయ్యికోట్ల టన్నుల బొగ్గు, పదమూడు వందల కోట్ల టన్నుల సున్నపురాయి. ఆరువందల కోట్ల టన్నుల రాగి ఖనిజం, అరవై లక్షల టన్నుల బంగారం ఖనిజం, చెప్పుకోదగిన స్థాయిలో గ్రానైట్, బాక్సైట్, బెరైటిన్ వంటి ఖనిజాలున్నాయి. కృష్ణా-గోదావరి బేసిన్ సముద్రజలాలలో విస్తారమైన చమురు, సహజవాయు నిక్షేపాలున్నాయి. నిజానికి ఈ అర్థంలో చూసినప్పుడు ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థకు ఉన్న బలాలు అసాధారణమైనవి. ఈ సహజ సంపదను ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి కోసం వాడుకుని, ప్రజోపయోగం కోసం వినియోగించగలిగితే ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ అత్యున్నత స్థాయిలో ఉంటుంది, ప్రజల జీవన ప్రమాణాలు ఎన్నో రెట్లు పెరుగుతాయి.

ఈ సహజ వనరులతోపాటు ఇంతకాలంగా ఎన్నెన్నో తరాల శ్రమజీవులు ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థకు అందించిన, కొత్తగా రూపొందించిన వనరులు ఎన్నో ఉన్నాయి. అవి నీటిపారుదల సౌకర్యాలు, విస్తృతమైన విద్యుత్తు ఉత్పత్తి, సరఫరా, పంపిణీ వ్యవస్థ, రైలు, రోడ్డు రవాణా వ్యవస్థలు, సమాచార సంబంధాల వ్యవస్థలు, మౌలిక సౌకర్యాలు, విద్యా వైద్య ఆరోగ్య నిర్మాణాలు, వ్యవసాయ, పారిశ్రామిక, సేవారంగాల సౌకర్యాల రూపంలో ఉన్నాయి. అవన్నీ కూడ ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ బలాలుగానే లెక్కించవలసి ఉంటుంది. ఈ అన్ని రంగాలలోనూ గత యాభై సంవత్సరాలలో పరిమాణాత్మక అభివృద్ధి ఎంతగానో జరిగింది. దాదాపు ప్రతిరంగంలోనూ అంకెల్లో చూస్తే రెట్టింపు నుంచి కొన్ని వందల రెట్ల వరకూ పెరుగుదల కనబడుతుంది. ఆ పెరుగుదలను గుణాత్మకంగా, స్వభావరీత్యా చూసినప్పుడు మాత్రం ఆ పెరుగుదల ప్రజాజీవితంలో మెరుగుదలను సాధించలేకపోయిందనీ, కొన్ని సందర్భాలలో తరుగుదలకు కూడ కారణమయిందనీ కనబడుతుంది.

ఈ బలాలను వెన్నంటే ఆయారంగాలకు సంబంధించిన బలహీనతలు కూడఉన్నాయి. రాష్ట్రంమొత్తం విస్తీర్ణంలో కనీసం మూడో వంతు అడవులకింద వదలిపెట్టినా, ఐదోవంతో ఆరోవంతో, సాగుకు లాయకుకాని భూమికిందా, వ్యవసాయేతర అవసరాలకోసమూ వదిలి పెట్టినా, నికరంగా నాలుగుకోట్ల ఎకరాలయినా సాగులోకితేవచ్చు. కాని, అస్తవ్యస్తమైన ప్రభుత్వ విధానాలవల్ల, కొనసాగుతున్న అసమాన భూ సంబంధాలవల్ల, ఇప్పటికీ రాష్ట్రంలో నికరంగా సాగులోఉన్న భూమి రెండు కోట్ల ఎనభైలక్షల ఎకరాలకు మించలేదు. అంటే ఇంకా కోటిన్నర ఎకరాల భూమి వ్యవసాయయోగ్యమై కూడ కేవలం సామాజిక ఆర్థిక

వ్యవస్థలోని బలహీనతలవల్ల సాగులోకిరావడంలేదు. ఆ మేరకు వ్యవసాయోత్పత్తి తగ్గిపోయి ఆర్థికవ్యవస్థ బలహీనతగా మారుతున్నదన్న మాట.

ఇక సాగులో ఉన్న భూమిలో కూడ ఈ యాభై సంవత్సరాలలో కేవలం నలభై శాతానికి మాత్రమే నీటిపారుదల సౌకర్యాలు కల్పించడం జరిగింది. మరొకవైపు రాష్ట్రంలో అందుబాటులో ఉన్న జలాలు (నదీ జలాల వాటా, భూగర్భ జలం కలిసి) నాలుగువేల శతకోటి ఘనపుటడుగులు కాగా, అందులో కేవలం సగానికన్న కొద్ది ఎక్కువగా మాత్రమే వినియోగించడం జరుగుతున్నది. యాభై సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ పాలకులు కనీసం రాష్ట్రంలోని జలసంపదనంతా వినియోగంలోకి తెచ్చే పని కూడ చేయలేకపోయారు.

వ్యవసాయాధార పరిశ్రమలను స్థాపించగల అవకాశాలు రాష్ట్రంలో ఇబ్బడిముబ్బడిగా ఉండగా, ఆ పరిశ్రమలు ఇతోధికంగా ఉపాధికల్పన చేసే అవకాశం ఉండగా పాలకవిధానాలు ఆ దిశగా తొలిరోజుల్లో చేసిన ప్రయత్నాలను కూడ ఆ తర్వాత విరమించారు.

అట్లాగే అటవీ సంపదను పరిరక్షించడం, వ్యవసాయ, పారిశ్రామిక అవసరాల కోసం వినియోగించిన మేర అడవులను పునరుద్ధరించి పర్యావరణాన్ని కాపాడడం అనే ఆలోచనలే లేకపోవడం వల్ల, ఉన్న అడవులు కూడ ధ్వంసమైపోయాయి, కొత్త అడవులు ఏర్పడలేదు.

ఖనిజ విలువలు ఉపయోగించి ప్రభుత్వ రంగంలో పరిశ్రమలు స్థాపించి, ఉద్యోగ కల్పనకు, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికీ ఉపయోగించ వలసి ఉండగా అసలు అటువైపుగానే ఆలోచించకుండా ఖనిజాలను సంపన్నులకు, బడాపారిశ్రామికవేత్తలకు, బహుళజాతి సంస్థలకు అప్పనంగా అందించడానికే పాలకులు ప్రయత్నిస్తూ వచ్చారు. విధానాల రూపకల్పన చేశారు.

రాష్ట్ర అభివృద్ధికి అత్యవసరమైన, ఆర్థిక వ్యవస్థ బలాలుగా లెక్కించదగిన విద్యుత్, రవాణా, విద్యా, వైద్య, మౌలిక సౌకర్యాల కల్పన గణనీయంగా జరిగింది కాని, అక్కడ కూడ ప్రజావసరాలను తీర్చడం అనే ప్రయోజనం కన్న పారిశ్రామిక సరుకుల ఉత్పత్తి దార్లకు చౌక ముడిసరుకులు కల్పించడం, మార్కెట్‌ను విస్తరించడం అనే ప్రయోజనాలదే పైచేయి అయింది.

ఒక్కమాటలో చెప్పాలంటే అసంఖ్యాకమైన బలాలు ఉన్న ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ ఆ బలాలు వేటినీ తన అభివృద్ధికిగాని, సామాజిక వినియోగానికి గాని ఉపయోగ పెట్టుకోలేక పోయింది. ఆ బలాలు వినియోగంలోకి వచ్చిన సందర్భాలలో కూడ గ్రామీణ, పట్టణ సంపన్న వర్గాలకు, అత్యల్ప సంఖ్యాకులైన పెత్తందార్లకు మాత్రమే పనికి వచ్చాయి, వారి సంపద, విలాసాలు పెరగడానికే ఉపయోగపడ్డాయి గాని, ప్రజలందరికీ వినియోగంలోకి రాలేదు.

అందువల్ల అపారమైన బలాలు ఉన్న ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థను గత ఐదు దశాబ్దాలుగా ఏ బలహీనతలు వెనక్కి లాగుతున్నాయో, అద్భుతమైన సంపద ఉన్న ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో పెద్ద ఎత్తున పేదరికం, నిరుద్యోగం, అవిద్య, అనారోగ్యం, అసమానతలు మొదలయిన బలహీనతలు ఎందుకు ఉన్నాయో చూడవలసి ఉంది. ఆ బలహీనతలకు సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో చారిత్రకమైన, వ్యవస్థాపరమైన కారణాలు న్నాయి. పాలక విధానాలు ఆ బలహీనతలను పెంచి పోషిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ ఏర్పడిన నాటినుంచి, భారత బడా పెట్టుబడిదారుల, కేంద్ర ప్రభుత్వ విధానాల రూపంలోనూ, 1970లలో ప్రారంభమై ఇటీవల విపరీతంగా పెరిగిపోయిన బహుళజాతి సంస్థల, అంతర్జాతీయ ద్రవ్య సంస్థల ప్రమేయం రూపంలోనూ సాగుతున్న బాహ్యశక్తుల ప్రభావం ఉంది.

ఒక ఆర్థిక వ్యవస్థ తన బలాలను వాడుకోవడం యదాలాపంగా, అసంకల్పితంగా జరగదు. ఆ ఆర్థిక వ్యవస్థలో ఎన్ని బలాలు ఉన్నప్పటికీ ఆ బలాలలో వేటిని ఎప్పుడు ఎంతకాలం ఎవరి ప్రయోజనాల కోసం వాడుకోవాలనే విధాన నిర్ణయాలను కొనసాగుతున్న సామాజిక రాజకీయార్థిక శక్తులు నిర్ధారిస్తాయి. అందువల్ల గొప్ప బలంగా కనబడిన ఒక అంశం ఆ విధాన నిర్ణయం వల్ల బలహీనతగా మారిపోతుంది. ఉదాహరణకు, సాగు చెయ్యదగిన సారవంతమైన భూమి, పనిలేని, పూర్తి పనిలేని శ్రామిక జనాభా అనే రెండు బలాలు ఉన్న ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలోని రాజకీయార్థిక నిర్ణయాలు ఆ రెంటినీ కలపకుండా పెట్టి, వాటిని బలహీనతలుగా మారుస్తున్నాయి. ఆ సాగు చెయ్యదగిన భూమిని సాగులోకి తెచ్చి, భూ సంబంధాలలో కొనసాగుతున్న తీవ్రమైన అసమానతలను రూపు మాపి, వ్యవసాయంతో సంబంధం లేకుండా భూస్వాములుగా ఉన్న వారి చేతిలో ఉన్న భూములను స్వాధీనం చేసుకుని భూమిలేని నిరుపేద శ్రామికుల చేతికి అందించగలిగితే అది ఆర్థిక వ్యవస్థలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకురాగలుగుతుంది. బలహీనతగా కనబడుతున్నదల్లా గొప్ప బలంగా మారి శ్రామికులకు పని దొరికి, కొత్త భూమి సాగులోకి వచ్చి, వ్యవసాయోత్పత్తి పెరుగుదల, మొత్తంగా ఆర్థిక వ్యవస్థలో మిగులు పెరుగుదల వంటి పరిణామాలు సంభవిస్తాయి.

అట్లాగే అవిద్య అనే బలహీనతను, నిరుద్యోగం అనే బలహీనతను రూపుమాపడానికి విద్యా సౌకర్యాలను పెద్ద ఎత్తున కల్పించే పనికి ప్రభుత్వం పూనుకుంటే అటు నిరుద్యోగులకు ఉద్యోగ కల్పన సాధ్యమవుతుంది, ఇటు నిరక్షరాస్యత, పై తరగతులకు వస్తున్న కొద్దీ పెరుగుతున్న డ్రాపవుట్ రేటు వంటివి తగ్గుతాయి.

ఆర్థిక వ్యవస్థలో మెరుగుదల సాధించలేకపోవడానికి నిధుల కొరతే కారణమని పాలకవర్గాలు, ప్రభుత్వాలు, ప్రభుత్వానుకూల మేధావులు తరచు చెపుతుంటారు. కాని ఇవాళ ఉన్న బలాల స్వభావాన్ని మార్చి వాటిని ప్రజోపయోగం దిశలో తీర్చిదిద్దడం, బలహీనతలను బలాలుగా మార్చడం నిజానికి డబ్బు కొరతకు సంబంధించిన విషయాలు కావు. అవి సామాజిక రాజకీయార్థిక నిర్ణయాలకు సంబంధించిన సమస్యలు. ప్రస్తుతం ఉన్న సామాజిక రాజకీయార్థిక వ్యవస్థను యథాతథంగా ఉంచి, ఇప్పుడు ప్రయోజనాలు పొందుతున్న వాళ్ల ప్రయోజనాలనే పరిరక్షించాలంటే ఒక రకమైన నిర్ణయాలు అవసరమవుతాయి, వ్యవస్థను మార్చి, ఇప్పటిదాకా ప్రయోజనాలు పొందలేకపోయిన, నిరాదరణకు గురయిన వారి ప్రయోజనాలు తీర్చాలంటే, అసలు సామాజిక రాజకీయార్థిక వ్యవస్థలో సమానత సాధించాలంటే మరొక రకమైన నిర్ణయాలు అవసరమవుతాయి. ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో ప్రస్తుతం ఉన్న బలాలు – బలహీనతల విషయంలో, వాటిలో వస్తున్న, రావలసిన మార్పుల విషయంలో కూడ దృష్టిలో పెట్టుకోవలసిన దృక్పథం ఇదే. ◆

**వ్యవసాయరంగం మన దేశంలో సగానికిపైగా జనాభాకు నేటికీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఉపాధినిస్తోందని, అటువంటి వ్యవసాయ రంగాన్ని సరైన విధానాలతో ఆదుకోవాలని అంటున్నారు మచ్చ శ్రద్ధానందం**

# వ్యవసాయం - సహకార రంగ పరపతి

అనాది నుండి భారతదేశ ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయరంగం ప్రముఖ పాత్ర పోషిస్తోంది. బ్రిటిష్‌వారు భారతదేశాన్ని పాలిస్తున్న సమయంలో వారు అనుసరించిన ప్రతికూల వ్యవసాయ విధానాల వల్ల దేశ ఆర్థిక వ్యవస్థకు జీవనాడిగా ఉన్న వ్యవసాయరంగ పరిస్థితి నేటికీ దయనీయంగా ఉంది.

అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక వ్యవస్థల (అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్) వ్యవసాయరంగ ప్రగతితో పోలిస్తే మనదేశ వ్యవసాయరంగ ప్రగతి అంతంత మాత్రంగానే ఉంది. 1901లో వ్యవసాయరంగంపై ఆధారపడిన జనాభా 72.8 శాతం ఉండగా అది స్వాతంత్ర్యం వచ్చే నాటికి దరిదాపుగా సమానంగానే (72.1 శాతం) ఉన్నది. ప్రస్తుతం దీనిపై ఆధారపడి జీవిస్తున్న జనాభా 56.7 శాతం అనగా నేటికీ సగానికి పైగా జనాభా వ్యవసాయ రంగంపై ఆధారపడి జీవిస్తున్నారు.

వ్యవసాయేతర రంగాల అభివృద్ధి నామ మాత్రంగా ఉన్న మనదేశంలో వ్యవసాయరంగం అనేక మందికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో జీవనోపాధిని కల్పిస్తూ, పారిశ్రామిక రంగాభివృద్ధికి ఊతం ఇస్తూ, విదేశీ మారకద్రవ్యాన్ని ఆర్జిస్తూ, ఇలా ఆర్థిక వ్యవస్థలో బహుముఖ పాత్రను పోషిస్తోంది.

భారతదేశంలో రైతులు సమయానికి పెట్టుబడి లభించక, అటు అభిలషనీయమైన ఉత్పత్తిని సాధించలేక, ఇటు పండించిన పంట కోసం చేసిన అప్పులపై వడ్డీలు చెల్లించలేక అనుభవిస్తున్న బాధలు అన్నీ, ఇన్నీ కావని ఇటీవల కాలంలో కేంద్ర వ్యవసాయ శాఖ నిర్వహించిన సర్వేలో వెల్లడైంది. అసంఘటితమైన వ్యవసాయరంగాన్ని నడిపించడానికి రైతులు ఎరువులు, విత్తనాలు, పంపుసెట్లు కొనుక్కోవడానికి, భూమిని కొనుగోలు చేయడానికి, అనుత్పాదక అంశాలైన తమ జీవన అవసరాలను తీర్చుకోవడానికి స్వల్ప, మధ్య, దీర్ఘకాలిక రుణాలు అవసరమవుతున్నాయి.

దేశంలో రైతులు సంస్థాపరంగా, సంస్థాపరం కాని మార్గాల ద్వారా తమకు కావాల్సిన రుణ సౌకర్యాన్ని పొందుతున్నారు. స్వాతంత్ర్యాని కంటే ముందు దేశంలో రైతులు వడ్డీ వ్యాపారస్తులపై ఎక్కువగా ఆధారపడేవారు. 1951లో గ్రామీణ పరపతిలో వడ్డీ వ్యాపారస్తుల వాటా 71.6 శాతం ఉండగా అది 1981 నాటికి 16.9 శాతానికి తగ్గి 1991 నాటికి స్వల్పంగా 17.6 శాతానికి పెరిగింది.

స్వాతంత్ర్యానంతరం 1969లో 14 బ్యాంకులు, 1980లో 6 బ్యాంకులు జాతీయికరణ, 1975 అక్టోబర్ 2న ప్రాంతీయ గ్రామీణ బ్యాంకుల స్థాపనల తర్వాత రైతులు, వడ్డీ వ్యాపారస్తుల, కమిషన్ ఏజెంట్ల, భూస్వాములపై రుణం కోసం ఆధారపడే పరిస్థితి తగ్గుముఖం పట్టింది. వారు వడ్డీ వ్యాపారస్తుల మోసాలనుండి కొంతమేరకు విముక్తి చెందినారని చెప్పవచ్చు.

ఎనిమదవ ప్రణాళిక (1992-97) మొదటి సంవత్సర కాలంలో (1992-93) వ్యవసాయరంగానికి వివిధ ఆర్థిక సంస్థల ద్వారా అందించిన రుణాలు 15,109 కోట్లు కాగా దీనిలో సహకారరంగ రుణాలు 9,378 కోట్లు (61.8 శాతం). ఈ ప్రణాళికాంతానికి (1996-97) నాటికి అందించిన స్థూల వ్యవస్థాపర రుణాలలో 26,411 కోట్లలో సహకారరంగ రుణాలు 11,944 కోట్లు (45.2 శాతం)కి తగ్గింది. 1999-2000 నాటికి స్థూల వ్యవసాయ పరపతిలో వీటి వాటా 41 శాతానికి తగ్గింది.

## సహకార రంగం పరపతి

రైతులను రుణగ్రస్తత నుండి విముక్తి చేసి, వారికి మిత వ్యయాన్ని అలవాటు చేసి, రైతులకు బ్యాంకులకు ప్రత్యక్ష సంబంధాలను ఏర్పాటు చేయాలనే ఉద్దేశ్యంతో 1904లో సహకార సంఘాలు ఆవిర్భవించాయి. తర్వాత ఇదే సహకార పరపతి ఉద్యమంగా మొదలైంది. ఈ విధంగా వ్యవసాయక భారతదేశంలో సహకార పరపతి విధానం పురాతనమైనదిగా చెప్పవచ్చు.

వ్యవసాయ రంగానికి సహకార బ్యాంకుల నుండి అందించబడే రుణాల పరిమాణం చాలా వరకు తగ్గింది. 1983లో వ్యవసాయ రంగానికి సహకార బ్యాంకుల ద్వారా అందించిన రుణాల శాతం 55.28 ఉండగా 2000 నాటికి 37.02 శాతానికి తగ్గింది.

**పట్టిక 1**
**31 మార్చ్ 2000 నాటికి సహకార సంస్థల ఆర్థిక స్వరూపం**

| బ్యాంకుల పేరు | బ్యాంకుల సంఖ్య | శాఖల సంఖ్య | డిపాజిట్ల మొత్తం (కోట్లలో) | రుణాలు (కోట్లలో) | బకాయిలు (కోట్లలో) | నష్టాలు (కోట్లలో) |
|---|---|---|---|---|---|---|
| ఎస్.సి.బి | 29 | 823 | 29,557 | 10,860 | 25,708 | 7 |
| బి.సి.సి.బి | 367 | 12,407 | 53,888 | 14,640 | 44,201 | 497 |
| పి.ఎ.సి | - | 92,000 | 12,284 | 22,343 | 28,275 | 2,817 |

2002 మార్చి 31 నాటికి దేశంలో 606 జిల్లాల పరిధిలో 6,28,861 గ్రామాల్లో 10.60 కోట్ల మంది భూ యజమానులున్నారు. వారు సగటున 0.88 హెక్టార్ల భూమిని మాత్రమే కలిగి ఉన్నారు. వారందరికి సమర్థవంతమైన రుణప్రణాళిక, నిర్ణీత వ్యూహం, హేతుబద్ధమైన రుణవిధానం ద్వారా అట్టడుగుస్థాయి నుంచి ఈ పరపతి సౌకర్యం కల్పించాలనే ఉద్దేశ్యంలో భాగంగా ప్రభుత్వాలు చర్యలు తీసుకుంటున్నాయి. వాణిజ్య బ్యాంకులు, ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు, సహకార బ్యాంకులు మొదలైన బ్యాంకులు రుణాల్ని అందజేస్తున్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో అప్పులు ఇచ్చే వడ్డీ వ్యాపారులకు బ్యాంకింగ్ వ్యవస్థ సరైన ప్రత్యామ్నాయం కాలేకపోయింది. అలాంటి ప్రతికూల పరిస్థితుల్లో దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న వారికి ప్రత్యేకించి గ్రామీణ ప్రాంత పేదలకు ఆర్థిక నిపుణులు, ప్రణాళికవేత్తలు, సహకార వ్యవస్థను రూపకల్పన చేశారు.

ప్రతి పంచవర్ష ప్రణాళికలో సహకార రుణాలను ప్రభుత్వాలు పెద్ద ఎత్తున పెంచుతూ వస్తున్నాయి. 2001 మార్చి నాటికి 1,39,533 ఆర్థిక సంస్థలు రుణాలు ఇవ్వగా అందులో సహకార సంఘాలు అత్యధికంగా 94,663 (67.8 శాతం) ఉన్నాయి. అలాగే ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు 12,223 (8.8 శాతం), వాణిజ్య బ్యాంకులు 32,667 (23.4 శాతం) నిలిచాయి.

2000 మార్చి 31 నాటికి దేశంలో 29 స్టేట్ - కార్పొరేట్ బ్యాంకులు, 828 శాఖలను కలిగి ఉన్నాయి. ఈ బ్యాంకులు 1999-2000 ఆర్థిక సంవత్సరంలో 29,557 కోట్ల డిపాజిట్లను స్వీకరించగా అందులో 10,860 కోట్ల రుణాలివ్వగా, 27,708 కోట్ల బకాయిలు పేరుకుపోయాయి. 497 కోట్ల రుణాలు నష్టపోయినాయి.

డి.సి.సి.బి.లు దేశంలో మొత్తంగా 367 ఉండి 12,407 శాఖలతో పని చేస్తున్నాయి. ఇవి 53,888 కోట్ల డిపాజిట్లను స్వీకరించి 14,640 కోట్ల రూపాయల రుణాలనందిచాయి. 44,201 కోట్ల బకాయిలుండగా, 2,817 కోట్ల నష్టాలను పొందినాయి.

దీన్ని బట్టి చూస్తే దేశంలో బ్యాంకులు వ్యవసాయ రంగానికి అందించిన రుణాలు చాలా వరకు రికవరీకావడం లేదని తెలుస్తుంది. ఫలితంగా బ్యాంకులు రుణవిస్తరణ కార్యకలాపాలను విస్తరించ లేకపోతున్నాయి.

**పట్టిక 2**
**వివిధ రంగాలకు రాష్ట్ర సహకార బ్యాంక్ అందించిన వార్షిక సగటు పరపతి వృద్ధిరేట్లు (శాతం)**

| సంవత్సరం | వ్యవసాయం | పరిశ్రమలు | రవాణా | వృత్తి సేవలు | వ్యాపారం | ఫైనాన్స్ |
|---|---|---|---|---|---|---|
| 1981-91 | 14.77 | 15.68 | 08.68 | 22.90 | 10.84 | 26.30 |
| 1992-00 | 10.90 | 16.21 | 11.48 | 20.68 | 15.16 | 24.76 |
| 1981-00 | 11.86 | 15.80 | 07.82 | 21.31 | 13.06 | 26.12 |

రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా సౌజన్యంతో

పట్టిక 2ను గమనించినపుడు అనేక అంశాలు వెల్లడవుతాయి. 1991 బ్యాంకింగ్ సంస్కరణల అమలు తర్వాత వ్యవసాయ పరపతి తగ్గుముఖం పట్టింది. 1981-2000 మధ్యకాలంలో వ్యవసాయ రంగానికి ఎస్.సి.బి.ల నుండి అందించబడే పరపతి పరిమాణం తగ్గుతూ ఉండి వ్యవసాయేతర రంగాలైన పారిశ్రామిక, రవాణా, వృత్తిసేవలు, వ్యాపారం వంటి విషయంలో పరపతి శాతం పెరుగుతూ వస్తోంది. 1981-91 మధ్యకాలంలో అనగా ఆర్థిక సంస్కరణల అమలు కంటే ముందు సహకార బ్యాంకుల (ఎస్.సి.బి.లు) నుండి వ్యవసాయానికి అందే పరపతి శాతం 14.77 గా ఉంది. 1992-2000 సంస్కరణల అమలు తర్వాత 10.90 శాతానికి తగ్గింది. రెండు దశాబ్దాల కాలంలో వ్యవసాయ పరపతి వృద్ధిరేటు 11.86 శాతంగా ఉంటే, పరిశ్రమలకైతే 15.80 శాతంగా ఉంది. అనగా వ్యవసాయానికి అందే పరపతి కంటే పరిశ్రమలకు ఎక్కువగా ఉంది.

**పట్టిక 3**
**బ్యాంకుల అందించిన మొత్తం రుణాలలో బ్యాంకుల వారీగా రాష్ట్ర సహకార బ్యాంకులు అందించిన రుణాల బకాయిల వాటా**

| సంవత్సరం | ఎస్.బి.ఐ. దాని అనుబంధ | జాతీయ బ్యాంకులు | విదేశీ బ్యాంకులు | ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు | ఇతర షెడ్యూల్ వాణిజ్య | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1983 | 19.23 | 15.35 | 0.00 | 64.66 | 5.90 | 16.44 |
| 1986 | 21.56 | 14.89 | 0.00 | 59.24 | 5.00 | 17.05 |
| 1989 | 19.19 | 16.53 | 0.00 | 55.12 | 4.98 | 17.46 |
| 1990 | 16.90 | 15.44 | 0.34 | 54.37 | 9.60 | 15.84 |
| 1993 | 15.86 | 14.18 | 0.54 | 50.45 | 8.14 | 14.38 |
| 1996 | 12.75 | 11.97 | 0.33 | 49.53 | 5.63 | 11.94 |
| 1999 | 11.56 | 11.20 | 0.37 | 48.35 | 5.03 | 10.81 |
| 2000 | 10.36 | 10.48 | 0.36 | 48.12 | 4.42 | 09.92 |

రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బ్యాంకింగ్ స్టాటిస్టిక్స్ (1981-2000) సౌజన్యంతో

1991లో ఆర్థిక వాతావరణంలో వచ్చిన మార్పులు వ్యవసాయ రంగాన్ని నిరుత్సాహపరుస్తూ పారిశ్రామిక రంగాన్ని ప్రోత్సహించాయని చెప్పవచ్చు.

పట్టిక 3 షెడ్యూల్ కమర్షియల్ బ్యాంకుల నుండి వ్యవసాయ రంగానికి అందిన నికర రుణాల శాతం తగ్గుతోంది. ఎస్.బి.ఐ. దాని అనుబంధ ఆర్థిక సంస్థల నుండి 1983 లో 19.23 శాతం రుణాలు ఇవ్వగా 1990 నాటికి 16.9 శాతం ఉంటూ 2000 నాటికి 10.30 శాతానికి తగ్గినవి. అదే విధంగా ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు 1983లో వ్యవసాయానికి అందించిన నికర రుణాల శాతం 64.66 శాతంగా ఉండగా, 1990 నాటికి 54.37 శాతానికి తగ్గినవి. అది 2000 నాటికి 48.12 శాతానికి తగ్గింది. స్థూలంగా చూసినప్పుడు మొత్తం వ్యవసాయ రంగానికి షెడ్యూల్డ్, వాణిజ్య బ్యాంకుల నుండి అందించిన నికర రుణాలు వరుసగా 16.4 శాతం నుండి 15.94 శాతం, 9.92 శాతానికి తగ్గడానికి రుణాలు ఇలా వ్యవసాయ రంగానికి అందించడానికి గల ముఖ్య కారణం వ్యవసాయేతర రంగాలకు అందించిన రుణాల శాతం పెరగడం, వ్యవసాయానికి అందించిన రుణాలు రికవరీ కాకపోవడం.

**రాష్ట్రంలోని మూడు లక్షల చేనేత కుటుంబాలు జీవన్మరణ పోరాటం చేస్తున్నాయి, వారి సమస్యలను పరిష్కరించడానికి నిజాయితీ, చిత్తశుద్ధి కావాలని అంటున్నారు తడ్క యాదగిరి**

# చేనేత రంగం - కొన్ని ప్రశ్నలు

**భా**రతీయ వస్త్రోత్పత్తిలో చేనేత గతం కన్నా ముందు ఏకఛత్రాధిపత్యాన్ని కలిగి, గతమంతా ఆధిపత్యం ప్రదర్శించి, వర్తమానంలో ఉనికి కోసం పోరాడుతుంటే, భవిష్యత్తులో అంతరించి పోతుందేమోనని ఆందోళన కలుగుతోంది.

చేనేత కార్మిక కుటుంబాలు అగమ్య గోచరమైన పరిస్థితులలో కొట్టుమిట్టాడుతున్నాయి. భాషలో వ్యక్తం చేయలేనంతగా ఆందోళన చెందుతున్నాయి. పరిశోధకులకు అందనంత లోతుగా సమస్యలు ఎదుర్కొంటున్నాయి. వేగవంతమైన మార్పులకు చేనేత తట్టుకుంటుందా అని సమకాలీన సమాజం ప్రశ్నిస్తోంది. ప్రభుత్వమైతే ఇది పరిష్కారంలేని సమస్యగా చూస్తోంది. ఇందులో నిజాయితీ, చిత్తశుద్ధీ లేకపోవడమే అసలు సమస్య. మీడియా వార్తలకోసం, సంచలనాలకోసం చిన్న సమస్యను పెద్దగా చూపుతున్నాయని, ప్రతిపక్షాలు తమ ప్రయోజనాల కోసమే వీటిని ఉపయోగించుకుంటున్నాయని అధికారపక్షాలు ప్రతిసారి చేసే నిర్లక్ష్యపు పెదవి విరుపు మాత్రమే మిగిలింది.

రాష్ట్ర జనాభాలో చేనేత వృత్తి కులాల సంఖ్య ఆరు శాతం. ప్రస్తుతం చేనేత రంగంపై ఆధారపడి జీవిస్తున్న మూడు లక్షల

**ముగింపు**

దేశంలో అమలవుతున్న వివిధ సంస్కరణల వల్ల ముఖ్యంగా 1991లో బ్యాంకింగ్ రంగ సంస్కరణల కోసం నర్సింహం కమిటీ చేసిన సిఫారసులు, ప్రభుత్వ పథకాల వైఫల్యం వల్ల వ్యవసాయరంగ పురోభివృద్ధి తిరోగమనంలో పడింది. ఆర్థికంగా రైతును బలోపేతంచేసి తనకాళ్ల మీద తాను నిలబడగలిగేటట్లు చేసే వ్యవస్థీకృత యంత్రాంగాన్ని ఏర్పాటు చేయడంలో ప్రభుత్వాలు వైఫల్యం చెందుతున్నాయని చెప్పవచ్చు. ఈ మధ్యకాలంలో భారతీయ రిజర్వ్ బ్యాంకు వి.ఎస్.పి.తోరట్ ఆధ్వర్యంలో వ్యవసాయరంగానికి అందించబడే పెట్టుబడి రుణాల పరిశీలన కోసం ప్రత్యేక నిపుణుల కమిటీని నియమించింది. వ్యవసాయంలో జరిగే తక్కువ వృద్ధిరేటు ఆర్థిక వ్యవస్థపైన చెడుప్రభావాన్ని చూపుతోందని, సాంకేతిక పరిజ్ఞానాన్ని, ఉత్పత్తిని, పరపతిని, మార్కెటింగ్ ను, ప్రాసెసింగ్‌ను, అవస్థాపన సౌకర్యాలను మెరుగుపరచడం ద్వారా కొంత వరకు వ్యవసాయాభివృద్ధిని సాధించవచ్చని అభిప్రాయపడింది.

దేశ ఆర్థిక వ్యవస్థకు జీవనాడిగా ఉన్న వ్యవసాయరంగ వృద్ధిరేటు సంవత్సరానికి నేటికీ 2 శాతం మించడం లేదు. మరో విధంగా చెప్పాలంటే రైతులకందే ప్రత్యక్ష రుణాలు విజయవంతం కాలేక పోయినాయి. వ్యవసాయ రంగానికి అందే ప్రత్యక్ష రుణాల వల్ల పెట్టుబడి రేటు పెరగడం, పేదరిక స్థాయి తగ్గడం వంటి ప్రత్యేక ఫలితాలు కనిపించడంలేదు. 1991లో బ్యాంకింగ్‌రంగ సంస్కరణలకు సంబంధించి నర్సింహం కమిటీ ఆర్థికసంస్కరణల అమలు తర్వాత ప్రాథమికరంగం అయిన వ్యవసాయరంగం ఉత్పాదకత తగ్గడమే కాకుండా, బ్యాంకింగ్ రంగ సామర్థ్యాన్ని బలహీనం చేస్తున్నాయి. ఎందుకనగా బ్యాంకులు తక్కువ వడ్డీకే రుణాలు మంజూరు చేయడం అని అభిప్రాయపడింది.

**సూచనలు**

1. బ్యాంకులు రైతులకు తక్కువ వడ్డీకి, సాధ్యమైనంత వరకు ఉత్పాదక కార్యక్రమాలకు రుణాలు అందజేయాలి.
2. అందించిన రుణం సరైన విధంగా వినియోగం అవుతోందా లేదా అనే నిర్మాణాత్మక యంత్రాంగాన్ని తయారు చేయాలి.
3. రైతులకు రుణ వినియోగానికి సంబంధించి గుణాత్మక పద్ధతులు తెలియజేయాలి.
4. సహకార బ్యాంకులు రైతుల నుండి రుణాలు వసూలు చేసేటప్పుడు ప్రజాస్వామ్య పద్ధతులను పాటించాలి.
5. గ్రామీణ పొదుపుకు జీవనాడిగా ఉన్న స్వయం, సహాయక సంఘాల సమన్వయంతో ఆర్థిక సంస్థలను స్థాపించడం వల్ల గ్రామీణ పేదలకు ఉపాధి పెరగడమే గాకుండా వ్యవసాయాభివృద్ధి మెరుగవుతుంది.
6. వ్యవసాయ అనుబంధ వృత్తులైన పాడి పరిశ్రమ, కోళ్ల పెంపకం, మత్స్య పరిశ్రమ, గొర్రెల పెంపకం మొదలగు వాటికి రుణ సౌకర్యాన్ని విస్తృతపరచాలి.
7. మార్కెటింగ్ లోపాలను సరిదిద్దే ప్రయత్నంలో భాగంగా ప్రాసెసింగ్ యూనిట్లు వాటికి అనుబంధ కుటీర పరిశ్రమలు స్థాపించడం వల్ల వ్యవసాయాభివృద్ధి తీరు మెరుగవుతుంది.
8. గ్రామీణ రుణరంగంలో బ్యాంకులకు, రైతులకు మధ్య జవాబు దారీతనం పెరగాలి.
9. వ్యవసాయానికి సంబంధించి విద్యుత్ సరఫరాను మెరుగు పరచి, పెండింగ్‌లో ఉన్న విద్యుత్ బకాయిలను మాఫీ చేయాలి.
10. రైతులు ఆత్మహత్యలకు పాల్పడకుండా వారిలో విశ్వాసాన్ని పెంపొందించడానికి కావాల్సిన కౌన్సిలింగ్‌ను నిర్వహించాలి. ◆

కుటుంబాలు జీవన్మరణ పోరాటంలో కొట్టుమిట్టాడుతున్నాయి. వీరి వాస్తవ పరిస్థితులను అర్థం చేసుకోవాలంటే కావాల్సింది సానుభూతి కాదు, చేనేత కులాలకు చెంది ఉండనవసరం లేదు. నిజాయితీ, చిత్తశుద్ధి, నిష్పక్షపాతం ఉంటే చాలు. ఒక సామాజిక ఆర్థిక సమస్యను పరిశీలించే నిబద్ధత కావాలి. ఈ ప్రయత్నంలో భాగంగా ఇంకా చేనేత ఎందుకు? సమాజం బాధ్యత ఎంతవరకు? వృత్తి నైపుణ్యం, ప్రభుత్వ విధానాలు వంటి నాలుగు విభాగాలలో సంక్షిప్తంగా చర్చించే ప్రయత్నం చేశాను.

### ఆధునిక పరిజ్ఞానంతో పోటీ

మానవ నాగరికతా పరిణామానికి చేనేత సజీవ సాక్ష్యం. ప్రాచీనమైన ఈ కళ అత్యాధునికమైన సమాజ అవసరాలు తీరుస్తోంది. పారంపరిక జ్ఞానంతో నిరంతరం మారుతూ నేడు విద్యుత్ వినియోగించ కుండా ఉత్పత్తి చేసే 'చేనేత'గా నేటికీ నిలదొక్కుకోవడమే ఆధునిక పోటీ ప్రపంచానికి ఒక సవాల్.

అన్ని రంగాలలో మార్పులు వస్తున్నాయి. ఇంకా చేనేత రంగం ఎందుకుండాలనే సందేహం రావచ్చు. ప్రాచీన చేనేత పరిశ్రమ నుండే ఆధునిక మర మగ్గాలు, మిల్లులు పుట్టుకొచ్చాయి. అత్యాధునిక జెట్‌లూంలు వచ్చాయి. అంతమాత్రాన చేనేత పరిశ్రమ కనిపించకూడదనే అభిప్రాయం కలిగి ఉండటం మూసపోత ధోరణి. కంప్యూటర్ యుగంలో కళాకారులెందుకు? అని ప్రశ్నించుకోవడం వంటిదే. మానవ సమాజ చరిత్రలో, సంస్కృతిలో వస్త్రాలు ప్రధానపాత్ర పోషించాయి. సృజనాత్మకత ఆలోచనా జీవి హక్కు. దానిని వ్యక్తం చేయడం ఒక బాధ్యత. అదంతా సమాజపు సంపద. నేటికీ చేనేత పరిశ్రమ ఒక ప్రధాన గ్రామీణ ఉపాధిరంగంగా నిలబడింది. అంటే ఆధునిక పరిజ్ఞానంతో పోటీపడుతూ తనదైన ముద్రను నేటికీ నిలబెట్టుకుందనడంలో సందేహం లేదు.

### ఆధునిక అభిరుచులను అందుకోవాలి

సాంప్రదాయికమైన చేనేత వస్త్రోత్పత్తులు నేడు ఆధునిక వినియోగ దారుల అభిరుచులకు అనుగుణంగా మార్పు తీసుకొంటున్నాయి. చీరల నుండి డ్రెస్ మెటీరియల్‌కు మారడం ఒక విప్లవం. నేడు ఓ రకమైన ఆర్డర్స్ వస్తే వాటినే ఉత్పత్తి చేసే స్థాయి, సామర్థ్యం చేనేత పరిశ్రమకు ఉంది. వినియోగదారుల మద్దతు వల్లనే చేనేత నిలబడగలుగుతుంది. ప్రభుత్వాల వల్ల కాదు. వినియోగదారుల అభిరుచులు ఉత్పత్తి దారులకు చేరవేసే యంత్రాంగం లేకపోవడమే ప్రధాన సమస్య. చేనేత సాంప్రదాయికతకు, ఆధునికతకు నిరంతర వారధి.

### పోటీలో నిలదొక్కుకోవడం

సామాజిక స్పృహ ఉన్నట్టు నటించే అనేకమంది చేనేత కార్మికులు పాత పద్ధతులతో, పాత డిజైన్లతో పోటీలో ఎలా నిలబడతారు అని ప్రశ్నిస్తారు. వాస్తవ పరిస్థితులు అధ్యయనం చేయకుండా అభాండాలు వేస్తారు. సమస్యను విశ్లేషించి పరిష్కారం చెబుతారు. చేనేత కార్మికులు నిరంతరం విద్యార్థుల్లాగా పనితనాన్ని మెరుగు పర్చుకుంటున్నారు. మార్పును స్వీకరిస్తున్నారు. కాబట్టే పోటీలో నిలబడ్డారు. పోటీకి నిలబడలేని లక్షలాది కుటుంబాలు ఈ పోటీకే వృత్తిని వదిలి వెళ్లాయి. కార్మికులు కుగ్రామాల నుంచి చేనేత కేంద్రాలకు వలస వచ్చి నాణ్యమైన వస్త్రోత్పత్తులు చేస్తున్నారు. నమ్మశక్యం కాని డిజైన్లు, ఊహించని నాణ్యతలో వస్త్రాలు దొరుకుతున్నాయి. చేనేత వస్త్రం నాణ్యత మరే యంత్రంపై సాధ్యం కాదు. చేనేత వస్త్రాలను కాపీ చేస్తు మిల్లులు, మరమగ్గాలు పబ్బం గడుపుకుంటున్నాయంటే ఎవరు, ఎవరితో, ఎలా పోటీ పడుతున్నారో వేరుగా చెప్పాలా. చేనేత వస్త్రాలు, ఖాదీ వస్త్రాల పేరుతో మిల్లు, మరమగ్గాలు, వస్త్రాలు అమ్మే దౌర్భాగ్యం ఎందుకొచ్చింది. నేటికీ నిజమైన చేనేత వస్త్రాలకు ఊహించనంత డిమాండ్ ఉంది.

### ప్రభుత్వ బాధ్యత

ఇవి ప్రజా ప్రభుత్వాలు. ప్రజల బాగోగులు చూడడం కోసం ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాలు. లక్షలాది ప్రజలకు జీవనోపాధినిస్తున్న పరిశ్రమను సానుభూతితో కాదు బాధ్యతతో రక్షించాల్సి ఉంది. పరిశ్రమలకు వందల కోట్ల రూపాయల సహాయం, భూముల ధారాదత్తం చేస్తున్న ప్రభుత్వాలు, లక్షలాది ప్రజల జీవితానికి సంబంధించిన చేనేత పై సీరియస్‌గా ఆలోచించాలి. నిర్దిష్టమైన రక్షణ చర్యలు చేపట్టాలి. ఎందుకంటే ఈ ప్రభుత్వాలకు ప్రత్యామ్నాయ ఉపాధి చూపే సామర్థ్యం, శక్తిలేవు. చేనేత సంక్షోభానికి ప్రధాన బాధ్యత వహించాల్సింది ప్రభుత్వాలే. ప్రభుత్వం పక్షపాత ధోరణి వల్లే చేనేతకు రక్షణ లేకుండా పోయింది.

### చేనేత - పౌరసమాజం బాధ్యత

ఉదార ఆర్థిక విధానాల నేపథ్యంలో చేనేత కుటుంబాల ఆకలి చావులు, ఆత్మహత్యలు సర్వ సాధారణమైనాయి. వీటి గురించి మాట్లాడటం కొత్తేమీ కాదు. జైళ్లలో క్రిమినల్స్ హక్కులు, టెర్రరిస్టుల సిద్ధాంతం, వీరి శిక్షల హేతుబద్ధత వంటి సూక్ష్మ విషయాల గూర్చి మాట్లాడే మహామహులు చేనేతల గూర్చి మాట్లాడేందుకు ముందుకు రారు. జీవించే హక్కు రాజ్యాంగం కల్పించినా, ఆ హక్కు కాపాడతామని ప్రమాణం చేసిన ప్రభుత్వాలు సైతం ఆత్మహత్యలపై అసందర్భ ప్రేలాపనలు పలుకుతాయి. ఇటువంటి సందర్భంలో ప్రజలకు ప్రాతినిధ్యం వహించే రాజకీయ పార్టీలు ప్రధాన ఎజెండాగా మాట్లాడాల్సి ఉంది. నేతన్నల హక్కుల కోసం ప్రజా ఉద్యమాలు నిర్మించాలి. స్వచ్ఛంద సంస్థలు ప్రత్యామ్నాయ నమూనాలు రూపొందించి వాటిని అమలయ్యేలా ఒత్తిడి తీసుకురావాలి. పౌర సమాజం మానవ హక్కుల ఉల్లంఘనలపై ప్రతిస్పందించాలి.

### కార్మిక సంఘాలపై పెరిగిన బాధ్యత

ప్రపంచీకరణ నేపథ్యంలో వస్తున్న వేగవంతమైన మార్పులు కార్మిక వర్గంపై ఊహించని రీతిలో ప్రభావం చూపుతున్నాయి. ఇటువంటి తరుణంలో కార్మిక సంఘాలు కొత్త వ్యూహాలతో కార్మిక వర్గాన్ని సంఘటిత పర్చాలి. తమ హక్కుల సాధనలో చేనేత కార్మికులకు నాయకత్వాన్ని అందించాలి. సంక్షోభాలకు మూలాలు చెప్పగలగాలి. ప్రత్యామ్నాయ విధానాలు రూపొందించి ప్రభుత్వాలపై ఒత్తిడి చేయాలి. మరోవైపు కార్మికుల వృత్తి నైపుణ్యాలు మరింతగా పెంపొందించుకునేందుకు అవసరమైన ఆలోచనలు ప్రచారం చేయాలి. తద్వారా పోటీ ప్రపంచంలో సరైన వేతనాలు పొందేందుకు కావాల్సిన శక్తిని పెంచాలి.

### నైపుణ్యం, సామర్థ్యం పెంచాల్సిన అవసరం

సమకాలీన సమాజంలో ముందుకు సాగాలంటే ప్రతి రంగం తన సామర్థ్యాలు పెంచుకోవాల్సిందే. ఉన్న సామర్థ్యాలకు పదును

పెట్టడం, మార్పులు చేయడం, కొత్తవాటిని తెలుసుకుని ఆచరణలో పెట్టడం చేయాలి. నైపుణ్యం, సామర్థ్యం పెంచుకోవాలి అంటే చేనేత కార్మికులకు అవి లేవని అర్థం కాదు. అత్యాధునిక డిజైన్లపై, నాణ్యతపై, రంగుల అద్దకంపై మరింత అవగాహన పెంచాలి. ఇందుకు ప్రభుత్వాలు చిత్తశుద్ధితో కూడిన శిక్షణ ఇవ్వాలి. నేటి వరకు వీటి పేరుతో మార్కెట్‌తో సంబంధం లేకుండా నైపుణ్యం – 'నైపుణ్యం కోసమే' అనే వాదనతో శిక్షణ ఇచ్చారు. కోట్లాది రూపాయలు వృథా చేశారు. మార్కెట్ అవసరాలు గుర్తించి, దానితో అనుసంధానం చేసి తర్వాత అవసరమైన శిక్షణలు ఇవ్వడం ప్రయోజనకరంగా ఉంటుంది. అప్పుడే చేనేత కార్మికులు వేతనాలు డిమాండ్ చేయగలుగుతారు.

## వస్త్రోత్పత్తుల సమాచారం – ప్రచారం

సమాచార సాంకేతిక విప్లవంలో సైతం చేనేత వస్త్రోత్పత్తులపై వినియోగదారులకు సమాచారం లేదు. ఉత్పత్తి రకాలు, నాణ్యత, ధరలు నేటికీ రహస్యమే. ఈ విధానం మారాలి. నిజమైన సమాచారం ప్రజలకు అందించాలి. ఇందుకు చేనేతపై సమగ్రమైన అధ్యయనం జరిపి వాటి వివరాలు వివిధ మార్గాల ద్వారా, మాధ్యమాల ద్వారా ప్రజలకు వివరించాలి. టెలివిజన్, రేడియో, వెబ్‌సైట్స్, బుక్‌లెట్స్, సినిమా, హోర్డింగ్స్ మొదలైనవి. అత్యధిక జనాభా గల మన దేశంలో విద్యుత్ వాడకుండా సహజ సిద్ధంగా ఉత్పత్తి చేస్తున్న లక్షలాది మంది ఉపాధి పొందుతున్న రంగాన్ని కాపాడుకోండని, సృజనాత్మక కళను ప్రోత్సహించమని ప్రచారం చేయాలి. ఎందుకు చేయాలంటే ఆరోగ్యాలపై, ఎయిడ్స్‌పై, వ్యాధులపై, ట్రాఫిక్‌పై, మద్యం, సిగరెట్, నేరాలపై ప్రచారం జరిపే ప్రభుత్వ ప్రచారశాఖ లక్షలాది ప్రజల జీవనోపాధుల రక్షణపై నిజాయితీగా ప్రచారం జరపాలి. చేయకూడని పనులపైనే గాక ప్రకృతికి దగ్గరగా ఉన్న ఉత్పత్తులపై ప్రచారం జరిపి పర్యావరణం కాపాడే దిశగా ముందుకు సాగాలి.

## మార్కెటింగ్

ఏ ఉత్పత్తి రంగంలోనైనా మార్కెటింగ్ ప్రధాన సమస్య. చేనేత రంగం సాంప్రదాయక మార్కెట్ల నుండి ఆధునిక మార్కెట్ల వైపు ప్రయాణం సాగిస్తోంది. ఈ తరుణంలో అంగళ్లు కనుమరుగైనాయి. పెద్ద పెద్ద దుకాణాలు ముందుకు వచ్చాయి. ఈ స్థితిలో వృత్తి నిపుణులు అవసరమయ్యా, డిజైనర్లు, మార్కెటింగ్ ఎగ్జిక్యూటివ్‌లు మొదలైనవారి రాకతో చేనేత కార్మికులు స్వయంగా మార్కెట్ చేసుకునే స్థితి నుండి పరాయీకరింపబడ్డారు. సహకార సంఘాలు, ఆప్కో వంటి సంస్థలు మార్కెటింగ్ చేయడంలో వైఫల్యం చెందగా, ప్రైవేట్ సంస్థలు పెద్ద ఎత్తున లాభాలు గడిస్తూ చేనేత పేరుతో సొమ్ము చేసుకుంటున్నాయి. ఈ వైవిధ్యాలను గుర్తించాలి. మార్కెటింగ్‌ను వృత్తి నైపుణ్యంతో చేయగలిగినప్పుడే రాబడులు మంచిగా వస్తాయి. వాటిలో నేతగాళ్లకు వేతనాలతో పాటు లాభాలు అందించగలగాలి. నేడు ప్రైవేట్ వర్తకులు, మాస్టర్ వీవర్లు మాత్రమే మార్కెట్‌ను శాసిస్తున్నారు. ఇటువంటి తరుణంలో నేతగాళ్లకు మార్కెట్ డిమాండ్లను చేరవేసి, వాటికి అనుగుణమైన సామర్థ్యాలు అందించాలి. ఇటువంటి కార్యక్రమాలు కేవలం ప్రైవేట్ రంగంలో నడుస్తున్నాయి. చేనేత వస్త్రాల మార్కెటింగ్‌లో ఆప్కో వైఫల్యం మొత్తం చేనేతరంగానికి విపరీతమైన నష్టాన్ని చేకూర్చింది. సహకార సంఘాలు ఉత్పత్తి సంఘాలుగా ఉండాలి. అప్పుడే ఉత్పత్తిపై సంఘాలు దృష్టి కేంద్రీకరిస్తాయి. చిన్న చిన్న ఎగ్జిబిషన్‌లు మధ్య దళారులకే చేరుతున్నాయి. చేనేత పేరుతో జరిగే ఎగ్జిబిషన్‌లో సగం వరకు మరమగ్గాల ఉత్పత్తులు అమ్మబడుతున్నా ఆప్కో వంటి సంస్థలు నోరు మెదపడం లేదు. చేనేత వస్త్రాలకు మార్కెటింగ్ యంత్రాంగం లేకపోవడమే కారణం. పాతకాలపు డిస్కౌంట్ పద్ధతులు నేటికీ కొనసాగించడం, ఎక్కువ లాభాలు చేసుకోవడం సహించరాని విషయం.

## ప్రభుత్వ విధానాలు

స్వాతంత్ర్యానంతరం అనేక ప్రభుత్వ విధానాలు వస్త్ర రంగంలో వచ్చాయి. ఈ విధానాలు చాలా చక్కగా సమస్యలను విశ్లేషించినా ఆచరణలో వైఫల్యం చెందాయి. 1985లో వచ్చిన నూతన జౌళి విధానం ప్రమాదపుటంచుల వైపు నెడుతూనే – చేనేత రంగానికి – 1) 22 రకాల రిజర్వేషన్ ఉత్పత్తులు, 2) యాభై శాతం చిలపల నూలు ఉత్పత్తి, 3) చేనేత రంగం అభివృద్ధికి, కార్మికుల సంక్షేమానికి పథకాలు ప్రకటించి చేతులు దులుపుకుంది.

పై మూడింటిలో ఏ ఒక్కటి నేటికీ అమలు కాలేదు. చేనేత పేరుతో విధానాలు రూపొందించి మరమగ్గాల, మిల్లుల ప్రయోజనాలు కాపాడటం ఈ ప్రభుత్వాల నైజం. 2000 సంవత్సరాల జాతీయ జౌళి విధానం పేరుతో చేనేత రంగానికి ఉజ్వల భవిష్యత్ ఉందని చెప్పింది. దీనికి భిన్నంగా ప్రతిరోజు నేతన్నల ఆత్మహత్యలు, ఆకలిచావులు. ఇక రాష్ట్ర ప్రభుత్వాలు కనీసం కేంద్ర ప్రభుత్వ పథకాలను కూడా అమలు చేయలేని అసమర్థతతో ప్రభుత్వం నడుస్తోంది.

చేనేత కార్మికుల సమాధులపై నిర్మించబడిన ఈ రాష్ట్ర ప్రభుత్వం సమస్య పరిష్కారానికి వెంట్రుకవాసి ప్రయత్నమైనా చేయకపోవడం సహించరానిది. ఈ రాష్ట్ర ప్రభుత్వానికి ఒక విధానం లేదు.

## సంక్షేమ పథకాలు

జీవించడానికి అర్హతలేని నేతన్నలకు సంక్షేమ పథకాలా? అంటూ అధికారులు, నాయకులు వెక్కిరించడం పరిపాటి. మూడేళ్లలో ఒక్క పథకమైనా సరిగా అమలు చేయలేదు. గృహ నిర్మాణం, పెన్షన్‌లు, సహకార సంఘాల పరిపుష్టి వంటి వాటిలో ఏ ఒక్కటి అమలు చేయలేదు. కేంద్రం ఇచ్చే నిధులు దారి మళ్లిచ్చి పథకాలు అమలు చేయని అసమర్థత క్షమించరాని వైనం.

## చేనేత పై పరిశోధన

గ్రామీణ జీవనంతో ముడిపడి ఉన్న చేనేత రంగం పురోభివృద్ధిపై నిర్దిష్టమైన పరిశోధనల్లేవు. చేనేత కార్మికుల జీవనోపాధులు, సమస్యలు, ప్రభుత్వ విధానాలు ప్రత్యామ్నాయాలపై పరిశోధనలు జరగలేదు. విశ్వవిద్యాలయాలు నామమాత్ర పరిశోధనలు గ్రంథాలయాలకు, డిగ్రీలకు పరిమితమైనాయి.

సాంకేతికపరంగా విద్యా బోధనకి ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యాండ్లూమ్ టెక్నాలజీ సంస్థలు పరిమితమైనాయి. వీవర్స్ సర్వీస్ సెంటర్, ఎన్.ఐ.ఎఫ్.టి., ఎన్.ఐ.డి. వంటివి చాలా పరిమితులకు లోబడినవి. ఇటీవలి కాలంలో దస్తకర్, చిప్ వంటి సంస్థలు పరిశోధనలు చేస్తున్నాయి. ఇటువంటి ప్రయత్నాలు మరింతగా పెరగాలి. ◆

**ప్రభుత్వం చేపట్టే పథకాలన్నీ అధికారపార్టీ నాయకులను ఆర్థికంగా బలోపేతంచేసే విధానాలేగాని ప్రజలకు మేలు ఏమీ జరగడం లేదంటున్నారు బి. సైదులు, దబ్బేటి మహేష్**

# దారిద్ర్యరేఖను 'చెరిపేసిన' ఇందిరమ్మ గృహాలు

ప్రభుత్వం ప్రజల క్షేమంకోరి ప్రజలకు ఇవ్వడానికి నిర్దేశించిన పథకాలనే సంక్షేమ పథకాలు అంటారు. ఇల్లులేని వారికి ఇల్లు ఇవ్వడం, మరుగుదొడ్లు లేని వారికి మరుగుదొడ్లు కట్టివ్వడం, కుట్టుమిషన్లు, సైకిళ్లు, బర్లు, గొర్లు, కోళ్లఫారాలు, రెండు రూపాయలకు కిలో బియ్యం లాంటివి ఈ పథకాల కింద ఇవ్వడం జరుగుతోంది. వీటిలో కొన్ని పూర్తి ఉచితంగా (లంచాలు మినహా) ఇవ్వడం, కొన్నింటికి సబ్సిడీలు ఇవ్వడం ఉంటుంది. ప్రభుత్వాలు సంక్షేమ దృష్టితో పథకాలు అమలు చేస్తున్నాయి.

రోడ్ల పక్కన వేసే బోర్డులపై ఒక గ్రామీణ చిత్రం ఉంటుంది. ఆ చిత్రంలో బహిర్భూమికి వెళ్లే స్త్రీ ఉంటుంది. దానికింద 'మన ఆడపడుచులు ఈ విధంగా అవమానపడవలసిందేనా? మరుగుదొడ్ల కోసం మండల అభివృద్ధి అధికారిని సంప్రదించండి' అని ఉంటుంది. ఇలాగే చాలా ప్రచారాలు జరుగుతాయి. పోయి అడిగిన వాళ్లందరికీ మరుగుదొడ్లు మంజూరు చేస్తారా? చేయరు. ఎవరికి మంజూరు చేస్తారు? అధికారపార్టీ నాయకులకు, వారు పైరవీ చేసిన వారికి ఇస్తారు. లేదా గ్రామాలలో ఉండే పార్టీ నాయకుల అధికార స్థాయిని బట్టి, అధికారం లేని దాన్ని బట్టి తలా కొన్ని పంచుకోవడం జరుగుతుంది. అలాంటప్పుడు బోర్డులెందుకు పెట్టుకోవాలి? ప్రచారాలు ఎందుకు చేయాలి? ఇవి ఎత్తుగడ ప్రచారాలు. అందరికీ ఇస్తున్నట్లు ప్రచారం జరగాలి. కానీ ఇచ్చేది మాత్రం తమవారికే. గతంలో ప్రభుత్వబావులు గ్రామ పెద్దలకే మంజూరు అయ్యేవి. అది ప్రభుత్వబావి అనే విషయం ఎవరికీ తెలియకపోయేది. వారి కష్టార్జితంతోనే తవ్వించుకుంటున్నారని అందరూ అనుకునేది. (ఇప్పటికీ ఇందిరమ్మ గృహాలను కొందరు తమ కష్టార్జితం తోనే కట్టించుకుంటున్నట్లు నటిస్తున్నారు) ఆ రకంగా చూస్తే ఇది మెరుగైనదే. కనీసం ప్రభుత్వ పథకాలలో ఇంత డబ్బు వస్తున్నది, అది అధికారంలో ఉన్న వారికే చెందుతున్నది అనే విషయమైనా తెలుస్తున్నది. ఈ విధానం వలన అధికార పార్టీకి అనుకూలంగా ఉంటేనే సంక్షేమ పథకాలు ఇస్తారనే అవగాహన ప్రజలకు కలుగుతుంది. ఆ అవగాహనే ప్రజలు అధికారపార్టీ నాయకుల చుట్టూ తిరిగేలా చేస్తుంది.

సంక్షేమ పథకాల అమలులో చాలా అవకతవకలు జరుగుతున్నాయనేది పత్రికలలో చూస్తున్నాం. ఇవన్నీ బహిరంగ రహస్యాలే. తెలిసికూడా ఏమీ అనలేని పరిస్థితి. అన్నా ఏమీ పట్టించుకోని పరిస్థితి. ఇలా జరగకపోతే ఇంకెలా జరుగుతుంది అనే భావన ఏర్పడింది. సంక్షేమ పథకాలు ప్రవేశపెట్టేవారికీ, అమలు చేసేవారికీ ఇలా జరుగుతోందని తెలుసు. తెలియదు అనుకోవడం అమాయకత్వమే అవుతుంది.

ఇందిరమ్మ గృహాల పంపిణీలో వీరు ఇచ్చే బిల్లు రెండు గదుల నిర్మాణానికి సరిపోదు అనేది సర్వత్రా వినిపించే మాట. మేము ఇచ్చే ప్లాన్ ప్రకారంగా నిర్మిస్తే సరిపోతుందని ఇంజనీర్ల వాదన. సాధారణంగా గ్రామాలలో ప్రజలు కట్టుకునే ఇండ్లకు పథకాల ద్వారా వచ్చే ఇండ్లకు వేరువేరు ప్లానులు ఎందుకు ఉంటున్నాయి? ఇవ్వలేదు అనకుండా ఇచ్చే విధానం వలన వేరువేరు ప్లానులు ఉంటున్నాయి. ఎవరి వాటా వారికి పోగా, ఎక్కడి ఖర్చులు అక్కడ పోగా వీరి చేతికి వచ్చే దానితో నిర్మాణం జరగదు. వచ్చే డబ్బుతోనే ఇల్లు కట్టాలనుకునే వారికి ఇల్లుకట్టక ముందే ఇంటిజాగా కూడా అమ్ముకోవలసి వస్తుంది. ఇందిరమ్మ గృహాలు ప్రకటించిన తరువాత తొంబై రూపాయలు ఉన్న సిమెంట్‌బస్తా ధర రెండు వందల రూపాయలైంది. ఇసుక, ఇనుము, ఇటుక రేట్లు కూడా పెరిగాయి.

ఇందిరమ్మ గృహం మంజూరు కావాలంటే దారిద్ర్యరేఖకు దిగువన (బిపిఎల్) ఉండాలి. అంటే పదకొండు వేల రూపాయల ఆదాయం వరకు మాత్రమే ఉండాలి. గ్రామాలలో జీతం ఉండే వారికి కూడా అంతకంటే ఎక్కువ జీతం ఉంటుంది. అందువల్ల గ్రామాలలో అర్హులే ఉండరు అంటున్నారు చాలామంది. వీటికి దళిత, లంబాడీ వర్గాలకు చెందినవారే అర్హత కలిగి ఉంటారు. కాని ఇవి ఎంతో కొంత ఆర్థికంగా వెసులుబాటు ఉన్నవారికే మంజూరవుతున్నాయని ఆ పట్టికలను చూసిన వారికి అర్థమవుతుంది.

ప్రభుత్వం ఎప్పుడూ ఏదో ఒక సర్వే చేపడుతుంది. అందులో బి.పి.ఎల్. సర్వే కూడా ఒకటి. బి.పి.ఎల్.కు సంబంధించిన సర్వే చేసినప్పుడు ఒక గ్రామానికి సంబంధించిన వారి వివరాలన్నీ సేకరిస్తారు. దారిద్ర్య రేఖకు అట్టడుగున ఉన్నవారికి ఇందిరమ్మ గృహాలను మంజూరు చేయాలి. అలా చేస్తే కౌన్సిలింగ్ విధానంలో బదిలీలు చేసినప్పుడు

అధికారులు, రాయకీయనాయకులు, అధికార పార్టీ నాయకులు కూడా ప్రేక్షకపాత్ర వహించాల్సి ఉంటుంది. అర్హులకు పథకాలు అందుతాయి. కానీ బి.పి.ఎల్. సర్వేలు ఏవీ ఇక్కడ పని చేయవు. ఇండ్ల మంజూరీ లిస్టులో బి.పి.ఎల్. వర్తించని వారి పేర్లు కూడా ఉంటాయి. సమాచార హక్కు అనడమే కానీ ఈ లిస్టులు ఇవ్వనే ఇవ్వరు. ఒకవేళ ఇచ్చినా సరైన లిస్టులు ఇవ్వరు.

ఇందిరమ్మ గృహాల పంపిణీలో కొన్ని విధానాలు పాటిస్తున్నారు. ఇల్లు ఇవ్వడం వలన వారి నుండి ఎక్కువ ఓట్లు వస్తాయా లేదా అని చూడడం జరుగుతోంది.

గ్రామాలలో అధికారపార్టీ వారిని నిలదీయగల, విమర్శ చేయగల నోరున్న వారు కొందరుంటారు. వారిలో రాజీ వైఖరి కూడా ఉంటుంది. వారికి సంక్షేమ పథకాలలో ఏదో ఒకటి మంజూరు చేయడం జరుగుతుంది. అలా చేయడం వలన వారు నిలదీయడాన్నీ, విమర్శించడాన్నీ మానుకోవడం జరుగుతుంది.

గ్రామాలలో నాయకత్వ లక్షణాలు ఉండి ఎంతో కొంత మందిని కూడగట్టుకొని, రెండవశ్రేణి నాయకులుగా ఎదిగే అవకాశం ఉన్నవారు ఉంటారు. ప్రతి పార్టీలో ఇప్పటి పరిస్థితిని బట్టి రెండు గ్రూపులు ఉన్నాయి. అధికారపక్షంలో ఉన్నవారు తమ వ్యతిరేక గ్రూపులో ఉన్న నాయకులనూ, ప్రతిపక్షంలో ఉన్న నాయకులనూ ఎదగకుండా చేయడం కోసం, వారితో కలిసి తిరిగేవారిని, వారి ఇండ్లచుట్టూ ఉండే వారిని చేరదీసి వారికి ఇలాంటి గృహాలు ఇవ్వడం జరుగుతుంది. దీనివలన ప్రతిపక్షంలో ఉన్నవారు అధికారపక్షం వైపు మారడం జరుగుతుంది. రెండవ శ్రేణి నాయకులకు, ప్రతిపక్ష నాయకులకు తమపక్షం వారు అధికారపక్షం వైపు వెళ్లవద్దని ఉంటుంది. కాని సంక్షేమ పథకాల ఎరవలన అధికార పక్షంవైపు వెళ్లడం జరుగుతుంది. దానితో ప్రతిపక్ష నాయకుల అభివృద్ధి ఆగిపోతుంది. అది ఎప్పుడో ఒకప్పుడు ఘర్షణకు దారితీస్తుంది. ఇక్కడ అనివార్యంగా ఒక పరిస్థితి ఏర్పడుతుంది. రెండవ శ్రేణి నాయకులు సంక్షేమ పథకాల మంజూరీలో జరుగుతున్న మోసపు ఎత్తుగడలను ప్రజలకు వివరించవలసి ఉంటుంది. అలా వివరించ లేకపోతే వారు నాయకులుగా ఎదగలేరు. వివరించి ప్రజలను చైతన్యం చేయగలిగితే అధికారపక్ష నాయకులకు రాజకీయ సన్యాసం తప్పదు. రాజకీయంగా నిలదొక్కుకున్న వారు ప్రజలను చైతన్యం కానివ్వరు. పొదిగే గుడ్లమీద నుండి కోడిని తీసివేసే లాంటి ప్రయత్నం చేస్తారు. కొత్తగా ఎదిగే నాయకులు ప్రజలను చైతన్యవంతులను చేయడానికి ప్రయత్నించాలి. ఈ క్రమంలోనే రాజకీయ ఘర్షణలు జరుగుతాయి.

అలా పోగా మిగిలినవి అధికార పార్టీకి సంబంధించిన వారు పలుకుబడి మేరకు పంచుకోవడం జరుగుతుంది. వీటిలో బినామీ పేర్లతో బిల్లులు ఎత్తుకోవడం, ఇల్లు కట్టకుండానే బిల్లు ఎత్తుకోవడం, ఒక్కరే ఎక్కువ ఇండ్లు తీసుకోవడం లాంటివి ఎన్నో ఉంటాయి. ఇవన్నీ నాయకులను ఆర్థికంగా బలోపేతం చేసుకోవడం కొరకేనని అంటుంటారు. బలోపేతం కావడం వలన బాగా పని చేస్తారు అంటారు.

ఇందిరమ్మ గృహాలలోనూ అవినీతి గురించి ఎన్నోవార్తా కథనాలను చూశాం. వాటి ఫలితంగా గ్రామాలకు పరిశీలనా బృందాలను పంపడం జరిగింది. అవి మాత్రం సక్రమంగా విషయసేకరణ చేయగలవా? వీటి వలన ప్రయోజనం ఉండదని బృందాలు రాకముందే అనుకోవడం జరిగింది.

ఇందిరమ్మ గృహాలలోనూ, మరుగుదొడ్ల మంజూరిలోనూ, మిషన్లు, గొర్లు, బర్ల పంపిణీలోనూ అధికారపార్టీ నాయకులను ఆర్థికంగా బలోపేతం చేసే విధానాలే ఉన్నాయి. బి.పి.ఎల్. సర్వేలు ఎక్కడో మూలన పడుతున్నాయి. ఇప్పుడు ప్రజలలో మాత్రం ఒక అవగాహన వచ్చింది. అధికారమంటే డబ్బులకుప్ప అని గెలిచిన వారంతా ఆ కుప్పను అనుభవించడానికి హక్కును పొందినట్లని అనుకోవడం జరుగుతోంది. ఆ డబ్బును ప్రజల కోసమే ఖర్చు పెట్టాలి కాని వారే కాజేస్తున్నారని అనుకుంటున్నారు. మంచి వాళ్లనే ఎన్నుకోవచ్చు కదా అంటే, కుర్చీ ఎక్కిన తరువాతనే వారి అసలు స్వభావం తెలుస్తున్నది. కుర్చీ దిగిన తరువాత మంచివారుగా మారినట్లు చెప్పుకుంటున్నారు. తిరిగి కుర్చీ దక్కగానే యథావిధిగా చేస్తున్నారు. వీరికంటే వారే నయం అనే విధంగా పరిపాలన ఉంటున్నదని అంటున్నారు.

ఇవ్వకుండానే ఇచ్చినట్లు చేయగలగడం, పెట్టకుండానే పెట్టినంత మాట మాట్లాడడం అనేది సంక్షేమ పథకాలలో ఉంటున్నది. అంటే అసలు ప్రయోజనం ఉండదని కాదు. ప్రజలలో కొంతమందికి పాక్షిక ప్రయోజనం, నాయకులకు ప్రధాన ప్రయోజనం ఉంటున్నది. ప్రజలు ఈ విషయాలను గుర్తించారు. ముందే తయారు చేసిన సర్వేల ప్రకారమే పథకాలు అమలు జరపాలని ప్రజలు అనగలిగితే తప్ప దీనికి మరో పరిష్కారం ఉండదు. అలా అనగలగాలంటే ప్రజలు చైతన్యవంతులు కావాలి. ఎవరో ఒకరు చైతన్యవంతం చేయాలి. అప్పుడు చైతన్యం చేసేవారిపై అధికారపక్షం వారు భావజాలపరమైన అవసరమైతే భౌతికపరమైన దాడిచేస్తారు. అలాంటి దాడుల వలన కూడా ప్రజలు చైతన్యవంతం అవుతారు. కానీ అధికారపక్షం, ప్రతిపక్షం రాజీపడడం జరుగుతోంది. ◆

**వచ్చే సంచికలలో...**

- **ఫోకస్ - ఆంధ్రప్రదేశ్ చరిత్రలో సామాజిక ఉద్యమాలు (డిసెంబర్ 2007)**
- **ఫోకస్ - ఆంధ్రప్రదేశ్ గ్రామీణాభివృద్ధి (జనవరి 2008)**
- **సోషలిస్ట్ రిజిస్టర్ - ఒక పరిచయం - మానేపల్లి**
- **వరంగల్ జిల్లాలో ఇటుక బట్టీ శ్రామికుల స్థితిగతులు - ఒక పరిశీలన - బాసింగాల రాధాదేవి**
- **డీ రిజర్వేషన్లతో సామాజిక న్యాయం సాధ్యమా? - తోట సత్యనారాయణ, వరయోగుల వేంకటేశ్వర స్వామి**

లంబాడీల వివాహ పద్ధతిని వివరిస్తూ, ప్రపంచీకరణ క్రమంలో ప్రజల సంస్కృతి, సంప్రదాయాలు మాయమవుతున్నాయంటున్నారు **గుగులోతు విజయ, నాగారపు వెంకట్రావు**

# లంబాడీల వివాహ వ్యవస్థ ఒక పరిశీలన

ఆచార, సంప్రదాయాలు ప్రతిజాతి సంస్కృతికి మూలాధారాలు. ఇవి ఒక తరం నుండి మరొక తరానికి సంక్రమిస్తూ సామాజిక జీవితాన్ని నియమనిబంధనలతో నడిపిస్తుంటాయి. మానవులు నిత్య జీవితంలో అలవాటుగా చేసే పనులు, ఆ పనులలో అంతర్లీనమై ఉన్న నియమాలు, తరతరాలుగాఆచరించడం ద్వారా భావితరాలకు అందజేసే సాంస్కృతికరీతులు, విశిష్టతలు, ప్రత్యేకతలు, ఆచారాలకిందికి వస్తాయి. ఆచారాలు జీవితాన్ని అలుముకొని పరిపుష్ఠమై జాతి జీవన ప్రత్యేకతను ప్రదర్శిస్తాయి. మానవుడు సామాజిక జీవి. సమూహంగా బతకాలని, కలసి మెలిసి వ్యవహరించాలనుకుంటాడు. సమాజం సక్రమమైన బాటలో సాగటానికి కొన్ని హద్దులు, అదుపుల తూనికలో ఆచారాలను ఏర్పాటు చేసుకున్నారు.

సాంఘీకాచారాలు మానవుని సంఘ జీవితానికి సంబంధమైనవి. ఇవి అనేక తరాలనుండి వారసత్వంగా వస్తున్నాయి. మనం లంబాడీల జీవితాన్ని పరిశీలిస్తే వారు ఉత్తర భారతదేశంలో ఉండేవారని తర్వాత దక్షిణ భారతదేశానికి వచ్చారని చరిత్రకారులు వివరించారు. లంబాడీలు పూర్వం రాజపుత్ర వంశీయులనీ కారణాంతరాల వల్ల వారి నుండి విడిపోయి వృత్తికి వేషాన్ని భాషను, ఆచార వ్యవహారాలను కొంతవరకు మానుకొని ప్రత్యేక తెగగా ఏర్పడినారని తెలుస్తోంది. లంబాడీల వంశ చరిత్రలను పరిశీలిస్తే వీరు రాజస్థాన్‌లోని రాజపుత్ర వంశానికి చెందినవారనే అభిప్రాయం బలపడుతుంది. 'ఆంధ్రప్రదేశ్ గిరిజనులు' అనే వ్యాసంలో లంబాడీలు ఉత్తర భారతీయులని, వీరు రాజస్థాన్ నుండి ఇక్కడికి వచ్చి స్థిరపడి కాలానుగతంగా ఎదురైన ఎన్నో ఒడిదుడుకుల్ని ఎదుర్కొంటూ వచ్చారని తెలుస్తోంది. వీరు బహుళ ఉత్తర హిందుస్థానం నుండి మొగలాయి దండయాత్రలపుడు దక్షిణ హిందూ దేశానికి వలస వచ్చారని అభిప్రాయం. లంబాడీలు తమ మాతృభూమైన రాజస్థాన్ వదిలి వృత్తిరీత్యా వచ్చి మొగలు చక్రవర్తుల కాలంలో మొగలు సైన్యంతో ఉత్తరదేశం నుండి దక్షిణదేశానికి వచ్చారనీ, వీరు సైన్యానికి కావలసిన సరుకులు యుద్ధ సామాగ్రి ఎడ్లబండ్లపై సరఫరాచేసేవారనీ, బళ్లారి మొదలైన ప్రాంతాలలో స్థిర నివాసాలేర్పర్చుకున్నట్లు బళ్లారి జిల్లాలో లంబాడీలు చెప్పుకుంటారని తెలుస్తోంది.

లంబాడీల ఆచార, సంప్రదాయాలు పుట్టుక నుంచి గిట్టె వరకు జీవితాన్ని పెనవేసుకొని ఉంటాయి. మనిషి జీవితంలో జననం, జననానికి సంబంధమైన ఆచారాలు, వివాహ పద్ధతులు ప్రపంచంలోని ప్రతి సమాజంలో అనేక విధాలుగా ఉన్నాయి. లంబాడీల సమాజంలో కూడ ఎన్నో ఆచారాలున్నాయి. వచ్చినప్పుడు పక్కన 'ఒక్రా'ను పెడతారు. ఒక్రా అంటే చిన్న గోనే సంచిలో మెత్తని గడ్డి నింపి కుట్టిన దిండు. వారి పెళ్లికి సంబంధించిన కొన్ని పద్ధతులను ఇక్కడ చూద్దాం.

**పెళ్లి :** కుటుంబ వ్యవస్థకు 'పెళ్లి' ఒక ఘట్టం. ఇదే మానవుని వైవాహిక జీవితానికి నాంది. అంతేకాక కుటుంబ వ్యవస్థకు పునాది. సామూహిక, వైయక్తిక నైతిక విలువలను వివాహ వ్యవస్థ సంరక్షిస్తుంది. లంబాడీలు కూడ జీవితంలో పెళ్లికి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారు.

**గోత్రాలు :** లంబాడీల పెళ్లిలో ప్రప్రథమంగా గోత్రాలను పరిశీలిస్తారు. కొన్ని గోత్రాల వారు మరికొన్ని గోత్రాలవారితో వియ్యమందుకోకూడదనే నిషేధాలున్నాయి.

**నిశ్చితార్థం (సగాయి) :** పెళ్లి తంతులో వివాహ నిశ్చయం మొదటి మెట్టు. బంధుమిత్రుల సహాయంతో జాడలు తెలుసుకొని వారి సారథ్యంలోని వివాహ నిశ్చయానికి మార్గం ఏర్పడుతుంది. లంబాడీ భాషలో సగాయి అంటే తంబూలాదులు పుచ్చుకోవటం. దీన్నే బెల్లం తినడం అని కూడా అంటారు. వధూవరుల పక్షంవారు బెల్లం తిని సంబంధం కుదుర్చుకుంటారు. లంబాడీ స్త్రీలు పాటలు పాడతారు.

**సాడి కార్యం :** పెళ్లికి ముందు వారం రోజుల్లో ఆదివారం రోజు శుభముహూర్తమున 'సాడి' కార్యన్ని ప్రారంభిస్తారు. సాడి అంటే చీర అని అర్థం. కానీ ఇక్కడ సాడి కార్యం అంటే వరున్ని అలంకరించి వధువు ఇంటికి పంపించడం.

**వదాయి :** వదాయి అంటే బ్రాహ్మణులలో వడుగు విధంగా భావించవచ్చు. అయితే జంధ్యానికి వీరిలో ప్రాముఖ్యతలేదు. కొన్ని ఉపతెగలలో జంధ్యాన్ని కూడ ధరిస్తారు.

**బెల్లం పానకం (గోటా) :** లంబాడీలలో బెల్లపు పానకానికి అధిక ప్రాముఖ్యత ఉంది. ఏ కార్యమైన తండావారందరూ విందు, వినోదాన్ని సమానంగా అనుభవిస్తారు. తండా అంటే గుంపు. ఈ తండా జనానికి సరిపోయే బెల్లం, గసాలు, మిరియాలు, కొబ్బరి కుడకలు నీళ్ల కుండల్లో లేక బిందెల్లో వేసి నానబెడతారు. పాటలు పాడి ఆనంద అనుభూతులలో

తేలియాడతారు. వరుడు పెద్దలకు గోటాను వంగి మర్యాదగా అందిస్తాడు. ఇది వరుడు సహనానికి పరీక్ష. అది వీరిఆచారం. ఈ ఆచారాన్ని ఒకసారి వరుని ఇంట్లో మరొకసారి వధువు ఇంట్లో జరుపుతారు.

**పసుపు బొట్టు :** లంబాడీల పెళ్లిళ్లలో పసుపుబొట్టుకు ఇతర హిందువులు జీలకర్ర, బెల్లానికి ఇచ్చినంత ప్రాముఖ్యతనిస్తారు. ఓవైపు బాజా భజంత్రీలు మోగుతుండగా వరుని ఇంటి నుండి తెచ్చిన పసుపుకొమ్ముల్ని సానరాతిపై పసుపు చందనాన్ని తీస్తారు. ఈ చందనాన్ని కంచుపళ్లెంలో భద్రపరుస్తారు.

**దోరా భాందేరో :** హైందవ సంస్కృతిలో మూడుముళ్ల, ఏడడుగుల ఆచారం ఉంది. నాలుగువైపులా నాలుగు పోలు ముంతల కింద ధాన్యం పోసి మధ్యలో వధువును పీటమీద కూర్చొబెట్టి పోలు ముంతలకు ఏడు వరుసల దారం చుడతారు. ఏడుముళ్లు వేసి వధువు మెడలో వేస్తారు. ఆ తరువాత పోలు ముంతలు దగ్గరకు జరిపి వధువు కుడి పార్శ్వాన్ని వాటి మధ్యలో నుండి ఏడు వరుసల దారం చుట్టి ఏడు ముళ్లు వేసి వరుడు వధువు చేతికి కడ్తాడు. ఆ తర్వాత వరునికి కూడా ఇదే విధంగా రెండు మార్లు చేస్తారు. లంబాడీలు మూడు ముళ్లకంటే ఏడు ముళ్ల ఆచారాన్ని పాటిస్తారు. ఈ సమయంలో స్త్రీలు పాటలు పాడతారు. లంబాడీలలో కన్యాశుల్కం ఇవ్వడం ఆచారం. కన్యకు, ఆమె తల్లిదండ్రులకు వరుడు పశువులను, ధాన్యాన్ని కన్యాశుల్కంగా అర్పించుకుంటాడు. దీనినే లంబాడీలు 'భరోపురాకరార్' అంటారు. వధువు తల్లిదండ్రులకు నాలుగు కోడెలు 45 రూపాయలు ఇచ్చుకుంటారు. వధువుకు ఆమె తల్లిదండ్రులు కూడా పరికిణీ, కాంచళి (రవిక) మొదలైన దుస్తులను, ముక్కెరను, రూపాయల దండను ఒక తాంగిడిని (పెళ్లిలో పుట్టింటివారు వధువుకు ఇచ్చే గోనే సంచిని తాంగిడి అంటారు) ఇస్తారు. పశువుల రూపంలో కన్యాశుల్కాన్ని సమర్పించి పెళ్లి చేసుకొనే ఆచారం ఉంది. అదే విధంగా లంబాడీలలో కూడా కన్యాశుల్కం ప్రాచీన కాలం నుండి సంక్రమించిన సంప్రదాయం. పెళ్లి మండపాన్ని వాయర్‌హండి అంటారు. తొమ్మిది మూలలున్న చతురస్ర స్థలాన్ని కొలిచి నాలుగుమూల గుంజల మధ్యన రెండు రోకళ్లను పాతుతారు. ఈ స్థలాన్నే వాయర్‌హండి అంటారు. ఒక్కొక్క మూలలో ఆరుకుండలను, ఒక కంచుడును నాలుగుమూలలలో పెడతారు. వీటి పక్కనే జిల్లేడు, మోదుగ, మామిడి ఆకులను అమరుస్తారు. ఈ ఆకులు దుష్టశక్తులను, మంత్రతంత్రాలను అడ్డుకుంటాయని వీరి నమ్మకం.

**పెండకుప్పను మొక్కుట (ఒకోల్డి దోకెర్) :** ఒకోల్డి అంటే ఆవు పేడ. దోకెర్ అంటే మొక్కడం అని దీని అర్థం. అక్కడికి వధూవరులను తీసికెళ్లి స్త్రీలు పాటలు పాడతారు. అక్కడ ఒక మట్టి చిప్పలో గాజు మొలలు, పసుపు, కుడకలు మొదలైన పూజా సామాగ్రితో ఆవు పేడను పూజిస్తారు. పూజించడంలో ఓ విశేషముంది. చాలా కాలం నుండి గోసంపదయే వీరి జీవనాధారం. నేటికీ లంబాడీలు వేల సంఖ్యలో గోవులను పెంచుతూనే ఉన్నారు. ఈ విధంగా పూజించడం వల్ల గోసంపద పెరుగుతుందని వీరి నమ్మకం.

**వరుని దేహదారుఢ్య పరీక్ష :** వరుని దేహదారుఢ్యాన్ని, సహనాన్ని పరీక్షించటానికి కొన్ని కార్యక్రమాలు చేపడతారు. స్త్రీలు జిల్లేడు, మోదుగ కర్రలతో, రోకళ్లతో కొడుతూ మా కూతురిని బాధిస్తావా? బూతు మాటలు మాట్లాడుతావా? అంటూ ప్రశ్నిస్తారు. బావ మరుదులు చిన్న చిన్న రాళ్ళు చెవి దొప్పలో పెట్టి మా అమ్మ నాన్నని తిడతావా? మా చెల్లిని బాధిస్తావా అంటూ నలుపుతారు. ఎంత కొట్టినా, నలిపినా, అమ్మా నొప్పి అని నోట మాట రాకూడదు. వీటిని బట్టి వరుని శరీర పటుత్వాన్ని ఓర్చుకొనే శక్తిని పరీక్షిస్తారు. ఈ అవస్థలను భరించినవాడే వధువుకు సరియైన భర్తగా, పోషించే సమర్థునిగా నమ్ముతారు.

**పెరా :** పెరా అంటే రోకలి చుట్టూ ప్రదక్షిణం అని అర్థం. లంబాడీలు పెళ్లి పందిరిలో పాతిన రోకళ్ల చుట్టూ ప్రదక్షిణం చేస్తారు. లంబాడీ పురోహితుడు లేనిచో లంబాడీలలో తెలిసినవారు ఒకరు ఈ కార్యాన్ని జరిపిస్తారు. లంబాడీలు వరుని చేతిలో ఒక రుపాయి బిళ్ల పెట్టి వధువు చేతిని జోడించి ఐదుసార్లు వధువు వదినగారైనా లేదా మరొకరైనా తోడుగా మొత్తం ఏడుసార్లు ప్రదక్షిణం చేస్తారు. పెరుగన్నం తినిపించడం అంటే 'కోలయాకొల్లర్' అంటారు. ఒకే పళ్లెంలో కొంత పెరుగన్నాన్ని ఒక్కో ముద్ద భుజిస్తారు. ఆ తరువాత రెండో రోకలి వద్ద మిగిలిన పెరుగన్నం తింటారు. ఒకే చెంబులోని నీళ్లను ఇద్దరూ సేవిస్తారు. ఈ సమయంలో ఇతరుల దృష్టిపడకుండా వధూవరులపై దుప్పటి కప్పుతారు.

**చూడోతీపేర్ :** పెళ్లి అయిన మరునాడు చూడోతీపేర్ చేస్తారు. చూడోతీపేర్ అంటే వధువుని అలంకరించడం. స్త్రీలందరూ వధువుకు టోపిలీలు, గుగిరీలు, దండగాజులు, వాంకిడీలు, కసే మొదలైన అభరణాలు ధరిస్తారు. లంబాడీ స్త్రీలనగలు బరువుగా, పెద్దవిగా ఉంటాయి.

**ధావలో :** పెళ్లికి వారంరోజుల ముందు నుండే తండాలోని స్త్రీలందరూ కలిసి వధువుకు పంపక సమయంలో ఏడ్చే విధానాన్ని నేర్పుతారు. దీనినే ధావలో అంటారు. ఈ కార్యక్రమంలో మూడు విధానాలుంటాయి. ఏడ్పును నేర్పించే ఆచారాన్ని ధావలో అని, పంపక సమయంలో అందరిని కౌగలించుకొని ఏడ్వటం మళేరో అని. ఎద్దుపై నిల్చొని తన పుట్టింటివారు సుభిక్షంగా ఉండాలని కోరుకుంటూ పాడేపాటను 'దావేలి' అని అంటారు. ధావలో ఎంత కఠిన హృదయులైనా కరిగిస్తుంది. ఈ పాటలో వధువు పుట్టింటిలో తమ బాల్యాన్ని, తల్లిదండ్రుల ప్రేమానురాగాలను తలచుకొని దుఃఖించడం వలన తండాలోని వారందరికీ కంటనీరు పెట్టిస్తుంది.

**విందు (గోట్) :** గోట్ అంటే విందు అని అర్థం. పెళ్లి కుమారుడే ఇవ్వాలని ఆచారముంది. తండా జనాన్ని దృష్టిలో పెట్టుకొని మేకల్ని బలిస్తారు. రక్తాన్ని పాత్రలోపట్టి 'సాలోయ్' వండుతారు. సాలోయ్ అంటే చింతపండుపులుసు, ఉప్పు, రక్తం కలిపి తయారుచేస్తారు. సాయంత్రం అందర్ని బంతిగా కూర్చోబెట్టి సాలోయ్ వడ్డించి మత్తుపానీయాలు సేవిస్తారు. తరువాత భోజనం చేస్తారు.

**కుటుంబీకుల సేవ :** కన్యకు పెళ్లి పూర్తికావటంతో ఓ ఇంటి కోడలవుతుంది. అత్తమామలకు ప్రతిరోజూ సాయంత్రం వేడినీళ్లతో స్నానం చేయించాలి. అన్నపానాదులు క్రమపద్ధతిలో అందునట్లు జాగ్రత్తపడాలి. రాత్రి సమయంలో అత్తమామలకు కాళ్లు నొక్కడం వీరి ఆచారం. అన్న చనిపోతే అన్న భార్యను తమ్ముడు భార్యగా స్వీకరించడం తప్పని భావించరు.

వివిధ జాతులు, కులాలు ఉన్న మన సమాజంలో ఏ సమూహానికి ఆ సమూహం తమకంటూ ఒక ప్రత్యేక సంస్కృతీ, సంప్రదాయాలూ, ఆచారాలూ తరతరాలనుండి కాపాడుకుంటూ వస్తున్నప్పటికీ నానాటికి పెరుగుతున్న పట్టణీకరణ, ప్రపంచీకరణ క్రమంలో ఆయా గ్రామీణ సమూహాలు, గిరిజన సంస్కృతులు కనుమరుగయ్యే ప్రమాదం ఉంది. ◆

**లక్షల ఏళ్ళకింద ఆఫ్రికానుంచి ఖండాంతరాలు నడిచిన మనిషి ప్రస్థానాన్ని, పరిణామాన్ని వివరిస్తూ నడక, శ్రమల పాత్రను, వాటి అవసరాన్ని శాస్త్రీయంగా వివరిస్తున్నారు కొడవటిగంటి రోహిణీ ప్రసాద్**

# రెండు కాళ్ల మీద మానవ ప్రస్థానం

ప్రాణులన్నీ ఒకే కుదుటినుంచి పుట్టాయని మనకు తెలుసు. వీటిలో మనను ఏమాత్రమూ పోలనివీ, మనతో కొంత పోల్చదగినవీ, మనకు దగ్గర బంధువులనిపించే వానరాలూ ఇలా అనేకం ఉన్నాయి. ప్రపంచంలో 300 కోట్ల ఏళ్ల క్రితమే మొదట ఏకకణజీవులు పుట్టాయనీ, ఆ తర్వాత 53 కోట్ల ఏళ్ల క్రితం వరకూ బహుకణజీవులే ఆవిర్భవించ లేదని శాస్త్రవేత్తలు నమ్ముతున్నారు. ఏవో భౌతిక కారణాల వల్ల పెద్దపెట్టున బహుకణజీవులు పుట్టుకురావడం మొదలుపెట్టాక మొదటగా జలచరాలూ, తరువాత ఉభయచరాలూ ఆవిర్భవించాయనీ రాక్షసి బల్లులకు ముందూ, తరువాత చిత్ర విచిత్రమైన ఆకారాల్లో వివిధ జాతులు భూమి మీద తిరిగాయనీ సాక్ష్యాలు లభించాయి. కాలవ్యవధిలో ఈ తేడాలను సరిగ్గా అర్థం చేసుకోవాలి. నిర్జీవమైన భూతలం మీద మొదటి వంద కోటి సంవత్సరాల దాకా జీవకణాలే పుట్టలేదు. ఆ తరవాత ఎంతో కాలంపాటు ఏకకణ జీవులే ఉండేవి. 53 కోట్ల సంవత్సరాల కిందట రకరకాల బహుకణ ప్రాణులు ఆవిర్భవించిన నాటికి భూమీ, సూర్యుడూ పుట్టి 400 కోట్ల సంవత్సరాలు గడిచిపోయాయి. ఆ ప్రాణుల్లో వెన్నెముక కలిగినవి కొన్ని మాత్రమే ఉండేవి. వాటిలో కొన్ని నీటి నుంచి పొడినేల మీదికి పాకటం, సరీసృపాలూ, క్షీరదాలూ అంటూ తేడాలు ఏర్పడటం, క్షీరదాల్లో ప్రైమేట్ జాతి ఆవిర్భవించి అందులో నుంచి మనుషులు పుట్టుకు రావడం, ఇవన్నీ ప్రకృతిలో సహజంగా జరుగుతూ వచ్చిన మార్పులననుసరించి జరిగిన పరిణామాలు. ఈ లెక్కన చూస్తే మనిషి ఆవిర్భావం "ఇటీవలనే" జరిగినట్టు అనుకోవాలి.

మనిషి ఆవిర్భావం జరగడమే యాదృచ్ఛికం. అరున్నర కోట్ల ఏళ్ల క్రితం పెద్ద ఉల్కవంటిదేదో భూమిమీద వచ్చి పడగా రాక్షసిబల్లుల ప్రాబల్యం తగ్గిందనీ, క్షీరదాల ప్రాచుర్యం పెరిగిందనీ తెలుస్తోంది. పాలిచ్చి పిల్లలని పెంచే క్షీరదాల్లో ఎన్నెన్నో రకాలు తలెత్తాక చెట్లను అంటిపెట్టుకుని, తక్కిన ఇంద్రియాలతో పోలిస్తే కళ్లమీదనే ఎక్కువగా ఆధారపడి బతికే మర్కట జాతులు ఆవిర్భవించాయి. జీవపరిణామ దశలో వీటి తరవాత మనిషిజాతికి దగ్గరగా ఉండేవి వాలిడి కోతులు. కోతుల గుంపులు సామాన్యంగా పోట్లాడుకుంటూ, సంఘర్షణకు లోనవుతాయి. హోమినాయిడ్ జాతి ప్రాణులు అలా కాకుండా పరస్పరం సహాయం చేసుకుంటూ, సముదాయాలుగా జీవించసాగాయి. వాటి దేహాలు బలిష్ఠంగా, చేతులు కాళ్లకన్నా పొడుగ్గా, సున్నితమైన పనులు చెయ్యగలిగినవిగా రూపొందసాగాయి. అన్నిటికన్నా ముఖ్యమైనది ఈ మార్పులవల్ల మెదడులో కలిగిన అభివృద్ధి. ఈనాటికీ చింపాంజీలూ, గొరిల్లాలూ ప్రవర్తనలో కోతుల కంటే మనుషులకు దగ్గరగా అనిపిస్తాయి. ఇవి కోతుల్లాగా శాకాహారానికి పరిమితం కావు. భాష లేకపోయినా రకరకాల శబ్దాలతో సంకేతాలు పంపగలవు.

మనకూ, కోతులకూ, తోకలులేని గొరిల్లావంటి వాలిడి కోతుల పుట్టుకకు దారితీసిన ఆంత్రోపాయిడ్ ప్రైమేట్‌లు సుమారు 5 కోట్ల సంవత్సరాల కిందట తమ శారీరక లక్షణాల్లో ప్రత్యేకత సంతరించు కున్నాయి. చెట్లమీదనే జీవించే ఈ క్షీరదాలు తక్కినవాటికి భిన్నంగా, మెరుగైన చూపునూ, లాఘవంగా కదలగలిగిన అవయవాలనూ సాధించుకున్నాయి. వీటన్నిటికీ సంబంధించిన మెదడు భాగాలుకూడా అభివృద్ధి అవుతూవచ్చాయి. కొన్ని పరిస్థితుల్లో తప్ప ఈ లక్షణాలు మారవలసిన అవసరం ఏర్పడకపోవడంతో రకరకాల కోతులూ, వానరాలూ తామున్న స్థితిలోనే విజయవంతంగా కొనసాగాయి. ప్రతికూల వాతావరణమో, మరొక ఒత్తిడో ఎదురైనప్పుడే జీవ పరిణామానికి ప్రేరణ కలుగుతుంది. అటువంటి కారణాల వల్ల కోతులకు భిన్నమైన హోమినాయిడ్ జాతి 25-50 లక్షల సంవత్సరాల క్రితం ఏర్పడింది.

కోతులు, వానరాల్లో ముక్కు కింది వైపుకు వంగి ఉండే ఒక జాతి ఏర్పడింది. వాసనపై తక్కువగా ఆధారపడిన ఈ జాతి నిశ్చయంగా మానవుల పుట్టుకకు కారణమైంది. ఈ ప్రాణుల శరీరభాగాల శిలాజాలు దొరికాయి. ఈ శిలాజ శకలాలని బట్టిచూస్తే నరవానర (ఏప్), మనిషి లక్షణాలు రెండూ ఉన్నట్టు అనిపిస్తోంది. వారి చర్మం ఏ రంగులో ఉండేదో, ఎన్ని వెంట్రుకలు ఉండేవో, ఆహార సేకరణ ఎలా జరిగేదో, సముదాయాలు ఎలా బతికేవో వగైరా వివరాలు తెలియవు కాని ఈనాడు కనబడే చింపాంజీల వంటివాటిని గమనించి శాస్త్రవేత్తలు అనేక విషయాలు ఊహించగలుగుతున్నారు. ముఖాల ఆకారంలోనూ, ప్రవర్తనలోనూ, మెదడు పరిణామంలోనూ, ఒంటిమీద రోమాల విషయాంలోనూ వారు చింపాంజీలను పోలి ఉండవచ్చు.

జన్యుపరంగా చింపాజీలకూ, మనకీ 98.5 శాతం పోలికలున్నాయి. దీనర్థం మనకవి పూర్వీకులని కాదు. ఈ రెండు జాతులూ ఒకే కుదుటి నుంచి పుట్టాయని. చింపాజీలతో పోలిస్తే ఒరాంగుటాన్‌లు మనకు కాస్త దూరపు బంధువులే. ఇవన్నీ మనలాగే సముదాయాలుగా, గుంపులుగా, ఒకదానికొకటి సహకరిస్తూ బతికే జీవులు. తక్కిన జంతువుల కన్నా తెలివైనవి. మెదడూ, నాడీమండలమూ అభివృద్ధి అయిన లక్షణాలు కలిగినవి. ఈ వాలిడి కోతులు మునుపు ఎప్పుడో ఒక శాఖగా చీలిపోయి, మనుషులు సాధించిన జీవపరిణామాన్ని అందుకోలేకపోయాయి. జీవపరిణామం అనేది అప్పుడెప్పుడో జరిగి ఆగిపోయిందా? ఈనాడు కోతులు వాలిడికోతులు గానూ, వాలిడికోతులు మనుషులుగానూ

మారటంలేదేం? అని కొందరికి అనుమానాలు కలుగుతాయి. ఒక్కొక్క జీవావరణం, లేక బయోస్ఫియర్‌లో తమ లక్షణాలను మార్చుకోకుండా బతకగలిగిన ప్రాణులు యథాస్థితిలో కొనసాగుతూ ఉంటాయి. అందుచేతనే మనకు దగ్గరివీ, కానివీ అనిపించే రకరకాల జంతువులు ఈనాటికీ కనిపిస్తూనే ఉంటాయి.

సుమారు 60 లక్షల సంవత్సరాల క్రితం ఆధునిక మానవజాతికి పూర్వీకులనదగిన ప్రాణులు నరవానరాలవంటి జంతువుల నుంచి వేరుపడ్డట్టు తెలుస్తోంది. రెండు కాళ్లతో నడవడం, చేతులతో ఇతర పనులు చేసుకోవడం, రకరకాల ఆహారం తినడం, లైంగిక కార్యకలాపాలకు కేవలం వాసనలపైనే కాకుండా మెదడూ, సామాజిక నియంత్రణలపై ఆధారపడడం మొదలైనవి మానవుల పూర్వీకుల లక్షణాలు. తొలిరోజుల్లో వీటిలో అనేక జాతులు ఏర్పడ్డాయి. వీటిలో అతి ప్రాచీనమైన ఆస్ట్రలో పితెకస్ జాతికి చెందినవి తూర్పు, దక్షిణ ఆఫ్రికా ప్రాంతాల్లో ఉన్నట్టు సాక్ష్యాలున్నాయి. అప్పటి ప్రాణుల ఎముకలూ, అవి, లేదా వారు తయారు చేసుకున్న పనిముట్లే అందుకు దాఖలాలు. 40 లక్షల సంవత్సరాలకు మునుపే ఈ ప్రాణులు మనలాగా కాస్త నిటారుగా నిలబడి రెండుకాళ్ల మీద నడిచేవి.

ఇందుకు అవసరమైన శారీరక మార్పులు జరిగాయి. కటి ఎముక వాలిడికోతులకన్నా, పొట్టిగా, వెడల్పుగా తయారైంది. అందువల్ల జఘనభాగపు కండరాలు నడుస్తున్న శరీరాన్ని అదుపులో ఉంచగలిగాయి. కటిభాగం గిన్నెలాగా ఉండడంతో నిటారుగా నిలుచున్నప్పుడు కడుపు లోపలి భాగాలకు తగిన ఆధారం ఏర్పడింది. నడుముకు కింద కాళ్లు లోపలి వైపుకు వంపు తిరిగాయి. ఇందువల్ల నిలువుగా నడుస్తున్నప్పుడు మోకాళ్లు తగిన ఆధారాన్నిస్తాయి. చింపాంజీలవంటి వాలిడికోతులకు నడుము నుంచి కాళ్లు తిన్నగా దిగుతాయి. అందుచేత అవి రెండు కాళ్ల మీద నడిచినప్పుడు శరీరం పక్కలకు ఊగుతుంది. ఆస్ట్రలో పితికస్ జాతివారికి కాలివేళ్లు పొట్టివిగా తయారై, నడిచేటప్పుడు నేలను వెనక్కి నెట్టడానికి పనికొచ్చాయి. ఇదంతా నడవగా, నడవగా కండరాలు పెరిగినట్టుగా జరగలేదు. ఒక్కొక్క తరంలోనూ యాదృచ్ఛికంగా జరిగిన ఈ రకమైన జన్యు పరిణామాలు బలపడేందుకు ఆస్కారం క్రమంగా పెరిగింది.

ప్రాచీన యుగంలో ఆస్ట్రలో పితెకస్ జాతి తక్కిన నరవానరాల నుంచి వేరు పడటానికి పర్యావరణంలో కలిగిన మార్పులే ముఖ్య కారణమని ఊహిస్తున్నారు. 80 నుంచి 50 లక్షల సంవత్సరాల క్రితం ప్రపంచవ్యాప్తంగా వాతావరణం చల్లబడి పొడిగా మారింది. తూర్పు ఆఫ్రికాలో అడువులు అక్కడక్కడా పలచబడటంతో కొన్ని ఏప్ (నరవానర) జాతులు పశ్చిమాన దట్టమైన అడవుల్లో ఉంటున్న తమ జాతి నుంచి వేరయ్యాయి. పెద్ద మైదాన ప్రాంతాల్లో ఉండవలసివచ్చిన ఈ ప్రాణులకు మార్పు తప్పనిసరి అయింది. చెట్ల రక్షణ కరువైన పరిస్థితిలో ఇవి పెద్ద సముదాయాలుగా ఏర్పడి, మైదానాల్లో ఆహార సేకరణకూ, క్రూరమృగాల వాతబడకుండా ఉండేందుకూ పాటు పడవలసి వచ్చింది. వీటికి రెండు కాళ్లమీద నడవడం, పరిగెత్తడం, ముందుకాళ్లను చేతులుగా ఉపయోగించుకోవడం లాభించింది. ఇక్కడ "లాభం" అంటే ప్రాణాలు దక్కడం, తమ లక్షణాలను కలిగిన సంతానాన్ని పొందడం అనుకోవాలి. "నష్టం" అంటే మరణం, తమ లక్షణాలు కలిగిన సంతానం రూపుమాసి పోవడమే.

మొత్తం మీద చెట్లనుంచి దూరమైన పరిస్థితిలో తప్పనిసరి అయిన రెండుకాళ్ల నడక మానవ లక్షణం అయింది. దీనివల్ల ఆలోచనా శక్తి, పరస్పరం సమాచారం అందించుకునే సామర్థ్యమూ పెరిగాయి. ఒకవేళ ఏదైనా ఒక ప్రాణికి ఈ నేర్పు కొరవడితే అది చచ్చిపోయి, దాని లక్షణాలు ఉన్న సంతానం సోదిలోకిలేకుండా పోయింది. జీవ పరిణామం ఇటువంటి ఒత్తిడి ఉన్నంతకాలమూ ఒకేదిశగా సాగుతుంది కనుక మనిషిజాతి లక్షణాలు కొన్ని ప్రాణుల్లో బలపడుతూ వచ్చాయి. "భగవంతుడి లీల" ఎటువంటిదో కాని మనిషి ఆవిర్భావానికి తోడ్పడినవి అప్పట్లో ఎండిపోతున్న అరణ్యాలు మాత్రమేనని పరిశోధనలు తెలియజేస్తున్నాయి. ఈ "లీల" పౌరాణిక సినిమాల్లో చూపినట్టుగా అకస్మాత్తుగా కాకుండా లక్షల సంవత్సరాలపాటు అతి నెమ్మదిగా జరిగింది.

తొలి మానవులు చెట్లనుంచి పూర్తిగా దూరం కాలేదనీ, రకరకాల ప్రకృతి వైపరీత్యాలకు గురి అవుతూ రకరకాల ప్రాంతాల్లో తలదాచుకున్నారనీ ఒక ప్రతిపాదన ఉంది. ఆ కారణంగా ఆస్ట్రలో పితెకస్ జాతివారు రెండు కాళ్ల నడకతోబాటు చెట్లు కూడా ఎక్కగలిగేవారని ఈ సిద్ధాంతం చెపుతుంది. చేతులు ఖాళీ అవడంతో ఆహారాన్నీ, పనిముట్లనూ మోసుకెళ్లే వీలు కలిగింది. ఈ రాతి పనిముట్లు వేటాడటానికి ఉపయోగించలేదు. పెద్ద మృగాలు చంపి తినగా మిగిలిన మాంసాన్ని గిల్లుకు తినేందుకు ఈ జీవులు పనిముట్లను తయారు చేసుకున్నారు. ఇది అప్పటిదాకా ఏ ప్రాణీ చెయ్యనటువంటి పని. ఇందుకు తగినట్టుగా వారి మెదడు పెరగసాగింది.

నిటారుగా నిలుచోగలిగిన ఈ జీవులు ఎత్తుగా పెరిగిన రెల్లు దుబ్బల పైనుంచి కూడా క్రూరమృగాల రాకను గుర్తించగలిగారు. చేతులతో ఆయుధాలను పట్టుకోవడం, నేలమీదా, చెట్ల కొమ్మలమీదా లభించే ఆహారాన్ని అందుకోవడం వీలయింది. చింపాంజీలు కూడా రెండు కాళ్లమీద నడవగలవు కాని ఎక్కువ దూరం పోలేవు. ఎంత దూరమైనా నడవడం, అవసరమైనప్పుడు చెట్ల చాటుకు పరిగెత్తి, చెట్లెక్కి ప్రాణాలు కాపాడుకోవడం ఇవన్నీ ఆస్ట్రలో పితెకస్ జాతివారు నేర్చారు. తమ మనుగడ పూర్తిగా ఇలాంటి సామర్థ్యంపైనే ఆధారపడటంతో ఈ మార్పులు అతి వేగంగా, విజయవంతంగా జరిగాయి. దుర్భరమైన పరిస్థితులను ఎదుర్కొంటూ మానవజాతి పురోగతికి మార్గం కలిగించారు.

ఈ విధంగా సుమారు 60 లక్షల సంవత్సరాల కిందట మానవజాతి ఆవిర్భావానికి దారితీసిన జాతి ఒకటి దక్షిణాఫ్రికా ప్రాంతంలో రూపొందింది. ఈ ప్రాణుల ముఖ్య లక్షణాలు రెండు కాళ్ల నడకా, చిన్న చిన్న కోరపళ్లూను. తరువాత ఈ జాతి ఆఫ్రికాలోని తక్కిన ప్రాంతాలకు వ్యాపించింది. ఈ పరిణామాల కారణంగా 40 నుంచి 20 లక్షల సంవత్సరాల కిందట మనుషులకు పూర్వీకులైన ఆస్ట్రలో పితెకస్‌జాతి ప్రాణులు జీవించినట్టు శిలాజాలు తెలుపుతున్నాయి.

చాలా విషయాల్లో ఆస్ట్రలో పితెకస్‌జాతి ప్రాణులు వానర లక్షణాలు కలిగి ఉండేవారు. కురచైన నుదురూ, పొడుచుకొచ్చిన ముఖమూ, చింపాంజీలతో సమానమైన నాలుగైదు వందల ఘన సెంటిమీటర్లకు మించని మెదడు పరిణామమూ, ఇలా చూస్తే బహుశా కాస్త ఉన్నతజాతి వానరాల్లాగే కనబడేవారేమో. శరీరపు బరువు కూడా యాభై కిలోలకు మించకుండా, ఎత్తు అయిదడుగులలోపు ఉండేది. కొన్ని జాతుల్లో గొరిల్లాలూ, ఒరాంగుటాన్‌లలాగే మగ ప్రాణులు ఆడవాటికన్నా భారీగా ఉండేవి. చేతి వేళ్లు నరవానరాల కన్నా కాస్త పొట్టిగానూ, బొటనవేలు మాత్రం పొడుగ్గా అటూ ఇటూ తిరగ గలిగేవిగా ఉండేవి. వారిలో అప్పటిదాకా మరే ప్రాణిలోనూ కానరాని మార్పు రెండుకాళ్ల మీద నడవడమే. ఈ ఒక్కటే ఎన్నెన్నో పరిణామాలకు కారణమైంది. మనకీనాడు అలాంటి ప్రాణి కనబడితే అదేదో తెలివైన వాలిడి కోతి అనుకుంటామేమో.

నరవానరాల్లాగా తిన్నగా ఉండక వెన్నెముక "క" అక్షరంలాగా

వంపు తిరగడంతో ఆస్ట్రలో పితెకస్ జాతి ప్రాణుల మొండెం కురచగా తయారైంది. శరీరాలు దృఢంగా, నిలువుగా తిరగటానికి వీలుగా ఉండేవి. నిలుచున్న తీరుకు అనుగుణంగా వెన్నుపాము పుర్రెలోకి చొరబడే స్థలం కూడా నరవానరాలకు భిన్నంగా ఉండేది. ఏప్ నరవానరాలకు కొరకడానికీ, భయపెట్టడానికీ పెద్ద పెద్ద కోరపళ్లుంటాయి. ఆధునిక మానవులకన్నా పెద్దవే అయినా, 40 లక్షల సంవత్సరాలనాటి ఆస్ట్రలో పితెకస్ జాతికి కోరపళ్లు చిన్నవిగా మారాయి. సముదాయాలుగా పరస్పరం సహకరిస్తూ బతికిన మగ జంతువులకు ఒకదాన్నొకటి భయపెట్టవలసిన అవసరం తగ్గింది.

క్రమంగా వీటిలో ఏడెనిమిది జాతులు ఏర్పడ్డాయి. 12 లక్షల సంవత్సరాల కిందట దృఢకాయంతో ఒక ఆస్ట్రలో పితెకస్ జాతి తయారైంది. ఈ జాతివారికి శాకాహారాన్ని బాగా నమిలి తినే పెద్ద దంతాలుండేవి. అప్పట్లో పుష్కలంగా లభించే ఆహారం తినడానికి అటువంటి "అభివృద్ధి" జరిగి ఉంటుంది కాని అది ఆధునిక మానవులు రూపొందేందుకు పనికిరాలేదు. మానవజాతికి తరవాతి యుగంలో ముఖ్య లక్షణాలైన అవగాహనా, ముందాలోచనా, ఊహాశక్తి మొదలైనవి ప్రతికూల పరిస్థితులు ఎదురుకావడంతో అబ్బిన గుణాలు.

ఉన్న పరిస్థితులకు అనువుగా రూపొందిన లక్షణాలన్నీ భవిష్యత్తులో ఉత్తమ జీవ పరిణామానికి దారితీస్తాయనే నమ్మకం ఏమీ లేదు. జీవపరిణామంలోని విచిత్రమైన అంశం అదే. ఏ ఒక్క యుగంలోనైనా ఉన్నంతలో జన్యుపరంగా బాగా బలపడి, సంతానాన్ని అభివృద్ధి చేసుకోవడానికే ప్రాణులన్నీ ప్రయత్నిస్తూ ఉంటాయి. ఈ ప్రక్రియలో వాటి ప్రభావం ఇతర జీవరాశి మీదా, ఇతర జీవాల ప్రభావం వాటిమీదా పడుతూ ఉంటుంది. మధ్యలో ప్రకృతి వైపరీత్యాలు ఉన్న పరిస్థితులని తారుమారు చేసి ఉపద్రవాలు తెచ్చిపెడుతూ ఉంటాయి. పరిణామాన్ని ముందుకు నెట్టేవి అవే. ఆపదలని అధిగమించడానికి కొత్త శరీరలక్షణాలు బలపడక తప్పదు. వాటిలో ఏది నిలుస్తుందో, ఏది పనికిరానిదో ప్రకృతే నిర్ణయిస్తుంది. ఈ మార్పులకు ఒక నిర్దిష్టమైన 'ప్రణాళిక' అంటూ ఉండదు కనుక జీవపరిణామం ఏప్పటికప్పుడు అనుకోని మలుపులు తిరుగుతూ ముందుకు సాగుతుంది.

కారణాలు ఏవైనప్పటికీ కొన్ని లక్షల ఏళ్లు ఆఫ్రికా అంతా పెరిగిన ఆస్ట్రలో పితెకస్ జాతి ఆ తరువాత అంతరించిపోయింది. వీరికన్నా పెద్ద మెదడుతో ఆవిర్భవించిన హోమో ఎరెక్టస్ జాతి ప్రజలది పైచెయ్యి అయింది. సుమారు 18 లక్షల సంవత్సరాల కిందట ఆవిర్భవించిన ఈ కొత్త జాతి 30 వేల సంవత్సరాల కిందటిదాకా బతికింది.

నరవానరం స్థాయినుంచి, ఆధునిక మానవజాతి ఆవిర్భావం దాకా జరిగిన సంఘటనలను గురించి సరిగ్గా అర్థం చేసుకోవాలి. ఒక యుగమో, ఒక జాతి ప్రజలో అంతరించగానే అందులోనుంచి కొత్త జాతి పుట్టుకొచ్చిందని భావించకూడదు. ఒక్కొక్క ప్రాంతంలో పరిస్థితులని అనుసరించి మనిషిజాతులు అనేక మార్పులు సంతరించుకుంటూ వచ్చాయి. తరువాతి కాలంలో అంతరించనున్న ప్రజలు ఇతర 'మెరుగైన' ప్రజలకు సమకాలికులుగా వేల ఏళ్లపాటు జీవిస్తూనే ఉండేవారు. విశాలమైన ప్రపంచంలో అప్పుడప్పుడూ అరుదుగా తారసపడి పరస్పరం సంఘర్షించినప్పటికీ ఒకజాతి మరొకజాతిని రూపు మాపేసిందనడానికి రుజువులేమీ కనబడవు. అంతకంతకూ వనరుల కోసం పోటీ పెరిగిన మాట నిజమే అయినా ఒక జాతి అంతరించడానికీ, మరొకటి పెంపొందడానికీ ప్రకృతిలోని పరిస్థితులే కారణం అవుతూవచ్చాయి. ఇవి ఆధునిక యుగంలో ఆటవిక జాతులు తమ అలవాట్లని మార్చుకుని నాగరికులైనట్టుగా జరిగిన మార్పులు కావు. ఆస్ట్రలో పితెకస్, హోమో ఎరెక్టస్ మొదలైనవి వేరు వేరు జాతులు. నిన్న మొన్నటిదాకా శాస్త్రవేత్తలు హోమో ఎరెక్టస్ జాతినుంచి ఆధునిక మానవజాతి పుట్టిందని భావించేవారు కాని ఆధునిక మానవులు తూర్పు ఆఫ్రికాలో మరొక విడి పాయగా రూపొంది హోమో ఎరెక్టస్ జాతికి సమకాలికులుగా ఉన్నారని ఊహిస్తున్నారు.

జంతువులతో పోలిస్తే మనిషికి ప్రత్యేకత కలిగించే లక్షణాలు చాలానే ఉన్నాయి. మేధాశక్తిలోనూ, సాంఘిక పరిణామంలోనూ జంతువుల్లో మనిషికి సాటి రాగలిగినవి చాలా తక్కువ. జీవ పరిణామ క్రమంలో మనిషికి అబ్బిన ప్రత్యేకతలన్నీ దాదాపు ఒకేసారి రూపొందాయి. రెండు కాళ్లమీద నడవగలగడం, పనిముట్లు చేసుకోవడం, ముందాలోచనతో వ్యవహరించడం మొదలైన విశేషశక్తులన్నీ కలిసి ఏర్పడ్డాయి. దీనివల్ల కొన్ని అనుకోని మార్పులు జరిగాయి.

వీటన్నిటికీ కారణం ఒకటే; లక్షలాది సంవత్సరాల క్రితం భౌగోళిక పరిస్థితుల్లో కలిగిన మార్పులవల్ల నాలుగుకాళ్లతో పరిగెత్తే నరవానరజాతుల్లో కొన్నిటికి రెండుకాళ్ల నడక తప్పనిసరి అయింది. ముందుకాళ్లు చేతులుగా మారడంతో వాటికి కొత్త నైపుణ్యం అలవడింది. చేతులూ, వేళ్ల కదలికలను శాసించే మెదడులోని భాగాలు విపరీతంగా అభివృద్ధి చెందాయి.

పనిముట్ల ద్వారా ఆహారం మరింత బాగా సంపాదించుకోవడంతో రానురాను సున్నితమైన పనులకు చేతులు అలవాటు పడడం, దానికి అనుగుణంగా మెదడు పెరగడం జరిగింది. ఏరుకు తినే దశనుంచి వేటాడే దశకు చేరుకోవడంతో ముందుగా ఆలోచించుకోవడం మొదలైంది. దీనికి తగినట్టే మెదడు విపరీతంగా పెరిగింది. అందువల్ల మనిషి తల పెద్దదయింది. వానరాల్లా కాకుండా నిటారుగా నిలబడ్డ మనిషికి ముఖం అంతకంతకూ విశాలమవుతున్న మెదడుకు కింది భాగాన అమరింది.

క్షీరదప్రాణుల పిల్లలలో రెండు రకాలుంటాయి. మొదటి రకానికి చెందిన ఎలుకలూ, పిల్లుల వంటివి ఎక్కువ సంఖ్యలో పిల్లల్ని కనేస్తాయి. అవన్నీ చిన్న మెదళ్లతో నిస్సహాయంగా ఉంటాయి కనుక తల్లులు వాటిని కాపాడి సాకుతాయి. పెద్దయాక వాటి మెదడు రెండింతలవుతుంది. రెండో రకానికి చెందిన గుర్రాల వంటివాటిలో పిల్లలు దాదాపు పూర్తి పరిణామానికి ఎదిగిన మెదళ్లతో పుడతాయి. అందుకని అవి పుట్టీ పుట్టగానే నేల మీద పడి చకచకా నడవడం, తల్లివెంట పరిగెత్తడం చేస్తాయి. అందులో 'పురుటినెప్పులు' కూడా ఉండవు. పిల్లలు త్వరగా పెద్దవై యుక్తవయసుకు వచ్చేస్తాయి. మనుషుల్లో అలాకాదు. మనిషి మెదడు ప్రత్యేకం. పుట్టిన తరువాత కూడా ఒక ఏడాది పాటు అది పిండదశలో ఎదిగినంత త్వరగానూ ఎదుగుతూనే ఉంటుంది. మనుషుల పిల్లలు నిస్సహాయులై పుట్టడమే కాదు, తమ జీవితకాలంలో నాలుగోవంతు పెరుగుదలలోనే గడుపుతారు. ఈ సుదీర్ఘవ్యవధిలో వారి మెదడు అంతులేని అభివృద్ధి సాధిస్తుంది. పుట్టినప్పుడు మాత్రం వారి మెదడు 'అసంపూర్తి'గా కనిపిస్తుంది. మనుషులలో ఏడాది గడిచేసరికి పిల్లల 'శిశు' మస్తిష్కం పూర్తిగా ఎదగడం, వారు కాస్త నిటారుగా నిలవగలగడం, మాటలు నేర్వడం అన్నీ ఒకేసారిగా జరుగుతాయి.

తక్కిన వానరజాతి జంతువులతో పోలిస్తే మనుష్యులు పుట్టే పద్ధతి చాలా విషయాల్లో ప్రత్యేకమనే చెప్పాలి. ప్రసూతి సమయంలో స్త్రీలు నిస్సహాయతకు లోనైనంతగా మరే వానరజాతి ప్రాణి విషయంలోనూ జరగదు. మనిషి సామాజిక జీవితానికీ, రెండు కాళ్ల నడకకూ దీనితో సంబంధం ఉందని కొందరు శాస్త్రవేత్తల అభిప్రాయం. జంతువుల్లాగ

కాకుండా మరొక మనిషి మంత్రసానిగా సాయం చెయ్యవలసిరావడం సామాజిక అంశమే. డార్విన్ సిద్ధాంతం ప్రకారం చూస్తే ప్రసూతిలో ఇతరుల సహాయం పొందిన తల్లులు పొందని వారికన్నా బాగా మనగలిగారన్న మాట. వానరాల్లా సహజ పద్ధతి అవలంబించిన స్త్రీలలో మరణం ఎక్కువగా సంభవించి ఉండాలి. అందువల్ల ఆ శరీర లక్షణాలు అంతరించిపోయాయి.

రెండుకాళ్ల నడక కారణంగా మనుష్యుల కటి భాగపు వెడల్పు తక్కిన వానరజాతి జంతువుల కన్నా తక్కువగా ఉంటుంది. యోని మార్గం ఇరుకవడం వల్ల పిల్లలు పుట్టడం కష్టమవుతుంది. తల్లికి ప్రసూతి బాధ కూడా ఎక్కువౌతుంది. మనిషి మెదడు పరిమాణం పుట్టినప్పటితో పోలిస్తే పెద్దయాక మూడింతలు పెరుగుతుంది. కోతుల్లో ఇది రెండింతలే. ఈ పెరుగుదల గర్భంలో ఉన్నప్పుడే సజావుగా జరగాలంటే తల్లి బిడ్డను 21 నెలలు మొయ్యాలి. అలా జరిగితే పుట్టేనాటికి శిశువు తల విపరీతంగా పెరిగిపోయి బిడ్డ బైటకు రావడం అసాధ్యమౌతుంది. నెలలు నిండడం చింపాంజీల్లో మనిషిలాగే జరుగుతుంది కాని శిశువు మెదడులో మనిషికన్నా చాలా ఎదుగుదల కనిపిస్తుంది. పుట్టినప్పుడు కోతి పిల్లలు మనుష్యులంత నిస్సహాయంగా ఉండవు.

ఆధునిక విజ్ఞానం వీటికి సంబంధించిన అనేక విషయాలను వివరిస్తుంది. వానరజాతుల్లో పెద్దయాక మెదడు రెండింతలు పెరిగితే మానవ శిశువుల మెదడు మూడింతలవుతుంది. మన మెదడు ఎదిగే చివరి 12 నెలలపాటు మనం తల్లి గర్భం నుంచి బైటపడతాం. గర్భంలో ఉన్న పరిస్థితులకు భిన్నంగా పుట్టిన మనిషి బిడ్డకు నిత్యమూ అనేక ఇంద్రియపరమైన ప్రేరణలు అందడం, స్పందనలు కలగడం వగైరాలన్నీ మొదలవుతాయి. ఆ కారణంగా మనిషి మెదడులోని నాడీకణాల మధ్య అనేక కొత్త లంకెలు అతివేగంగా ఏర్పడతాయి. నిస్సహాయంగా మొదలైన మానవ శిశువు జీవితానికి తల్లినుంచి లభించే రక్షణా, పోషణా, భావభరిత ప్రేమానురాగాలూ చాలా ప్రాముఖ్యతను కలిగి ఉంటాయి. ఏ చింపాంజీ పిల్లల పద్ధతిలోనో మానవశిశువులు తల్లి శరీరాన్ని వేలాడనైనాలేరు. ఎందుకంటే స్వేదం ఎక్కువగా స్రవించే మనిషి శరీరానికి చింపాంజీల్లాగా రోమాలుండవు సరికదా, మన పిల్లల చేతులకు అంతటి పట్టు కూడా ఉండదు. అసలు ఇంతటి పెద్ద మెదడు ఉండడం వల్లనే మనకు స్వేదం ఎక్కువ. పెద్ద మెదడు ప్రసూతికి ఇబ్బంది కనకనే మనం అసంపూర్ణ దశలో జన్మిస్తాం. తల్లితో తప్పనిసరిగా ఏర్పడే అనుబంధం మనకు 'మానవ' స్వభావాలనిస్తుంది. ఇవన్నీ ఒకదానితో ఒకటి ముడిపడిన విషయాలు.

మనిషికి జీవపరిణామం మందగించి సాంఘిక జీవితం మొదలవడంతో దానికి అనుగుణంగా శరీరంలో, ముఖ్యంగా మెదడులోనూ, ఇతర లక్షణాల్లోనూ మార్పులు అనివార్యం అయ్యాయి. నోటి నిర్మాణంలోనూ, నాలుక కండరాల్లోనూ జరిగిన అభివృద్ధి మాట్లాడడానికీ, భాష పెరుగుదలకూ దోహదం చేసింది. చిన్న చిన్న తెగలుగా సమాజ జీవితం ప్రారంభించిన ఆదిమ మానవులకు భాషా, తద్వారా ఇతరులతో సంపర్కమూ కలిగించిన లాభాలు ఇంతా అంతా కాదు.

మనిషి వ్యవసాయం మొదలుపెట్టి, స్థిరనివాసాల్లో జీవించడంతో తినే ఆహారంలో వైవిధ్యం పెరిగింది. కార్బోహైడ్రేట్ల రూపంలో అనేక ధాన్యాలు అందుబాటులోకి వచ్చాయి. ఆరోగ్యం మెరుగుపడింది. పిల్లలకు పాలు మాన్పి ఇతర ఆహారం అలవాటు చేయ్యడం వీలయింది. తల్లులు మంచి పోషక ఆహారం తినడంవల్ల పది, పదిహేను నెలల్లో మలి కాన్పుకు సిద్ధం అవసాగారు. ప్రకృతి వైపరీత్యాలకు గురికాకుండా మనుషులు తమను తాము కాపాడుకోగలిగారు. పుట్టినప్పుడు బలహీనంగా ఉన్నప్పటికీ మనుషులు ఒకరికొకరు తోడ్పడే సమాజ జీవితం ద్వారా ఇతర ప్రాణులకన్నా అభివృద్ధి సాధించగలిగారు.

ఈ పరిణామాల వల్ల ఏమౌతుంది? మనుష్యుల తలలు పుట్టినప్పుడు అంతకంతకూ పెద్దవౌతాయి. సహజ ప్రసూతిలో శిశువు తల నొక్కుకుపోయి భరించరాని బాధ కలుగుతుంది. మునుపటి కన్నా ఈ రోజుల్లో సిజేరియన్ పద్ధతిలో పిల్లలు పుట్టడం ఎక్కువైంది. శస్త్రచికిత్సలో జరిగిన అభివృద్ధి దీనికి కొంత కారణం కావచ్చు కాని పిల్లల తలలు అంతకంతకూ పెద్దవి కావడం కూడా ఇందుకు కారణమేమో. ఈనాటి పోటీ ప్రపంచంలో తెలివితేటలు లేకుండా పెరగడం అసంభవం కనుక ఇది ప్రకృతిలో జరిగిన ఏర్పాటేమో.

పిల్లలు పుట్టి పెరగడానికీ, మనుషులు సమాజాలుగా ఏర్పడడానికీ కూడా గట్టి సంబంధం ఉందని కొందరు శాస్త్రవేత్తలంటారు. సమష్టిగా పెంచిన పిల్లలు బట్టకట్టే అవకాశం ఎక్కువ. అందరు ఆడవాళ్లకూ కాన్పు ఒకేసారి రాదు గనక సాటివారికి తోడ్పడడం, ఒకరినుంచి మరొకరు నేర్చుకుని పిల్లల్ని కాపాడడం వీలవుతుంది. ఐకమత్యమే మహాబలంగా పెరిగిన ఆదిమానవుల తెగలకు పిల్లల పెంపకంలోని ప్రాముఖ్యత అర్థమై ఉంటుంది. ఇవన్నీ ఆధునిక శారీరక లక్షణాలు బలపడడానికి దోహదం చేసి ఉండాలి.

నడక అనేది మానవుల ప్రాథమిక లక్షణం. నడవలేని జాతులు వానరాలుగా చెట్ల మీదే ఉండిపోయాయి. రెండు కాళ్లమీద వేల మైళ్లు ప్రయాణించగలిగిన ఆదిమానవులు అన్ని విధాలా వానరాల నుంచి వేరుపడి ప్రగతిని సాధించారు. ఈనాటికీ ప్రయాణాలు చెయ్యడం మెదడుకు లాభిస్తుందనే అభిప్రాయం ఉంది. ఇందుకు ఉదాహరణగా చాలాకాలంపాటు ఉన్నచోటనే పాతుకుపోయిన నియాండర్తాల్ జాతి క్రమంగా అంతరించి పోయినట్టుగా తెలుస్తోంది. కొత్తచోట్లకి వెళ్లడం, కొత్త వాతావరణానికీ, లభ్యమౌతున్న ఆహారానికీ అలవాటు పడడం మొదలైన వన్నీ ఆదిమానవుల బుద్ధిని పదునెక్కించాయి. ఇతర రవాణా సౌకర్యాలు లేని యుగంలో ప్రయాణాలకు పనికొచ్చిన నడక శారీరకంగా ఇప్పటికీ మనకెంతో సహజమైంది. నడక అనేది ఒకప్పుడు మనుగడకు పనికొచ్చిన చర్య. రోజువారీ జీవితాల్లో అదొక భాగంగా ఉండేది. ఈ రోజుల్లో అది తగ్గిపోయి మనుషులు కదలనవసరం లేని జీవితాలకు అలవాటు పడుతున్న కొద్దీ ఆరోగ్య సమస్యలు తలెత్తుతున్నాయి. మనం నడుస్తున్నప్పుడు మెదడుకు ప్రాణవాయువును అందిస్తాం. ఊపిరి తీసే ప్రక్రియ మెరుగవుతుంది. గుండె వేగం హెచ్చుతుంది; మెదడులోని రక్తనాళాలు పెద్దవవుతాయి. శక్తిపెరిగి, వ్యర్థాలు ఎక్కువగా విసర్జించ బడతాయి. ఈ రోజుల్లో మనుష్యుల ఆరోగ్యం అవగాహన బాగా మెరుగు పడింది. టెస్ట్ ట్యూబుల్లో శిశువులు రూపొందే రోజులొచ్చాయి. మనిషి శరీర నిర్మాణం మాత్రం ఆనాటి ప్రత్యేక పరిస్థితుల్లో రూపుదిద్దుకుందనేది మరిచిపోరాదు.

మొత్తం మీద ఆధునిక మానవులకు పూర్వీకులుగా మొదట ఆస్ట్రలో పితెకస్ జాతీ, ఆ తరువాత హోమో ఎరెక్టస్ జాతీ నడక అనేది అలవరుచుకున్నారు. హోమో ఎరెక్టస్ ప్రజలు 15, 20 లక్షల ఏళ్ల క్రితమే ఆఫ్రికా నుంచి మహాప్రస్థానం చేసి ప్రపంచంలో నలుమూలలకీ వెళ్లి స్థిరపడ్డారు. వీరి పనిముట్లూ, అవశేషాలూ ఎన్నెన్నో లభిస్తాయి. ఆ తరువాత సుమారు లక్ష ఏళ్ల కిందట ఆధునిక మానవులు ఆఫ్రికా నుంచి కాలినడకన మరో ప్రస్థానంచేసి తమ పూర్వీకులందరూ అంతరించ డానికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కారణమయ్యారు. మనం వారికే వారసులం. అందుచేతనే నడక ఎంత ముఖ్యమైనదో మనం గుర్తుంచుకోవాలి. ◆

**అమెరికాలో నల్లవారి పట్ల ప్రజాస్వామిక సభ్య సమాజం అత్యంత నీచంగా జరుపుతున్న ఆత్మగౌరవ హననానికి వ్యతిరేకంగా పెల్లుబికిన ధిక్కార స్వరం మాల్కం ఎక్స్‌పై వచ్చిన ఎలెక్స్ హేలీ పుస్తకాన్ని పరిచయం చేస్తున్నారు దుప్పల రవికుమార్**

# ఆర్థిక స్వావలంబనే అసలు పరిష్కారం

కొన్ని పుస్తకాలకు నిజానికి విపులమైన పరిచయాలు అవసరం లేదు. మరెవ్వరూ చెప్పలేనన్ని విషయాలు మనకు స్వయంగా ఆ పుస్తకాలే తెలియజేస్తాయి. అలాంటి అరుదైన పుస్తకాలలో ఒకటి ఈ 'అసురసంధ్య'. అలెక్స్ హేలీ రచించిన ఈ పుస్తకానికి తెలుగు అనువాదం ఇంత ఆలస్యంగా వెలువడడం అంతుచిక్కని విషయం. తెలుగు సాహితీ ప్రపంచంలోకి ఇప్పటికైనా వచ్చినందుకు ఆనందంగా ఉన్నప్పటికీ ఆలస్యానికి కారణాలు మాత్రం నిజంగా ఆలోచించాలి. అలెక్స్ హేలీ పేరు వినగానే తెలుగు పాఠకులకు సహవాసి పుణ్యమా అని వెంటనే గుర్తుకొచ్చేది 'ఏడుతరాలు' నవల. అనితర సాధ్యమైన ఆ నవలను రచించిన హేలీ ఇతర రచనల గురించి మనకు మరేమీ తెలియనప్పుడు అత్యంత సాహసంగా 'యాజ్ఞి' అనే అనువాదకుడు హేలీ మరో రచనను 'అసురసంధ్య' పేరుతో మన ముందుకు తీసుకొచ్చారు. ఈ పుస్తకానికి 'నల్లజాతి వైతాళికుడు మాల్కం ఎక్స్' పేరుతో జిలుకర శ్రీనివాస్ రాసిన పదిహేను పేజీల సవివరమైన ముందుమాట పుస్తకంలోని అసలు విషయానికి అవసరమైన బ్యాక్‌డ్రాప్‌ను అందివ్వడమే కాకుండా అనేక ఆలోచనలు రేకెత్తించి, కొన్ని విలువైన ప్రశ్నలను మనముందు చర్చకు పెడుతుంది.




మనదేశంలో కొంతమంది ప్రజలను అంటరానితనం పేరుతో అంటరానివారుగా కొన్ని వేల సంవత్సరాల పాటు అత్యంత హీనస్థితిలో ఉంచాం. అంటరానితనమనేది కింద కులాల వారనబడే ప్రజల శరీరాల్లోనో, మనసుల్లోనో, వారు బతుకులీడుస్తున్న పరిస్థితుల్లోనో ఉండదు. అదంతా పై కులస్తులలో ఉండే 'అంటలేనితనం' అని గుర్తించగలిగిన తరువాత మన మానసిక పరిస్థితుల్లో ఇప్పుడిప్పుడే కొంత మార్పు కనిపిస్తోంది. పిలిచే పిలుపులో కూడా దళితులని వ్యవహరించడం వెనుక కొన్ని శతాబ్దాల ఆత్మగౌరవ పోరాటాల చరిత్ర ఉందని మర్చిపోకూడదు. ఇంత భయంకరమైనది కాకపోయినా మనిషిని నిలువునా నీరు చేసే ఇలాంటి వ్యవహారమే పాశ్చాత్య దేశాల్లో నీగ్రోల వ్యవస్థలోనూ ఉంది. కాని అక్కడకూడా ఈ పిలుపుపట్ల వ్యతిరేకత స్పష్టంగా వ్యక్తీకరిస్తున్న ఫలితమే వారిని ఇప్పుడు బ్లాక్స్ లేదా ఆఫ్రికన్ అమెరికన్స్ అని పిలవడం నెమ్మదిగా మొదలైంది. రావలసిన పెను మార్పునకు ఇది కేవలం ప్రారంభం మాత్రమేనని గుర్తించాలి. వేల సంవత్సరాల తరబడి రక్తంలో పాతుకుపోయిన జాడ్యం పోవడానికి కొన్ని వందల ఏళ్ల పోరాటం సరిపోదు. ఈ పోరాటం ఇంకా ఉధృతంగా జరగాలి. మనందరి మనస్సులను ప్రక్షాళన చేయాలి. అప్పుడే ఒక మనిషి తన తోటి మనిషిని కులం, రంగు, చదువు, సంపదల ఆధారంగా హీనంగా చూసే అవకాశం ఉండదు. ముడ్డికి తాటికమ్మ కట్టుకుని, చేతిలో ముంత పట్టుకుని కొందరు మనుషులు మన సమాజంలోనే తిరిగేవారంటే మన గుండె తరుక్కుపోతుంది. నడుస్తున్న అడుగులను చెరిపి ఇంకొకరికి ఆ పాదాల ఛాయకూడా కనిపించకుండా ఉండడానికి వెనక తాటికమ్మ కట్టుకోవడం, ఎక్కడపడితే అక్కడ ఉమ్మకుండా చేతిలోనే ముంత పట్టుకోవడం అనేవి సాటి మనుషులను హీనంగా ఉంచే సామాజిక వ్యవస్థ దుర్మార్గానికి అద్దం పడతాయి.

అమెరికాలో నల్లవారి పట్ల ప్రజాస్వామిక సభ్య సమాజం అత్యంత నీచంగా జరుపుతున్న ఆత్మగౌరవ హననానికి వ్యతిరేకంగా పెల్లుబికిన ధిక్కార స్వరం మాల్కం ఎక్స్‌ది. ఈ మాల్కం కథ చదువుతున్న కొద్దీ మనదేశం మనకు పదేపదే గుర్తుకురావడం యాదృచ్ఛికమేమీ కాదు. మాల్కం ఎక్స్‌ను మన అంబేద్కర్‌తోనూ, మార్టిన్ లూథర్ కింగ్‌ను మన గాంధీతోనూ పోల్చడానికి మొగ్గు చూపిస్తాం. కానీ జాగ్రత్తగా పరిశీలిస్తే జ్యోతిరావు ఫూలేకానీ, అంబేద్కర్ కానీ, పెరియార్ కానీ జరిపిన సామాజిక సంస్కరణలను వేటినీ మాల్కం ఎక్స్ చర్యలతో పోల్చిచూడలేం. ఎందుకంటే అతడి జీవిత గమనమే చిత్రాతిచిత్రంగా నడిచింది. తన బతుకుబాటలో నడిచివచ్చిన తన దారిలో తనకు ఎదురైన అనుభవాలు నేర్పిన సారం మాల్కం ఎక్స్ వంట పట్టించుకోవడం వల్లనే కాబోలు

తన తరువాతి తరాలను ప్రభావితం చేయగల ఉపన్యాసాలతో రెచ్చగొట్టిన ఎక్స్ ఆర్థిక స్వయం ప్రతిపత్తి గురించి తన వాళ్లకు ఉగ్గుపాలతో రంగరించి పోశాడు. దానివల్ల నిర్మితమైన ప్రత్యామ్నాయ ఆర్థిక వ్యవస్థ బ్లాక్ రెస్టారెంట్లు, బ్లాక్ పరిశ్రమలు, బ్లాక్ పాఠశాలలు... ఒకటేమిటి అవన్నీ అగ్ర దురహంకారులకు ఒక సవాలును విసరగలిగాయి.

అమెరికాలో నల్లజాతి విముక్తి పోరాట చరిత్రలో ప్రధాన స్రవంతి (మెయిన్‌స్ట్రీమ్)లో కనిపించే పేర్లు మూడు మాత్రమే. వారు అబ్రహం లింకన్, బుకర్ టి. వాషింగ్టన్, మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్‌లు మాత్రమే. కానీ చరిత్రలో అంతగా నమోదు కాని, మనకు (ముఖ్యంగా తెలుగువారికి) అంతగా తెలియని మరో పోరాటపాయ ఎలైజా ముహమ్మద్‌ది. తాను స్థాపించిన నేషన్ ఆఫ్ ఇస్లాం సంస్థలో చేరి దాని దిశానిర్దేశాన్ని మార్చి తన జాతి తరాల తలరాతలను కూడా మార్చగలిగిన మాల్కం ఎక్స్ కథ అంతగా పత్రికల్లోకి ఎక్కలేదు. జనం నోళ్లలో నానలేదు. దానికి కారణం తర్వాత తర్వాత ఇతడి మాటలు, ఉపన్యాసాలు, రాతల వల్లే అక్కడ చెలరేగిన విప్లవాత్మక, సాయుధ బ్లాక్‌పాంథర్స్ ఉద్యమం బహుశా ఒక కారణం కావచ్చు. కానీ అమెరికాలోనే కాక దేశవిదేశాల్లో ముహమ్మద్ గురించి, నేషన్ ఆఫ్ ఇస్లాం గురించి, నల్లజాతి విముక్తి ఉద్యమం గురించి అత్యంత ప్రభావశీలంగా ప్రచారం చేయగలిగింది మాల్కం ఎక్స్ మాత్రమే.

తన గురువు, దైవం అయిన ముహమ్మద్ కూడా అనైతికతకు లొంగిపోయాడని తెలిసిన తరువాత తన ప్రాణత్యాగానికి సైతం సిద్ధపడి తన సొంతమార్గంలో ప్రయాణించిన అసమాన ధైర్య సాహసాలున్న యోధుడు మాల్కం ఎక్స్. మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్‌తో సహా గాంధేయవాదులంతా 'కలసి వుంటే కలదు సుఖం' సూత్రాన్ని ప్రబోధిస్తూ 'కొంచెం మర్యాదివ్వండి బాబోయ్' అంటూ బతిమాలుకుంటూ పోరాడుతున్న రోజుల్లో నల్లవారి రాజ్యం స్థాపించుకున్న నాడే తమ కష్టాలు ఈడేరుతాయని కలలుగన్న మాల్కం ఎక్స్ ఆర్థిక స్వాతంత్రమే అన్ని సమస్యలకు పరిష్కారమని ప్రబోధించాడు. అయితే నల్లజాతి ప్రజలంతా ఇస్లాంమతం స్వీకరించాలని, అలా కలసికట్టుగా ఉండాలనిప్రబోధించడం వెనక ముహమ్మద్ ప్రభావం ఎంతైనా ఉందనే సంగతి గుర్తుంచుకోవాలి.

మూహమ్మద్‌ను విడిచిపెట్టిన తరువాత మాల్కం విదేశీ పర్యటనకు బయలుదేరుతాడు. మతం అసలు రంగు తెలుసుకుంటాడు. మత గ్రంథాలను సరైన రీతిలో అర్థం చేసుకుంటాడు. అనంతరం 'నిజమైన ఇస్లాం'ను అమెరికాలో తన సహచరులతో ప్రబోధిస్తాడు. ఆఫ్రికన్ అమెరికన్ యూనిటీ ఆర్గనైజేషన్‌ను స్థాపిస్తాడు. కానీ మృత్యువు తన వద్ద పొంచి వుందని గమనించిన మాల్కం ఆ సంగతి తన మిత్రులందరికీ తెలియ పరుస్తాడు. దారుణంగా హతమయ్యేలోపు విస్తృతంగా పర్యటనలు, ఉపన్యాసాలు పూర్తిచేసుకుని ఆర్థిక అజెండాను సంపూర్ణంగా తన ప్రజల ముందుంచాడు. కానీ పరిస్థితులు ఇప్పుడు అన్నీ తారుమారయ్యే సూచనలు పొడసూపుతున్నాయి. అమెరికాపై ఉగ్రవాదులు జరిపిన భీతావహ దాడుల తరువాత ఇస్లాం మతస్తులు కొత్త సమస్యలను ఎదుర్కొంటున్నారు. బలమైన ఆర్థికవ్యవస్థను నిర్మించుకుంటున్న నల్లజాతి ప్రజలకు ఉగ్రవాద దుశ్చర్య పెద్ద చెంపపెట్టు. ఇలాంటి అవకాశాల కోసమే కాచుక్కూచున్న అమెరికా ఉగ్రవాద దురహంకారానికి ఇదొక పెద్ద అలుసు. సామ్రాజ్యవాద స్వభావం దీనిని సాకుగా తీసుకుని నల్లజాతి మీద మళ్లీ పడగ విసిరేలోగా ఈ దెబ్బను తమాయించుకుని నిలబడితేనే ఆత్మగౌరవ పోరాటానికి పునరుజ్జీవనం లభించినట్టు. లేదంటే ఈ త్యాగాలన్నీ, పోరాటాలన్నీ నిష్ఫలమవుతాయి.

జీవితంలో ఎత్తుపల్లాలన్నీ చూసాడని కొందరిని వర్ణిస్తుంటారు. నిజానికి అక్షరాలా ఈ మాట మాల్కం ఎక్స్‌కు వర్తిస్తుంది. భద్ర జీవనం గడుపుతున్న చిన్నారి మాల్కం తండ్రి మరణించాక, తల్లి ఆత్మగౌరవంతో పెంచడానికి ప్రయత్నించి విఫలమవుతుంది. ఆమెను సమాజం దాదాపు పిచ్చిదాన్ని చేస్తుంది. వివక్ష విశ్వరూపాన్ని లేత ప్రాయంలోనే అనుభవిస్తాడు. అయితే దానిపై పోరాటం ప్రకటించిన మాల్కం జీవిత ప్రవాహంలో పడి కొట్టుకుపోతాడు. చిల్లర దొంగతనాల నుండి క్రమంగా పెద్ద దొంగతనాలు, మాదకద్రవ్యాల అక్రమ రవాణా, వ్యభిచారం, ఒకటేమిటి అన్ని రకాల దుర్వ్యసనాలకు బానిసవుతాడు. చివరకు జైలు పాలవుతాడు. మతాన్ని, దేవున్ని నమ్మని మాల్కం జైలులో క్రమంగా ఎలైజా ముహమ్మద్ గురించి తెలుసుకుని ఇస్లాం గురించి అధ్యయనం ప్రారంభిస్తాడు. ఒక జాతిపట్ల ఇతర జాతులన్నీ చూపిస్తున్న వైమనస్యానికీ, వివక్షకూ, సమస్యలకు మూలాలను అన్వేషించడం ప్రారంభిస్తాడు. ఆ అన్వేషణలో తనకు లభించిన సమాధానాలకు అనుగుణంగానే తన ఉపన్యాసాలను తయారుచేసుకున్నాడు. ఇంక అమెరికాలోని అన్ని రాష్ట్రాలలో నేషన్ ఆఫ్ ఇస్లాం శాఖలు ఏర్పాటు చేసి, మసీదులు నిర్మించడం ప్రారంభిస్తాడు. ముమ్మరంగా తన కృషి సాగుతున్న దశలో ఎలైజా అనైతిక వ్యవహారం బయటపడుతుంది. దానిని మన్నిస్తాడు కూడా. అయినా అనవసర అహంకారాలతో ఎలైజా దూరాన్ని పెంచుకుంటాడు. దానితో విభేదాలు ఏర్పడి అతడి నుండి విడివడి స్వతంత్రుడవుతాడు. మరణించే వరకు తాను నమ్మిన సిద్ధాంతాన్ని ప్రచారం చేస్తూనే గడిపాడు.

'ఏడుతరాలు' నవల రాయడం కోసం అలెక్స్ హేలీ చాలా ఏళ్లపాటు అవిశ్రాంతమైన పరిశోధన సాగించాడు. నిజానికి తన పూర్వీకుల గురించి కథనం రాసే ప్రయత్నంలో ఆ ఆఫ్రికా అడవుల్లో సంచరిస్తూ, ఒక పడవలో డెక్‌మీద అదే తరహాలో ప్రయాణిస్తూ, కేవలం అప్పటి మూడ్‌లోకి వెళ్లడానికి అలెక్స్ హేలీ ప్రయత్నించాడని చెప్తుంటారు. అదే విధమైన కష్టం మళ్లీ ఈ రచనకోసం పడినట్టు ఈ గ్రంథంలో హేలీ స్వయంగా చెప్పుకుంటాడు. అనేక దఫాలుగా మాల్కంతో ఇంటర్వ్యూలు తీసుకుని, అన్ని విషయాలమీద కూలంకషంగా చర్చించి ఒక్కో వాక్యమూ రాసుకుంటూ వచ్చాడట. మాల్కం గురించి చెప్తూ రచయిత 'ఇంతటి విద్యుత్తేజం కలిగిన వ్యక్తిత్వాన్ని నా జీవితంలో ఎప్పుడూ చూడలేదు' అని ప్రశంసిస్తాడు. హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురించిన ఈ 'అసురసంధ్య – మాల్కం ఎక్స్ ఆత్మకథ' యువతరం తప్పక చదవాల్సిన ఒక మంచి పుస్తకం. ◆

## మరణశిక్ష రద్దు కోసం...

అంతర్జాతీయ మానవ హక్కుల పరిరక్షణ సంస్థ ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ మరణశిక్షకు వ్యతిరేకంగా ఆన్‌లైన్ ఉద్యమాన్ని నిర్వహిస్తోంది. ఐక్యరాజ్య సమితిలో మరణశిక్షకు వ్యతిరేకంగా ప్రవేశపెట్టనున్న తీర్మానానికి భారత్ మద్దతు కావాలని అభ్యర్థించింది. ఈ తీర్మానం కనుక ఆమోదం పొందితే అంతర్జాతీయంగా మరణశిక్ష విధించకుండా మారటోరియం విధిస్తారు. ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశంలో యూరోపియన్ యూనియన్ ఈ తీర్మానాన్ని ప్రవేశపెట్టనుందని ఆమ్నెస్టీ తెలిపింది. ఇప్పటివరకూ 130 దేశాలు మరణశిక్షను రద్దుచేసాయి.

## వారసత్వ రిజర్వేషన్

అరవైయేళ్ల స్వతంత్ర భారతంలో నలభై ఎనిమిదేళ్లు కేంద్రంలో కాంగ్రెస్ అధికారంలో ఉంది. నెహ్రూ, ఇందిర, రాజీవ్‌లు ముప్పై అయిదేళ్లు దేశాన్ని పాలించారు. దాదాపు తొమ్మిదేళ్లు కాంగ్రెస్ పార్టీ అధ్యక్ష పదవి నెహ్రూ వంశం వెలుపల ఉంది. నెహ్రూ వంశీయులు ఇంతకు పూర్వం ఏ దారిలో పార్టీలోకి, తర్వాత అధికారంలోకి వచ్చారో రాహుల్‌గాంధీ సైతం అదే దారిలో ఉన్నారు. కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా, వర్కింగ్ కమిటీ సభ్యుడిగా రాహుల్ గాంధీ నియామకం సెప్టెంబర్ 24న జరిగింది. ముప్పై ఏడేళ్ల రాహుల్‌గాంధీ తండ్రిలాగే నలభైలలోపే ఆ పదవిని అధిష్టించారు. రాహుల్‌గాంధీ అనే కాదు మొత్తంగానే దేశంలో ఈ వారసత్వ రాజకీయాలు స్థిరంగా కొన్ని కులాలకు, వర్గాలకు మాత్రమే రిజర్వేషన్‌గా కొనసాగుతున్నాయి. నెహ్రూ చెప్పిన సోషలిస్టు స్ఫూర్తి ఆచరణలో నిజంగా, సామాజిక న్యాయంగా అమలయ్యే దాకా అణగారిన వర్గాల ఆకాంక్షలు రకరకాల ఉద్యమాల రూపాల్లో వ్యక్తమౌతూనే ఉంటాయి.

## 'కర్ణాటకీయం'

కర్ణాటక రాజకీయం మధ్యంతరానికి తెరలేపి మళ్లీ తోకముడిచింది. పార్లమెంటైనా, అసెంబ్లీ అయినా అవకాశవాదమే సైద్ధాంతిక పునాదిగా, అవినీతే లక్ష్యంగా సాగుతున్న నాలుగుస్తంభాల ఆటగా పాలన మారిపోయి చాలా కాలమే అయింది. 224 శాసనసభ స్థానాలు ఉన్న కర్ణాటక 2004 శాసనసభ ఎన్నికల్లో భారతీయ జనతాపార్టీ – జనతా దళ్ (యు) కూటమి 84, కాంగ్రెస్ 65, జనతా దళ్ (ఎస్) 54 స్థానాలు కైవసం చేసుకున్నాయి. దేవెగౌడ 'వ్యూహా'లతో జె.డి.(ఎస్) నలభై మాసాలుగా అధికారంలో కొనసాగింది. కాంగ్రెస్ నాయకత్వంలోని సంకీర్ణ మంత్రివర్గం నుంచి జె.డి.(ఎస్) వర్గం వైదొలిగి, 2006 జనవరిలో బి.జె.పి.తో పొత్తు పెట్టుకొని కొత్త ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. పొత్తు షరతుల ప్రకారం బి.జె.పి. కి అధికారాన్ని అప్పగించాల్సి ఉండగా, పార్లమెంటుకు మధ్యంతరం ముంచుకొస్తున్న తరుణంలో దేవెగౌడ శాసనసభ రద్దుకే మొగ్గు చూపారు. కానీ రకరకాల పరిణామాల నేపథ్యంతో మళ్లీ బి.జె.పి, జె.డి (ఎస్)లు సర్దుబాటు దిశగా పయనిస్తున్నాయి. కర్ణాటకలోనే కాదు దేశవ్యాప్తంగా ప్రజలు ఏ రాజకీయ పార్టీని నమ్మడంలేదు. అందరినీ పీఠానికి సమాన దూరంలో నిలబెడుతున్నారు. ఈ విషయం అర్థమైనా నిస్సిగ్గుగా రాజకీయ పార్టీలు తమ దిగజారుడును మళ్లీ మళ్లీ రక్తి కట్టించే ప్రయత్నం చేస్తున్నాయి.

## సైలెన్స్.. ప్లీజ్...!

అమెరికా హియరింగ్ ఇన్‌స్టిట్యూట్‌వారు నిర్వహించిన అధ్యయనంలో ప్రపంచవ్యాప్తంగా యాభై కోట్ల మంది ప్రజలు ఏదో ఒక వినికిడి సమస్యతో బాధపడుతున్నారని సెప్టెంబర్ 24 'అంతర్జాతీయ బధిరుల దినం' సందర్భంగా తెలిపింది. వీరిలో మూడోవంతు మంది పెద్ద శబ్దంతో సంగీతం వినడం, రణగొణ ధ్వనులు ఎక్కువగా ఉండే ప్రదేశాలలో పనిచేయడం వంటి వాటివల్లే ఈ సమస్య బారిన పడుతున్నారని తెలిపింది. ఈ సమస్యతో బాధ పడుతున్న వారిలో 6.3 శాతం మంది మన దేశంలోనే ఉన్నారు. ఈ గణాంకాలతో మనమంతా ప్రమాదపుటంచున ఉన్న సంగతి అర్థమవుతూనే ఉంది. పండుగలు, పెళ్లిళ్లు, పార్టీలు, డిస్కోటెక్‌లు, రాజకీయ పార్టీల మీటింగులు, ఎఫ్.ఎం. రేడియోలు, సెల్‌ఫోన్‌లు, సినిమాహాల్లో డోల్బీ శబ్దాలు, పెరిగిపోతున్న వాహనాల కారణంగా శబ్ద కాలుష్యం పెరిగిపోతుంది. ఈ శబ్దాల తాకిడికి ప్రజలు అనేక మానసిక, నాడీసంబంధ వ్యాధులకు గురవుతున్నారు. రోగులు విశ్రాంతిలేక, విద్యార్థులు చదువుకోలేక అశాంతికి లోనవుతున్నారు. బస్టాండ్‌లు, రైల్వేస్టేషన్‌లు, ఆటోలు, అంతటా టీవీ, సౌండ్‌బాక్సులతో హోరెత్తుతున్నాయి. ఈ శబ్దకాలుష్యం నుంచి మనని, మనపిల్లలని, మన ఇరుగుపొరుగుని మనమే రక్షించుకోవాలి.

## రాజకీయాల 20-20

ఫాస్ట్‌ఫుడ్, ఫాస్ట్‌ట్రాక్ కోర్సులు, ఫాస్ట్ సర్వీసులు, ఫాస్ట్ వ్యాపారం, ఫాస్ట్ విలువలు, ఫాస్ట్ క్రికెట్... అవును ఇప్పుడు అంతా ఫాస్టే. ఎవ్వరికీ టైం లేదు. పూర్తిగా ఆడే ఓపిక, పూర్తిగా చూసే ఓపిక, పూర్తిగా చదివే ఓపిక ఎవరికీ లేవు. వస్తు సంస్కృతిలో భాగంగా బహుళజాతి సంస్థలు తమ వ్యాపార ప్రకటనలు దూకుడుగా జనంలోకి తీసుకుపోవడానికి జనాన్ని టీవీలకు కట్టేయడానికి ఉపాయం తప్ప ఇది మరొకటి కాదు. చేతిలో కంచం గుంజుకుపోయినా, కాలికింద నేలను చాపలా చుట్టేసినా, కొయ్యకు కట్టేసినట్లు దృష్టి మరల్చడమే వీటన్నిటి సారం. ఇప్పుడు క్రికెట్, రాజకీయం, సినిమా అంతా వినోదమే. అయిదేళ్లకు ఒక్కసారి రమ్మని జనం ఓటేస్తే, తమ పాలన ఎలాగూ మెచ్చరని తెలిసిన నాయకులు సగంలోనే మధ్యంతరం అంటూ పరుగులు తీస్తున్నారు. ఈ నెపంతోనైనా కొన్ని హామీలు, కొన్ని వరాలు వస్తాయని జనం ఆశిస్తున్నారు. ఇలాంటి స్థితిలో అసెంబ్లీ, పార్లమెంటరీ ఎన్నికలు అయిదేళ్లకు కాక, మూడేళ్లకే మారిస్తే బాగుండునని సామాన్యులు అనుకోవడం అసహజం కాదేమో.

## గుజరాత్, హిమాచల్ ప్రదేశ్‌లకు ఎన్నికలు

ఎన్నికల కమిషన్ గుజరాత్, హిమాచల్ ప్రదేశ్‌ల శాసనసభ ఎన్నికల తేదీలను ప్రకటించింది. గుజరాత్‌లో 182 శాసనసభ స్థానాలకు డిసెంబర్ 11, 16 తేదీల్లోను, హిమాచల్ ప్రదేశ్‌లో 68 శాసనసభ స్థానాలకు నవంబర్ 14, డిసెంబర్ 19 తేదీల్లోను ఎన్నికలు నిర్వహిస్తారు. 2002లో గుజరాత్ మారణకాండ తరువాత హిందుత్వ నినాదంతో గద్దెనెక్కిన నరేంద్రమోడీ ఇప్పుడు తాను గాంధేయవాదినని ప్రకటించడం హాస్యాస్పదం. పార్టీలో సీనియర్ నాయకులతో విభేదాలు, సంఘపరివార్ అంతర్గత విభేదాలు, బిజెపికి నాయకత్వలేమి, ప్రభుత్వ వ్యతిరేకత వెరసి ఈసారి ఎన్నికలలో బిజెపి పరిస్థితి ప్రశ్నార్థకంగా మారింది. మధ్యంతరం ముంచుకొస్తుందనుకుంటున్న తరుణంలో ఇప్పుడు అందరి దృష్టి గుజరాత్ ఎన్నికలపైనే ఉంది. ◆

## స్వదేశానికి బెనజీర్ రాక

పాకిస్తాన్ మాజీ ప్రధాని బెనజీర్ భుట్టో ఎనిమిదేళ్ల ప్రవాసం తరువాత పాకిస్తాన్‌కి తిరిగి వచ్చారు. ఈ సందర్భంగా కరాచీ విమానాశ్రయం వద్ద ఆమెని స్వాగతించడానికి కొన్ని లక్షల మంది ప్రజలు, పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ కార్యకర్తలు గుమిగూడారు. అయితే, ఈ గుమిగూడిన ప్రజల మధ్య రెండు ఆత్మాహుతి దాడులు జరగడంతో 140 మందికి పైగా మరణించారు. 500 మందికి పైగా గాయపడ్డారు. బెనజీర్ భుట్టో ఈ ఆత్మాహుతి దాడులు జరిగే కొద్ది నిమిషాల ముందే వాహనంలోపలికి వెళ్లడంతో, ఆమెకి ప్రాణాపాయం వెంట్రుకవాసిలో తప్పింది. ఆమె మీద, ఆమె భర్త మీద ఎనిమిదేళ్ల క్రితం నుండి ఉన్న లంచగొండితనం కేసులు ముషర్రఫ్ ప్రభుత్వం ఉపసంహరించు కుంటున్నందుకు ప్రతిగా బెనజీర్ భుట్టో ముషర్రఫ్ అధ్యక్ష పదవిలో కొనసాగడానికి తమ పార్టీ తరఫున మద్దతు ప్రకటించి ఆ ఒప్పందం ఆధారంగా పాకిస్తాన్‌కి తిరిగి వచ్చింది. భుట్టో – ముషర్రఫ్‌ల ఒప్పందం ఆమె పార్టీ బలం మీద ఎలాంటి ప్రభావం వేస్తుందో, ఈ ఆత్మాహుతి దాడుల పర్యవసానం ఏమిటో ముందు ముందు తెలిసివస్తుంది.



## ఇరాక్ – టర్కీల మధ్య కుర్దులు

ఉత్తర ఇరాక్‌లో, టర్కీలోనూ ఉన్న కుర్దుల స్వయం ప్రతిపత్తి భావన వలన ఇప్పుడు ఇరాక్ – టర్కీల మధ్య వివాదాలు చెలరేగేటట్టుగా కనిపిస్తోంది. ప్రస్తుతానికి ఇరాక్‌ని పాలిస్తున్న సంకీర్ణ ప్రభుత్వంలో కుర్దులకి మునుపెన్నడూ లేనంత ప్రాముఖ్యత ఉంది. అలాగే తమ ప్రాంతాలలో స్వయం నిర్ణయాధికార హక్కు కూడా ఉంది. అయితే ఇరాక్‌లోని కుర్దుల ప్రాంతం టర్కీకి చాలా దగ్గరగా ఉండడంతో, పి.కె.కె. అనే కుర్దుల పార్టీకి చెందిన కుర్దులు కుర్దిస్తాన్ కోసం టర్కీతో పోరాడుతూ ఇరాక్‌లో ఆశ్రయం పొందుతున్నారన్న నెపం మీద, ఇటీవల టర్కీ ప్రభుత్వం తన సైన్యాన్ని అవసరమైతే ఇరాక్‌లోకి పంపైనా పి.కె.కె.ని నాశనం చేస్తామని ప్రకటించింది. ఆ మేరకు టర్కీ ప్రభుత్వం పార్లమెంటులో బిల్లు కూడా ప్రవేశపెట్టింది. అసలే రకరకాల సమస్యలతో అతలాకుతలమైపోతున్న ఇరాక్ దేశం మీద ఈ కొత్త సమస్య 'గోరుచుట్టు మీద రోకటి పోటు'లాగా తయారవుతోంది.

## మయన్మార్‌లో ప్రజానిరసన

గత నెలలో, ఈ నెల మొదట్లోనూ మయన్మార్‌లో పెల్లుబికిన ప్రజా నిరసన అణగారిపోయింది. వేలల్లో ప్రజలు, బౌద్ధ భిక్షువులు పాల్గొన్న ఈ నిరసన కార్యక్రమాలు ఐక్యరాజ్య సమితి దృష్టికి కూడా వెళ్లాయి. ఐక్యరాజ్య సమితి ప్రత్యేక దూత మయన్మార్‌కి వెళ్లి అక్కడి సైనికాధికారులని, ప్రజాస్వామ్య పోరాటానికి మారుపేరుగా నిలబడ్డ ఆంగ్‌సాన్ సూచిని కూడ కలుసుకున్నారు. ఈ నిరసనల వెనుక అమెరికా హస్తం ఉందని, ఇది ఇంతకు ముందు ఉక్రెయిన్, జార్జియా లాంటి చోట్ల జరిగిన నిరసనల లాంటిదేనని చాలా కచ్చితమైన సమాచారం ఉంది. మయన్మార్ కూడా అమెరికాకి ఒక కీలకమైన ప్రాంతమే. ఎందుకంటే అది మలేషియాని, ఇండోనేషియాని కలిపే మలక్కాకి దగ్గర్లో ఉంది. దాని మీద ఆధిపత్యం సంపాయించిన వాళ్లకి చాలా లాభాలుంటాయి.

## ఇరాక్‌లో భద్రత ప్రైవేటీకరణ

ఇరాక్‌లో భద్రతని కూడా అమెరికన్లు ప్రైవేట్ సంస్థ అయిన బ్లాక్ వాటర్‌కి అప్పగించడంతో ఇరాకీ పౌరుల జీవితాలకి అసలు భద్రత అనేది లేకుండాపోయింది. ఇరాకీలని విచక్షణారహితంగా చంపే అలవాటు బ్లాక్‌వాటర్ సంస్థకి ఇంతకు ముందే ఉన్నా ఆ సంస్థ గార్డులు సెప్టెంబర్‌లో బాగ్దాదులో జరిపిన కాల్పుల్లో 170 మంది చనిపోవడం, 24 మంది గాయపడడం జరిగింది. ఈ విషయమై ఇరాక్ ప్రభుత్వం కూడా తీవ్రంగా స్పందించక తప్పని పరిస్థితి ఏర్పడింది. ఈ నెల చనిపోయిన ముగ్గురు ఇరాకీల కుటుంబాలు, బ్లాక్‌వాటర్ సంస్థకి వ్యతిరేకంగా అమెరికన్ కోర్టులో కేసు దాఖలు చేసారు. ఇరాకీ పౌరులు ఒక ప్రైవేట్ మిలటరీ సంస్థకి వ్యతిరేకంగా అమెరికాలో కోర్టుకి వెళ్లడం బహుశా ఇదే మొదటిసారి. ఇరాకీ ప్రభుత్వ రిపోర్టులో కూడా బ్లాక్‌వాటర్ సంస్థ పట్ల తీవ్ర అభ్యంతరాలని వ్యక్తం చేసారు. అంతే కాక, ఇరాక్ ప్రభుత్వం కాల్పులకి పాల్పడిన సంస్థ ఉద్యోగులని తమ దేశానికి అప్పగించాలని, కాల్పుల్లో చనిపోయిన 17 మంది కుటుంబాలకి ఆ సంస్థ ఎనిమిది మిలియన్ల చొప్పున నష్టపరిహారం చెల్లించాలని డిమాండు చేసింది. అయితే అమెరికన్ ప్రభుత్వమూ, బ్లాక్‌వాటర్ సంస్థ రెండు కూడా ఇరాకీ ప్రభుత్వ డిమాండ్లని తోసిపుచ్చాయి.

## సెల్‌తో క్యాన్సర్ !

మెదడుకు దగ్గరగా సెల్‌ను వాడటం వలన కణుతులు ఏర్పడి క్యాన్సర్‌కి దారి తీస్తాయని 'డెయిలీ మెయిల్' పత్రికలో వచ్చిన కథనం ద్వారా తెలుస్తోంది. స్వీడిష్ పరిశోధకుల ప్రయోగాలలో ఈ విషయం నిర్ధారణ అయ్యింది. రోజుకు గంటకు పైగా, దశాబ్దకాలం పైబడి సెల్‌ఫోన్ వాడుతున్నవారు బ్రెయిన్ క్యాన్సర్ బారినపడే అవకాశాలు అధికంగా ఉన్నాయని ఈ పరిశోధక బృందానికి నేతృత్వం వహిస్తున్న లెన్నార్డ్ హార్డెల్ అన్నారు. సహచర వైద్యుడు జెల్ హాన్సన్ కూడా ఈ పరిశోధనలో పాల్గొన్నారు. ప్రపంచంలో సెల్‌ఫోన్‌ల వాడకం వలన దాదాపు ఇరవై శాతం వినికిడి సమస్యలతో బాధపడుతున్నారని, ముప్పై శాతం తీవ్రమైన క్యాన్సర్ సమస్యతో బాధపడుతున్నారని తెలుస్తోంది. 'ఆక్యుపేషనల్ ఎన్విరాన్‌మెంటల్ మెడిసిన్' తాజా సంచికలో ఈ విషయాలు ప్రచురితమయ్యాయి. ◆

వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్లు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీ ఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడం గాని వీలు కావడం లేదు. - సర్క్యులేషన్ మేనేజర్

# అసహజ మరణాల సూచి

సంకలనం : **రాంకి, వై. రామచంద్రం**

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంబైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనె మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగానూ వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 21.9.07 నుండి 27.9.07 | 17 | – | 8 | – | – | – | – | 9 | – | – | 12 | 18 | 1 | 5 | – | – | 5 | – |
| 28.9.07 నుండి 04.10.07 | 11 | – | 14 | – | – | – | 9 | 6 | – | – | 13 | 18 | 4 | – | – | – | 2 | 5 |
| 05.10.07 నుండి 11.10.07 | 9 | – | 14 | 3 | – | – | 9 | 10 | – | – | 20 | 20 | 2 | – | – | – | 1 | – |
| 12.10.07 నుండి 20.10.07 | 11 | – | 21 | – | – | – | 8 | 20 | – | – | 30 | 22 | 3 | – | – | – | 1 | – |
| మెదక్ | 12 | – | – | – | – | – | – | – | 2 | – | – | 4 | – | – | – | – | – | – |
| కడప | 1 | – | 7 | 1 | – | – | 1 | – | – | 11 | 37 | – | 9 | – | – | – | – | – |
| గుంటూరు | 1 | – | – | 1 | – | – | 25 | 6 | – | 21 | 18 | 19 | 5 | – | – | – | – | 5 |
| శ్రీకాకుళం | 2 | – | 11 | – | – | – | 3 | – | – | – | 20 | – | 18 | – | – | – | – | 3 |
| **మొత్తం** | **64** | **–** | **75** | **5** | **–** | **–** | **55** | **51** | **2** | **32** | **150** | **101** | **42** | **5** | **–** | **–** | **9** | **13** |

ఈ శీర్షికకు సహకారం అందిస్తున్న వారు : హైదరాబాద్ – డి. విజయభాస్కర్; మెదక్ – కె. రాజు;
కడప – ఎన్.ఎస్. ఖలందర్; గుంటూరు – బి. అంజమ్మ; శ్రీకాకుళం – జి. సుధీర్

*గమనిక : మీ అందరి సహకారంతో అన్ని జిల్లాల పూర్తి సమాచారంతో భవిష్యత్తులో ఈ శీర్షికను మరింత సమగ్రంగా అందించే ప్రయత్నం చేస్తాం.*

# తెలుగు సమాజానికి వెలుగు దివ్వె

**విధానాల విశ్లేషణలు**

ప్రభుత్వ విధానాలు - వాటి పర్యవసానాలపై లోతైన విశ్లేషణలు

**క్షేత్ర నివేదికలు**

వివిధ పథకాల అమలుపై, ప్రజల జీవన స్థితిగతులపై సమగ్ర క్షేత్ర నివేదికలు




**వార్తా విశేషాల కదంబం**

ప్రధాన స్రవంతి పత్రికల్లో అరుదుగా కనిపించే జాతీయ, అంతర్జాతీయ కథనాలు

**అభివృద్ధి చర్చలు**

పోలవరం నుండి యురేనియం ప్రాజెక్టు వరకూ 'అభివృద్ధి'పై సవివరమైన చర్చలు

**ఆలోచింపజేసే గణాంకాలు**

మిమ్మల్ని కదిలించి, రగిలించే అరుదైన గణాంకాలు

**పదునైన వ్యాసాలు**

వివిధ రంగాలలో లబ్ధప్రతిష్ఠులైన వారి వ్యాసాలు, వ్యాఖ్యానాలు

**అధ్యాపకులు, అధికారులు, ఉద్యమకారులు, నేతలు, విద్యార్థులు, సామాన్య పాఠకులు అందరికీ ఉపయోగపడే సమాచారాన్నిచ్చే సమగ్ర ఆర్థిక, సామాజిక మాసపత్రిక**

విడి ప్రతి: రూ. 10/- సంవత్సర చందా: రూ. 120/-

ఎం.ఓ. / డి.డి. పంపవలసిన చిరునామా

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫోన్ / ఫాక్స్ : 040-66843495

